స్కూళ్ల యుపయోగమునకు టెక్స్టుబుక్కు కమిటీవారివలన అంగీకరింపబడినది.

# వనజాక్షి

చరిత్ర సంబంధమైన నవల

శ్రీ వైఖరి సుందరరామయ్యగారిచే

వ్రాయఁబడి

కావ్యపురాణతీర్థ విద్వాన్

శ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారిచేఁ

పరిష్కృతము.





మూడవ ముద్రణము.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటింపబడినది.

1930.

# ఉపోద్ఘాతము.

---

ఆంధ్రభాషాభిమానులారా!

భాషలలో నెల్ల మాధుర్యమునకును మార్దవమునకును బేరుపొందిన మన ఆంధ్రమునం దాఖ్యాయికలు మిక్కిలి విరళముగానుండుట అందఱకును విదితమేకదా! ఈకొఱంతను దీర్పఁబూని ఇప్పుడు పెక్కులు ఆఖ్యాయికా (నవలా) ప్రకటన సంఘము లేర్పడి భాషాసేవ చేయుచున్నవి. ఇట్టికాలమున, శ్రీరాము సేతుబంధనమునఁ జిక్రోడముంబోలె, నాశక్తికొలంది నేను నొక్క యాఖ్యాయికవ్రాసి యాంధ్రభారతీమతల్లిపదములకడ నల్పోపహారముగా నిడి తృప్తిఁజెంద సాహసించితిని.

ఇది చారిత్రకమైన నవల. ఇందు, భారతధర్మోద్ధరణైకదీక్షుండును, విమతకుపతిమత్తమాతంగహర్యక్షుండును యి వెలసినశివాజీయు, ననన్యమహామ్మదీయ రాజన్యప్రకటితశౌర్యధైర్యగుణఖనియు, నదృష్టపూర్వమతాభిమానధనియు గు నౌరంగజీబును, నింకను గొందఱు చరిత్రప్రసిద్ధులగు పురుషులు—ముఖ్యములగు పాత్రలు. దీన పదునేడవశతాబ్ద క్షిణహిందూదేశ రాజకీయ సాంఘికస్థితుల వర్ణించుటయును,

నాకాలమునుండి నేఁటివరకు గూడ హైందవసంఘమును బీడించుచున్న ప్రబలములైన కొన్ని దురాచారములవలని చెడుగులను దెలుపుటయును, నా ప్రధానోద్దేశములు ఇవి యెంతవఱకుఁ గొనసాగినవో చర్చించుట సహృదయులగు వాచకులకు వదలివేయుచున్నాను.

ఇది ఇట్లుండ, దీనిని సచ్చాత్తించి ప్రకటించిన మెసర్సు వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారికి నాకృతజ్ఞతా వందనముల నర్పించుచున్నాను.

వ్యవధిలేమిచేతను, నింకఁ గొన్ని కారణములచేతను నిందు కొన్ని నెఱసులు దొరలినవి. వానికై మన్నింప పాఠక మహాశయు లెంతయుఁ బ్రార్థితులు.

ఇట్లు,

సహృదయవిధేయుండు,

వైఖరి సుందరరామయ్య

గ్రంథకర్త.

# వనజాక్షి

## మొదటి ప్రకరణము.

ఒకనాఁటి ప్రాతఃకాలంబున నుదయాద్రిని సూర్యబింబంబు గన్పట్టి లోకంబున నంతటను నెఱ్ఱనిఛాయఁ బ్రసరింపఁ జేయుచుండఁగా సుమారేఁబది సంవత్సరముల వయసుగల యొక బ్రాహ్మణుఁడు స్నానాదికృత్యంబులఁ దీర్చికొని, విభూతి రేఖలు నొసటను, ఱొమ్మునను, హస్తంబులను నలంది, కంఠంబున రుద్రాక్షపేరు లూని, నీర్కావిదోవతి పంచకచ్ఛలుపోసి ధరియించి, తడియంగవస్త్రమును గుచ్చిళులువెట్టి చేతఁబట్టుకొని విడుల్చుచుఁ దనవలెనే స్నానముచేసి విభూతిఁబూసికొని తనవెనుక నిలుచుకొనియున్న నలుగురు బ్రహ్మచారులకు వేదపాఠము సంతచెప్పుచుఁ, దుర్గాపురములో నిభవానీదేవ్యాలయములో, వాహనమండపమున నిలుచుకొనియుండెను. సుమారు పదునాలుసంవత్సరముల వయస్సుగలదియు, మిక్కిలి మనోహరమైనరూపము గలదియు నగు నొక బ్రాహ్మణబాలిక యాదేవ్యాలయములో గర్భగృహమునకుఁ బ్రదక్షిణము చేయుచుండెను అప్పు డొకముదుసలిబ్రాహ్మణుఁడు కఱ్ఱ నూనుకొని నడచుచు నాదేవాలయములోఁ బ్రవేశించి, గర్భగృహమును జొట్టుకొనివచ్చి, దేవీదర్శనం బొనర్చి మెల్లగా నీబ్రాహ్మణుఁడు సంతచెప్పుచుండు చోటికిఁబోయి యాతఁడు తనకు నమస్కారము

చేయఁగాఁ దానును నమస్కారముచేసి కూరుచుండి వేద పాఠమును వినుచుండెను. కొంతసేపటి కావృద్ధబ్రాహ్మణుఁడు, ప్రదక్షిణముచేయుచున్న సుందరాంగినిఁ జూచి, వేదపాఠము చేయుచున్న బ్రాహ్మణుని దిక్కున ముఖముఁ ద్రిప్పికొని మెల్లగా నిట్లనియెను.

"అయ్యా! మహాదేవశాస్త్రిగారూ! నేను మీతోఁ జెప్పిన రెండువిషయములును మీరు గమనింపకయేయున్నారు. వేదాధ్యయనసంపన్నులును, నైష్ఠికులును, శాస్త్రవేత్తలును నగు తమబోఁటి పెద్దలకు విశదముగాఁ జెప్పుట యనావశ్యకము. అయినను నేను మీకంటె ముదుసలివాఁడ నైనందున మీకుఁ గొన్నిమాటలుచెప్పెదను. మీరీచిన్నదానివిషయమున నావకాశము సేయుటచేత మీకీర్తి ప్రతిష్ఠలకు హాని సంభవించుటయుఁ బెద్దలచేత మీరు నిందింపఁబడుటయుఁ దటస్థించును. ఈ నడుమఁ గొంద ఱీవిషయమును గుఱించి యాచార్యుల వారితోఁ బ్రస్తావముచేసినట్లును నతఁడు తమకు లేఖయును వ్రాసినట్లును దెలియవచ్చుచున్నది. ఒకరిచేత న్యాయము చెప్పించుకొనునట్లు మీబోఁటివా రుండుట సరిగాదు.

మ—నేను రెండుమాసములలోఁ గాశికిఁ బోవలయునని యున్నాను. ఇటువంటిపనులు పుణ్యక్షేత్రములలో జరపుట శ్రేష్ఠము కావున, నచటనే యాకార్యము చేయించవలెనని నిశ్చయించియున్నాను.

వృ—రెండవవిషయమును మీరు ముఖ్యముఁగాగమనింపవలసినదే. "అపుత్రస్యగతిర్నాస్తి" యని శాస్త్రములలోఁ జెప్పియుండుట మీకుఁ దెలియని విషయముకాదు. మీకు సంవత్స

రమునకు రెండువేల రూప్యంబుల యాదాయము నిచ్చుస్థితి యుండియు, వాని ననుభవించుటకుఁ గుమారుఁడొకఁడు లేకుండిన నేమిప్రయోజనము? మీ వెనుక మీ పేరుఁ జెప్పుకొనుటకును, మీ వంశము వృద్ధియగుటకును బుత్త్రుఁడొకఁ డుండవలెను. ఇఁక మీదట మీ భార్యకు సంతానము గలుగుట కష్టసాధ్యము గనుక మీరు ద్వితీయవివాహముఁ జేసికొనుట యావశ్యకమైనపని.

మ — మీరు చెప్పినదంతయు న్యాయముగాఁ దోఁచుచున్నది, గాని యౌవనదశయందుండుకూఁతురు భూలోకసుఖములను మాని దుఃఖసాగరమగ్నురై యుండఁగా నామె కట్టెదుట నేను వివాహముచేసికొనుట బాగుగ నుండునా? అదియునుగాక యేఁబదిసంవత్సరములకు వెనుకఁ బెండ్లి చేసికొనుట యుక్తముకాదు. “వృద్ధస్యతరుణీవిషం” అని నీతిశాస్త్రమందుఁ జెప్పియుండుట వ్యర్థమగునా? అందులో నొక భార్య యుండునప్పుడు మఱియొకతెను వివాహముచేసికొనుట యుక్తముకాదు. ఏఁబదిసంవత్సరముల వయస్సు చెల్లినతర్వాత పెండ్లిచేసికొని, యవధానులవారేమాత్రము సుఖ మనుభవించిరి?

వృ — దానికేమి! ఆయనకుఁ బ్రాప్తము లేదు. ఆయన కఱువదవసంవత్సరమున గండ ముండినది. ఆ చిన్నది ఆవేళకు రజస్వలకాలేదు. దైవికముగాఁ గలిగిన కష్టముల కెవ రేమి చేయవచ్చును. మీ భార్యకును నీపనిఁ జేయుట సమ్మతిగానే యున్నది. దీర్ఘాలోచనచేయుము.

మ — ప్రయత్న మొనర్చి కష్టము తెచ్చుకొననేల ?

వృ——మీకు యుక్తమని తోఁచినపనిఁ జేయుఁడు. నేను బోవలెను.

ఆవృద్ధబ్రాహ్మణుఁ డిటులఁ జెప్పి సెలవుఁ దీసికొని పోయెను. మహాదేవశాస్త్రులును శిష్యులతోఁగూడఁ దనయింటికిఁ బోయెను. దేవాలయములోఁ బ్రదక్షిణము చేయుచున్న సుందరి శాస్త్రులవారితోడనే యింటికిఁబోయెను.

తుల్జాపురి, దక్షిణ హిందూదేశములో బొంబాయి రాజధానిలోని పునహాపట్టణము చెంత నున్నది. ఈ పట్టణమున శాంకరీదేవి పూర్వకాలంబున మహిషాసురునిఁ జంపెను. ఈ పట్టణ మీకథాకాలంబున (క్రీ. శ. 1657-వ సం॥న) బీజపూరు సంస్థానాధిపతులగు తురుష్కులపాలనమున నుండెను. ఈపట్టణ మప్పుడు వేదాధ్యయన పరాయణులగు విప్రులచేతను, బరాక్రమార్జితైశ్వర్యులగు బాహుజులచేతను, క్రయ విక్రయ నిపుణులగు వణిగ్వరులచేతను, హాలముఖాంతవిభూతి నలరారుశూద్రులచేతను నిండియుండెను. ఆపురిలోని తురంగంబులు త్రొక్కుడు బండ్లవేగంబును, ధూమశకటవేగంబును మించిన వేగముగల యానంబుగలిగి రహిఁగాంచుచుండును. ఆపురిలోని తరుణుల యందంబును, ఠీవియు, ముఖకళయు, వేనోళ్లుగలపడగదాల్పునకును వర్ణింప శక్యంబుగాదు. వారి విద్యలపెంపును మాటల యింపును, పాటలసొంపును, నసమానగరిమ నలరుచుండును.

వనజాక్షియను ముద్దులగుమ్మ యచటి యన్నుమిన్నల కెల్లఁ గన్నాకై వన్నెకెక్కుచుండును. ఆసన్నుతాంగియడుగుల యందమును, దొడవులచందమును, నడబెడంగును, నాసిక సొగసును, బుద్ధికుశలతయు, ముఖవర్చస్సును, దైవభక్తియు,

ధర్మపరత్వము, మాటలతేటయు, పాటలబాగును గనిన మగ వారికిఁ గనులపండువు నొనరించుచుండును. ఈ యంగనా మణి దేవతలందును, బ్రాహ్మణులయందును వినయభయ భక్తులు గలదియు, విద్యాప్రావీణ్యము గలదియు, సూక్ష్మ బుద్ధిగలదియునై యుండెను. ఈమె తల్లిపేరు పార్వతమ్మ. తండ్రిపేరు మహాదేవశాస్త్రులు. వారికి వేఱు సంతానము లేనందున, నతనికిఁ దన పిత్రార్జితభూములలోను, పురో హితవృత్తిలోను విశేషముగా నాదాయము వచ్చుచుండుట చేతను, మిక్కిలి గారాబముతో నీమెను బెంచెను. ఈ మెను జిన్నతనంబున నెనిమిదవయేట సమీపబంధుఁడగు నొక బ్రహ్మచారికిచ్చి పెండ్లి చేసిరిగాని, యతఁడు వివాహ మైన మఱుసటి సంవత్సరముననే కాలధర్మము నొందెను. ఈమె నిత్య మరుణోదయకాలమున లేచి స్నానముచేసి భవానీ దేవాలయమున కేగి, ప్రదక్షిణనమస్కారము లొనర్చి, మఱల గృహమునకు వచ్చుచుండును.

పార్వతమ్మకుఁ బురుషసంతానము లేని కొదువచేతఁ గలి గినవిచారము నానాఁటికి నెక్కువాయెను. ఆమె యెన్నియో వ్రతములు చేసియు నెన్నియో ప్రార్థనలు చెల్లించియుఁ గుమారుఁడు గలుగక పోవుటచే నామెకు నలువది సంవ త్సరములకంటె నెక్కువగా వయస్సయినందునను దనభర్తకు వేఱొక వివాహముఁ జేయించిననేతప్ప తమకుఁ బుత్త్రుఁడు గల్గుట యసాధ్యమని నిశ్చయించి వివాహముఁ జేసుకొమ్మని, భర్తను బ్రార్థించుచుండును. మహాదేవశాస్త్రులును దన భార్యయైన పార్వతమ్మమీఁదఁ బూర్ణానురాగముఁ గలిగినవాఁ

దగుటచేత వేఱొకతెను వివాహము చేసికొనుటకు సమ్మతి పడకుండెను గాని, పలుమాఱు పార్వతమ్మ బోధించుటచేతను, దనకుఁ బ్రియులగు బ్రాహ్మణులు కొందఱు పట్టుదలతోఁ జెప్పుటచేతను, గొన్ని దినములకుఁ దరువాత వివాహము చేసికొనుటకు నొప్పుకొనెను.

ఆసమయంబునఁ గామేశ్వరశర్మ యనుబ్రాహ్మణుఁడొకఁడు సుమారు పండ్రెండుసంవత్సరములవయస్సుగల తనచెల్లెలితోడను, నేఁబదిసంవత్సరముల వయస్సుగల తన పినతల్లితోడను, దుర్గాపురమునకు వచ్చి శాస్త్రిగారుండు వీధిలోనే దిగియుండెను. అతని చెల్లెలు గంగాబాయి యనునది, యిప్పటికిఁ గన్యకగా నుండెను. కాన తనచెల్లెలి నొకధనికునకిచ్చి, విశేష ద్రవ్యము శుల్కముగాఁ గొనవలయునని కామేశ్వర శర్మకుఁ దలంపు గలదు. తనకోఱిక ప్రకార మదివఱకు మనువు తటస్థపడనందునఁ దనచెల్లెలికి వివాహము చేయకుండెను మహాదేవశాస్త్రి ధనికుఁడనియు, మరల వివాహమాడ యోజించి యున్నాఁడనియుఁ దెలిసి, తనప్రియురాలగు బాలామణి యనఁ బడు వేశ్యయొద్దకుంబోయి, యావివాహ మెట్లైన నామె సమకూర్పవలెననియు, నట్లు సమకూర్చిన నామెకు నూఱురూప్యములు బహుమానముగా నిచ్చెదననియుఁ జెప్పెను, అందులకాబాలామణి యొప్పుకొని తనచేతనైనంత ప్రయత్నము తాను జేసెదనని చెప్పెను. ఆమె కొన్నిదినములవఱకు వేఁచియుండి యొకనాఁడు శాస్త్రిగారియింటికిఁబోయి, పార్వతమ్మతో మాటలాడుచుండి గంగయొక్క సౌందర్య గుణాతిశయములను వర్ణించి యామె కింకను వివాహముగా లేదని చెప్పెను. పార్వ

తమ్మ తనభర్త కా కన్యనిచ్చుటకు వారికి సమ్మతియుండునా యని విచారించి, యాసంబంధము పొసఁగునటులఁ జేయుమని బాలామణిని వేఁడుకొనెను. బాలామణి వల్లెయని యింటికిఁ బోయి మఱునాఁడు కామేశ్వరశర్మను గని జరగిన వృత్తాంత మంతయుఁ దెలిపెను. కామేశ్వరశర్మ యందులకు సంతసించి వేయిరూపాయలు కన్యాశుల్కముగానిచ్చి నగలుపెట్టి పెండ్లి కగువ్యయములును నతండే భరించెడుపక్షమునఁ దనచెల్లెలి నిచ్చుటకు సిద్ధముగ నుండునటులఁ దెలుపుమని బాలామణితోఁ జెప్పెను. బాలామణి నాలుగుదినములుండి పార్వతమ్మ దగ్గఱకుఁ బోయి, యీసమాచారమంతయుఁ దెలిపెను. ఆమెయు నా సంగతియంతయుఁ దనభర్తకుఁ దెలిపి, యతఁడు సమ్మతించునటులఁ జేసెను. పిమ్మట శాస్త్రిలవారు, మధ్యవర్తులగు బ్రాహ్మణుల వలనఁ గులగోత్రములను విచారించి జాతకమును దెప్పించి చూచి సమస్తవిధంబులఁ బొసఁగియుండుట దెలిసికొని, పైఁ జెప్పినప్రకారము కన్యాశుల్కధనము సమర్పించి నగలుపెట్టి వివాహోత్సవము మిక్కిలి వేడుకగా జరిపించెను.

కామేశ్వరశర్మకును మహాదేవశాస్త్రిలకును, నీసంబంధము వలన విశేషబంధుత్వమును, స్నేహమును గలిగెను. కామేశ్వర శర్మ శాస్త్రులవలెనే చక్కఁగాఁజదువుకొనినవాఁడు అతఁడుచిన్న తనమునఁ దర్కమీమాంసాదిషట్ఛాస్త్రములనుఁ జక్కగా నభ్యసించెను. ఇరువురును జిన్నప్పుడు వేదాధ్యయనము చేసిన వారలే కాని కామేశ్వరశర్మ శాస్త్రిలవారివలె వైదికవృత్తిలో నుండినవాఁడుకాఁడు. కామేశ్వరశర్మ చిన్నప్పటినుండియు శివాజీ యనుమహారాష్ట్రముఖ్యునితో స్నేహముచేయుచుండి,

యప్పు డాతనిపక్షమున మహారాష్ట్ర రాజకీయ వ్యవహారములను జూచుచుండెను. ఇరువురును బీజపూరు సంస్థాన ప్రభువులగు తురుష్కులపాలనకు లోఁబడిన రాజ్యములో నివసించుచుండిరి.

కామేశ్వరశర్మ తుల్జాపురికిఁ బడమట రమారమి యిరువదిమైళ్లదూరమున నుండెడి పడమటికనుమలలో నివసించుచుండెను. ఈ ప్రదేశమునఁ గొండలు మెండుగ నుండుటచేతను భయంకరారణ్యములు దీని జుట్టుకొనియుండుటవలనను, నిది శత్రువులకు దుర్గమంబుగను, నివాసము చేయువారికి భద్రముగ నుండుటచే మహారాష్ట్రులందఱును బడమటి కనుమల సమీపమునఁ జేరి, కోటలు గట్టుకొని స్వేచ్ఛగా నివసించుచుండిరి. అచ్చటనుండెడి మహారాష్ట్రులను దురుష్క ప్రభువు లెప్పుడును జయించి వారిదేశమును జక్కగా స్వాధీనపఱచుకొనలేకుండిరి. ఇదివఱకు బీజపూరు సంస్థానము మంచిస్థితిలో నున్నందున మహారాష్ట్రులు వారిజోలికిఁ బోవుటకు వెనుదీయుచుండిరి. తురుష్కప్రభువులు వారిని సరకుగొనకుండిరి. ఇప్పుడు బీజపూరు ప్రభువునకు డిల్లీ చక్రవర్తితో యుద్ధము కల్గినందున, బీజపూరు ప్రభుత్వము క్షీణదశకు వచ్చియుండెను. తురుష్కప్రభువు లొండొరులతో యుద్ధము చేయుచున్నందున హిందువులు స్వాతంత్ర్యము సంపాదించుకొనుటకు నాసమయము తగియుండెను కనుక శివాజీ మొదలగుమహారాష్ట్రులీసందర్భమును గనిపెట్టి, కొంచెము కొంచెముగ బీజపూరు సంస్థానమునకు లోఁబడియున్న దేశమును బట్టుకొనుటకుఁ బ్రారంభించుచుండిరి.

మహారాష్ట్రులకు నీకాలంబున శివాజీ యనునతఁడు ప్రభువుగనుండెను. ఇతఁడు క్రీస్తుశకము 1627-వ సంవత్సరమున జన్మించి, 1646-వ సంవత్సరమున టోర్నియా యను కోటను, 1647-వ సంవత్సరమున సింఘుడు, పురంధర్, అను కోటలను బట్టుకొనెను. ప్రస్తుతము చుట్టుపట్టులనున్న మహారాష్ట్రుల నందఱ నొక్కటిగఁజేర్చి, బీజపూరు సంస్థానమును బట్టుకొనవలెనని యోజించి దానికిఁ దగిన యేర్పాటులను జేయుచుండెను.

ఇటుల నొనర్చుటకుఁ గామేశ్వరశర్మ యొక కార్యనిర్వాహకుఁడుగా శివాజీచేత నియమింపఁబడి యందులకై తుల్జాపురమునకు వచ్చియుండెను. కామేశ్వరశర్మ తుల్జాపురమునకు వచ్చినపిమ్మట, శాస్త్రులవారికిఁ దనచెల్లెలి నిచ్చినందునఁ దాను వారింటికిఁ బలుమాఱు పోవుట తటస్థించెను. అటుల నప్పటప్పటికి వచ్చుటంజేసి శాస్త్రులవారికూఁతురగు వనజాక్షి యందచందముల బాగుగఁదెలిసికొని యామె నెట్టులైన వశపఱచుకొననిశ్చయించుకొని, తనప్రియురాలగు బాలామణిం బిలిచి యమ్మోహనాంగిం దనకుఁ జార్చియిమ్మని వేడుకొనెను. అందులకు బాలామణి యొప్పుకొనెను గాని యామెకు వనజాక్షితో నీవిషయమును గుఱించి మాటలాడుటకైన సాధ్యపడలేదు. తనచెల్లెలు గంగాబాయితోను, నదేప్రకారము చెప్పెను గాని యామె దాని కొప్పుకొనలేదు. కామేశ్వరయ్యకు వనజాక్షిమీఁద నానాఁటికి మరు లధికమగుచుండెను. కావున నవ్వనజాక్షి యొంటరిగా నుండుసమయముగనిపెట్టి, తనమనుష్యులను గొని యామెను వేఱొకయూరికి బలత్కారముగా నెత్తించు

కొని పోయి, తనకోరికను దీర్చుకొనవలెనని నిశ్చయించు కొనియుండెను. బాలామణియును నావిషయమున సాధ్యమై నంత సహాయ్య మొనర్చెదనని చెప్పెను.

---

## రెండవ ప్రకరణము.

ఒకనాఁడు సూర్యోదయము మొదలుకొని సాయంత నమువఱకు నెడతెగక యాకసమంతటను నీలమేఘములు తెరలుతెరలుగా వ్యాపించి యేకధారగా మిన్ను మన్నేకమై యున్నట్లు వర్షించుచుండెను. చల్లనిగాలి నీటితుంపురులతోఁ గూడి బాగుగ వీచుచుండెను. భూమియంతయుఁ బంక సంకలితమై యుండెను. ఇప్పుడు చెప్పఁబోవుసందర్భము లొకకొండకుఁ బ్రక్కనునుండు పల్లెలో జరగినవి. ఆపల్లెలో నొకయేఱు పాఱుచుఁ బొలములకు జలసమృద్ధి గలిగించుచుండెను.

వెన్నులునిండినవరిపంటయు, మొలయెత్తునకుఁ బెరిగియుండిన ప్రత్తిచెట్ల గుంపును దూరముననుండి చూచువారి కగపడుచుం డెను. ఆపొలములకు నడుమ నుత్తరదక్షిణమార్గముగా నొక బాట యుండెను; పొలముల కుత్తరముగాఁ గొన్నియిండ్లును, దేవాలయములును గనఁబడుచుండెను. కొండమీఁద నెక్కి చూచువారికి నాదేవాలయమున కుత్తరముగా మరల బాటయు నిరువంకల వరిపొలములును రెండుమైళ్ళవఱకు వ్యాపించియుం డుటయు వానికుత్తరముగా నింకొకపల్లెయుండుటయుఁ దెలి యును. ఆపల్లెలకుఁ బెద్దకనుమయనియుఁ జిన్నకనుమయనియుఁ బేర్లు. ఆకొండక్రిందిగుహకు ముందుప్రక్కన నొకమఱ్ఱిచె ట్టుండెను. ఆచెట్టనేకశతాబ్దములనుండి యుండెను గనుక,

ఊడలు భూమికిదిగి యాయూడలలోనుండి మఱల శాఖలు పొడముచుండెను. ఆ మఱ్ఱిచెట్టునకును గుహకును నడుమ దేవాలయ మొకటియుండెను. అందులోపల నీశ్వరలింగ ముండెను. ఆలింగమునకు సంవత్సరమున కొకదినమున మాత్రము ప్రక్కయూరినుండి వచ్చి బ్రాహ్మణులు పూజసేయుదురు. ఈగుడియందు దోపిడిదొంగలు దాగియుండుటయు, దొంగిలించిన ధనమును బంచుకొనుటకై వారు గుంపు కూడుటయుఁ గలదు.

నాఁ డాదేవాలయపు ద్వారమున ముగ్గురు మనుష్యులు పొడవైన కత్తులను ఖేటంబులను జేతఁబట్టుకొని నిలిచియుండిరి. మూఁడుతుపాకులు లోపలిగోడ కానింపఁబడియుండినవి. అందులో నొకదానికి బంగారుపూత పూయఁబడి యుండెను. ఆతుపాకులలో మందు గట్టనచేయబడి కాల్చుటకు సిద్ధపఱుపఁబడియుండెను. వారుముగ్గురు నొకరుమార్చి యొకరు ప్రక్కనున్న తిప్పపై నెక్కి, దారివంకఁ జూచుచుండిరి.

వారిలో నొకఁడుమాత్రము నల్లకంబళి కప్పుకొని పాగా ధరించుకొనియుండెను. ఇతనికి నిరువదిసంవత్సరముల వయస్సు. ఇతఁడెఱ్ఱనిచాయగలవాఁడు. తక్కినయిద్దఱును మోకాటికిఁ బైఁగాఁ జల్లడములు తొడుగుకొని యుండిరి. వారిరువురును బొట్టిగను, నల్లగను, దృఢముగను నుండిరి. వారించుమించున ముప్పదిసంవత్సరములకు లోఁబడినవయస్సుగలవారై యుందురు. ఒకనిపేరు గుండఁడు. మరియొకనిపేరు కుప్పఁడు. ఎఱ్ఱవానిపేరు గోపినాథసింగ్. అతఁడు తక్కినయిద్దఱికి యజమానుఁడు. అప్పుడు వారిసంభాషణ యిట్టుల జరిగెను.

గోపినాథ——కుప్పా! ఏమి వాఁడిప్పటికిని రాలేదు. నేఁడు తప్పక బయలుదేఱి, ఆలందూగ్రామమునకుఁ బోవలయునని నిన్న గోసాయివానితోఁ జెప్పుచుండెను. హుండీమూర్చి సవరములుకూడ వాఁడు నిన్న తీసుకొనెను. నేటిమధ్యాహ్నము గోసాయీమఠములో నుండినను,సాయంతనములోపల నీప్రదేశమును జేరవలెను. నీ వాయూరివఱకును బోయి చూచి, వాఁ డచటనుండినఁ దోడువచ్చెదనని నమ్మికచెప్పి పిలుచుకొని రమ్ము. వాడు దారిలో నెదురుగ నగుపడిన మఱల రమ్ము.

గోపినాథసిం గిట్లు త్తరవుచేయఁగనే కుప్పఁడు వెడలి పోయెను.

గుం——అయ్యా! ఒకవేళ నాయూరి పెద్దకాఁ పతనీ దారినిఁబోఁగూడదని చెప్పి వేఱొకదారినిఁ బంపియుండునా?

గో——వానికి గుండెలు పదునాఱా! వాఁ డటుల జేసిన వాని పశువులుపోవుటయు, నూరు తగులఁబడుటయు మాపిన తండ్రియగు ప్రహార్సింగువలనఁ గలుగునని వానికిఁ దెలియును. ఆ సందేహము పని లేదు.

గు——మహారాజా! వాఁ డిచటికి వచ్చినతరువాత ధనమును దోఁచుకొని వానినిఁ జంపి బావిలోఁ ద్రోయవలసినదే గదా?

గో——కూడదు. వాడు దూరదేశమునుండి వచ్చుచున్నాఁడు. ప్రహారసింగునొద్దకుఁ దీసికొని పోవలసినది. ఒకవేళ వానివలన నెక్కువ లాభ ముండును. అది యాయనకు మాత్రమే తెలియవచ్చును.

వారిటుల మాటలాడుచుండినపుడు కుప్పఁడు సమీపమున నున్న పెద్దకనుమకుఁ బోయిచేరి యావేళకుఁ బెద్దకాపు

కరణము మొదలగువారొకతిన్నె మీఁదఁ జేరియుండుటం గని వారిచెంత కేగి క్రొత్తమనుష్యుఁ డెవఁడైన నచటికి వచ్చియుండెనా యని యడిగెను. వారిదివఱ కెవరును రాలేదని చెప్పి వానికి మిక్కిలి మర్యాదతో భోజనము పెట్టించిరి కుప్పఁడు భోజనముచేసి బైటికివచ్చెడువేళఁ దనచే నెదురుచూడఁబడుచుండిన మనుష్యుఁడగు లాల్సింగు అనువాఁ డాయూరికివచ్చి చేరి, పెద్దకాఁపుదగ్గఱకువచ్చి, దాను శీఘ్రముగఁ బోవలెననియు, దోడుగావచ్చి దారిచూపుట కొకమనుష్యునిఁ బంపుమని యతని నడుగుచుండెను. ప్రహరసింగుయొక్క పొడ్జన్యమును, కుప్పఁ డతనిమనుష్యుఁడైనదియు, బెద్దకాపునకు బాగుగాఁ దెలిసియున్నందు ననతఁడు తనయెదుటనున్న కుప్పఁడు తగినతోడని చెప్పి, తనకు ప్రహరసింగువలనఁ గీడు రానిమార్గము చూచుకొనెను. అప్పుడు కుప్పఁ డతనిఁ జూచి యిట్లనియె.

కు—అయ్యా? మీపేరేమి? మీయూరెద్ది చెప్పుము.

బాటసారి—నాపేరు లాల్సింగు.మాది యుత్తరదేశము.

కుప్పడు—లాల్సింగుగారూ! మీవంటివారికి దారి తోడుగాఁ దిరుగుచు, మీరిచ్చు స్వల్పధనముతోఁ గాలక్షేపము చేయుచుండుటయే నాజీవనము. నాయం దీయూరివారికందఱకును బూర్ణమైన నమ్మకము గలదు. నాయోగ్యత యెల్లరెఱుఁగుదురు.

లాల్సింగు—దారిలో నేమియుఁజోరభయము లేదుగదా?

కు—మనము ప్రొద్దుండఁగాఁ బోయినట్టయిన నాభయము లేదు. ఇంక నాలుగుగడియల ప్రొద్దున్నది. మనము నాలుగుమైళ్ళదూరమే పోవలసినది. ఐనను శీఘ్రముగా బయలు

దేటువు. వానయు నిలిచియున్నది మీాసొమ్ము నాసొమ్మువలె చూచుకొనెదను భయపడకుము.

అంతట వారిరువురును బయలువెడలిరి. లాల్సింగు గుఱ్ఱముమీాఁదను, వెనుక కుప్పఁడు గాల్నడకతోను బోవుచుండిరి. కుప్పఁడు లాల్సింగును బహువినయముతోను మర్యాదతోను బిలుచుకొనిపోయి, యాకొండకు సమీాపముగానుండు ప్రదేశము చేరెను. గోపీనాథసింగును గుండఁడును దూరము నుండి వీరినిఁజూచి, చుట్టుకొనివచ్చి, లాల్సింగు గుఱ్ఱమువెనుకకువచ్చి చేరిరి. అప్పుడుగోపీనాథసింగు వెనుకనుండి యిట్లనియె.

గో—మహారాజ్! నమస్కారము.

లా—(తిరిగిచూచి) ఎవరు మీారు?

కుప్పఁడు—అయ్యా! ఈయన మాయజమానుఁడు. వాఁడు నా సహోదరుఁడు నాకొఱకై వచ్చిరి. మీారు వేఱే సందియము పడకుఁడు.

గో—(నవ్వుచు) అయ్యా! భయపడవలదు. మీారు నిన్న కల్యాణీగ్రామములో గోసాయిమఠములో నుండలేదా?

లా—ఉంటిని. మీారచటికి వచ్చియుంటిరా?

గో—నిన్న నామనుష్యులను దోడుపంపెదనని చెప్పఁగా నీవు పనిలేదని చెప్పియుండలేదా?

లా—నే, నే, నే, నేను బడలియుంటిని, మీా రవసరముగా......పోతిరి (అని తడబాటుతో మాట్లాడెను.)

గో—నీవుఢిల్లీచక్రవర్తియొద్ద నుండినట్లును, బీజాపూరు సంస్థానాధిపతి దగ్గఱకు బోవునట్లును వింటిని. సంధిమాట్లాడుటకుఁ గాఁబోలు.

లా—(మిక్కిలి భయముతో) ఎవరు చెప్పిరి ?

గో—సరి అదియేల? మనము దూరము పోవలసియున్నది. శీఘ్రముగా రమ్ము.

ఇటుల వారు మాటలాడుచు ముందు చెప్పిన దేవాలయము చెంతకుఁ బోయిరి. గోపీనాథసింగ్, కృష్ణుఁడు, గుండఁడు దమతమ తుపాకులను జేతికెత్తికొనిరి.

లా—ఇది భయంకరమైన ప్రదేశముగా నున్నది. ప్రహారసింగు మనుష్యులీచుట్టుపట్టులఁ దిరుగుచుందురనియు వారికంటఁబడుట యపాయకరమనియు వింటిని.

గో—ప్రహారసింగు గొప్ప మనుష్యుఁడు. శూరుఁడు నిష్కారణముగా నొకరిజోలికిఁ బోయెడివాఁడు కాఁడు. లోభులతనిని నిందింతురు.

లా—సన్న్యాసులకు భయముండదు. మిగిలిన వారికందఱకు లోభత్వము కొంచెమో యెక్కువో యుండకపోదు గదా. అన్యాయముగ నొకరిసొమ్ము దోచుకొనువాఁడు నింద్యుఁడుగదా?

గో—అన్యాయమేమి? సొమ్ముగలవాఁడు సరియైన జాగ్రత్తతో నుండవలెను. ప్రతిమనుష్యునకును ధనాశ యుండుటచేత వానివానిశక్తికొలఁది ధనమార్జించుట ధర్మము కాదా. సొమ్ముగలవానికి జాగ్రతనేర్పుట సత్కారముగదా. మాసహాయముండువఱకు నీకితరులవలన భయము లేదు.

ఇటుల వారు మాటలాడుచుఁ గొంతదూరము పోఁగా సూర్యాస్తమయ కాలమయ్యెను. ఆకాశము నిర్మలమై నీలముగ నుండెను. కొంతదూరముపోఁగా దారిలో నొక చిన్ననది

యగుపడెను. చుట్టుప్రక్కల మనుష్యసంచారము లేకుండెను అట్టితఱిని నలుదట్టులఁగని గోపీనాథిట్లనియె.

గో—లాల్సింగు! నీవు గుఱ్ఱమునుండిదిగి కొంత బడలికఁ దీర్చుకొనుము. నే నీనదిలో సంధ్య వార్చి మరలివచ్చెదను.

లా—నేను దిగను. గుఱ్ఱముపైనుండియే మీారు వచ్చువఱకుఁ గాచుకొని యుండెదను. మీా మనుష్యులుకూడ నీరు ద్రాగి దప్పి దీర్చుకొని రావచ్చును.

గో—(లాల్సింగునకుఁ దెలియని కన్నడ భాషలో) కుప్పా! వీనిని నమ్మఁగూడదు మీా రిరువురు నిరుప్రక్కల వానినిఁ గాచియుండుఁడు. కదలినట్లయినఁ దుపాకితోఁ గాల్చి వేయుఁడు.

గోపీనాథసిం గిటులఁజెప్పినతోడనే గుండఁడు లాల్సింగు గుఱ్ఱముయొక్క పగ్గమును (లగామును) పట్టుకొని దాని కొక త్రాడుగట్టి యాత్రాటిని దననడుమునకుఁ జుట్టుకొనెను.

లా—ఏమిచేయుచున్నావు? దానిని విడువుము.

గుం—తమరింక దిగవలసియున్నదే. గుఱ్ఱము నెవరు పట్టుకొందురు.

లా—నేను దిగను. ముందులగామును వదలుము.

(గోపీనాథ్ వంకఁజూచి) అయ్యా! జమీాన్దారుగారూ! నన్నేల దొంగను గట్టించినట్లు గట్టించితిరి.

కుప్పఁడు—ఆయన సంధ్యవార్చుచున్నాఁడు. ఇప్పుడు నీతో మాటలాడఁడు.

అప్పుడు లాల్సింగు తప్పించుకొని పోవుటకై గుఱ్ఱముయొక్క లగామునకుఁ గట్టియున్న త్రాటిని విప్పెను. గుఱ్ఱము

కదలఁగానే గుండఁడు లాల్సింగుమీఁదికి దుమికి వాని రెట్టను బట్టుకొనెను. కుప్పఁడు ముందుకు దుమికి గుఱ్ఱముయొక్క లగామును బట్టుకొనెను. లాల్సింగు గుండని చేతినుండి విడిపించుకొనుటకుఁ బ్రయత్నముచేయఁగా గుండఁడు వానినిఁ బట్టి క్రిందికిఁ ద్రోసెను. గోపీనాథసింగాసంకులమును జూచి, పరుగున నచటికివచ్చి క్రిందఁబడియున్న లాల్సింగుతో నిట్లనియె.

గో—లాలా! నీకు వీరితోఁ గలహమేల కలిగినది? నీకేమైన గాయము తగిలినదా?

లా—అయ్యా! గాయములేదు. నాప్రాణమును రక్షింపుము. నన్నుఁ జంపకుము.

గుండఁడు—జమేదారుగారు! నాకు గాయముతగిలినది. వాఁడు నామీఁదఁ బడినందుననే గాయమాయెను. ఇదిగో చూడుము.

కుప్పఁడు—కొట్టినందున లాలా నడువవలెను. గాయము చెందిన గుండఁడు గుఱ్ఱముపై నెక్కి రావలెను.

గుండఁడు—రాత్రి వేళలో వానిని నమ్మరాదు. ఒకవేళ పాఱిపోవచ్చును వాని కాళ్లను జేతులను గట్టి గుఱ్ఱముమీఁద వానినిఁ బెట్టి పట్టుకొని రావలెను.

గోపీనాథసింగును, నటులనే చేయవలసినదని చెప్పఁగా వారటులనే చేసి గుఱ్ఱమును దోలుకొని పోవుచుండిరి. లాలాను బ్రహారసింగునొద్దకుఁ గొనిపోవునట్లును, నతనియొద్దనున్న బంగారమును బ్రహారసింగు తీసుకొనుననియు నతనికిఁ బ్రాణభయముమాత్రము లేదనియు దారిలో గోపీనాథసింగు లాల్సింగునకుఁ జెప్పెను.

---

## మూఁడవ ప్రకరణము.

---

వారంతటఁ గొంతసేపటికి ప్రహారసింగుని వాసస్థానమైన "ఇట్గా" గ్రామమును జేరిరి. ఆగ్రామము మిగుల నేత్తైన యొక ప్రదేశమునఁ గట్టఁబడియుండెను. ఈగ్రామమంతయు ప్రహారసింగుయొక్క స్వంతభూమిగానుండెను. యుద్ధసమయమున బీజపూరు నవాబునకు సాయ మొనర్చుటకై యిది వారిచేత నితని తండ్రికీయఁబడెను. వేయిమంది యుద్ధభటులను దనస్వాధీనమందుంచుకొని వారినిఁ బోషించుచుండుటకు నీయిట్గాగ్రామమును దాని చుట్టుప్రక్కలఁ గొన్ని గ్రామములును సిస్తులేక యియ్యఁబడినవి. ప్రహారసింగు వంశపారంపర్యపు హక్కుమీఁద నాకాలపువాడుకప్రకార మాపని నేచూచుచువచ్చెను. ఇతఁడుతండ్రివలెఁ గ్రమముగాఁ బనిచూడక తనక్రిందనుండు మనుష్యులను, గొల్లలఁ గొట్టుటకును, బాటసారులను దోచుటకును, నియమించుచు, వారలచే సంపాదింపఁబడినధనములోఁ దానుకొంత భాగమును గైకొనుటచే ధనము ప్రోగుచేయుచుండెను. ఇట్గా గ్రామమునకు సమీపముననుండు పల్లెలవా రందఱును తమ సొత్తులను గాపాడుకొనుటకై సంవత్సరమున కింతయని ప్రహారసింగుగారికిఁ బన్నుఁ జెల్లించుచుండిరి. అటులఁ బన్నుఁ జెల్లించుచుండినవారి జోలికిఁ దనమనుష్యులు పోకుండుటయేగాక యితరులవలనఁగూడ వారలకు నుపద్రవము రానీయక ప్రహారసింగు చూచుచుండెను. ఆదినము రాత్రి గోపీనాథసింగు మొదలగువా రిట్గా గ్రామమునకువచ్చి చేరువేళకుఁ బ్రహారసింగు

తనమేడమీఁదఁ గూరుచుండి తనలేఖకుఁడగు నమృతరావు ధనరాశి నెంచుచుండఁ జూచుచుండెను.

అమృతరావు—ఇరువది తొమ్మిదివేలు తొంబదిమూఁటయెనుబదియాఱురూపాయీలున్నవి. నేఁటిసంపాదనముమిగుల గొప్పది లెక్కపుస్తకములో చేవ్రాలు చేయుఁడు ప్రొద్దైనది.

ప్రహారసింగ్—ఉండనిమ్ము. నేను చేవ్రాలుచేయను. ధనరాశితో నాకేమి కావలసినది వాఁడు వచ్చునటు లగుపడదు. నేను గాశీకైనను రామేశ్వరమునకైనను బోయెదను. నేను మిక్కిలి పాపమును జేసితిని.

ఇఁకమీఁదట నాపాపములు నశించుటకుఁ దీర్థయాత్ర చేయవలెను. (నిదానించి) దైవాధీనము. మార్గమునం దుపాకి శబ్దము వినఁబడుచున్నది. గుఱ్ఱపు సకిలింతయు వినఁబడుచున్నది. వాఁడే యుండవచ్చును. లేచి చూడుము.

అమృతరావు—(లేచిచూచి) నిశ్చయముగా వారే. ఆశబ్దము వాని తుపాకిప్రేటుయొక్క ధ్వనియే.

ప్ర—ముందుగా రెండుదివ్వెలువేయింపుము. పెద్దవిగా నుండవలెను. వేడినీరును భోజనమును సిద్ధము చేయింపుము. వానితోఁగూడ ముగ్గురు వచ్చునట్లు గనఁబడుచున్నది. గుఱ్ఱపు సకిలింతయు వినఁబడుచున్నది.

వారిటుల మాట్లాడుచుండఁగా గోపీనాథసింగును, మఱి ముగ్గురును బ్రహారసింగు నింటి సమీపమునకు వచ్చిచేరిరి. పనివాండ్రు కొందఱు దివ్వెటీలను బట్టుకొని యతఁడు వచ్చు దారిలో నిలిచిరి.

కొంద ఱెదురుగాఁ బోయి గొఱ్ఱెలను జుట్టివిడిచిరి. కొంతసేపటికి గోపీనాథసింగింటికి ముందఱ నిలిచి, లాల్సింగును దింపి గుఱ్ఱము నొకచోటఁ గట్టించెను. ప్రహారసింగు గుమ్మముదగ్గఱకువచ్చి గోపీనాథసింగునుజూచి సంతసించెను.

ప్ర—గోపీనాథా! ముందు స్నానముచేసి భోజనము చేయుము. తక్కినసంగతులు వెనుక విచారించెదను.

గో—ముందుగా నేను దెచ్చినమనుష్యునిసంగతి తీర్మానము కావలెను. వీఁడు చక్రవర్తియొద్దనుండి వచ్చునటులఁ దెలియవచ్చుచున్నది. వీనియొద్ద విశేషధనముకూడ నున్నది. ఇప్పుడు వీనియొద్దనున్న వస్తువుల నన్నింటినిఁ దీసి మూట గట్టించితిని. రూపాయలసంచియు నీమూటలోనే యున్నది. తమ యుత్తరువున కెదురుచూచుచు వీని నిచ్చటఁ గట్టించితిని

ప్ర—శహబాస్! వేగులవాఁడా! (లాల్సింగునుజూచి) ఎవఁడవు నీవు?

కుప్పఁడు—లాలాగారూ! ముందుగా నేలినవారికిబదులు చెప్పఁడు. బదులు చెప్పకున్న నాయనకుఁ గోపమువచ్చును.

లా—కాపాడుము, కరుణింపుము, రక్షింపుము.

ప్ర—(తన మనుష్యులతో) మీరందఱును దూరముగాఁ బొండు. (లాల్సింగుతో) ఎక్కడనుండివచ్చితివి? ఎక్కడికిఁ బోవుటకై వచ్చితివి? వివరముగాఁ జెప్పుము.

లా—నేను డిల్లీనుండి బీజపూరుకు నా స్వంతపని మీఁదఁ బోవుచుంటిని.

గోపీ—అది యబద్ధము. నిజముచెప్పకున్నఁ బ్రాణముల కపాయము గలుగును. నిజము చెప్పుము.

లా—నేను జెప్పినదంతయు నిజమే. నేను వేఁగులవాఁడను గాను.

ప్ర—వీనిచేతులకుఁ బ్రత్తిచుట్టించి కాల్పించవలెను. ఆపని చేయుట మంచిది. దెబ్బకు దయ్యము వెఱచును.

సుప్పేఁడు—(ఒకగుడ్డను జేలికలుగాఁ జించి యాముదములో ముంచి లాల్సింగు వ్రేళ్ళకుఁ జుట్టుచు) లాల్ జీ, మేము మొరటుమనుష్యులమనియు నీవు జాగ్రత్తగా నుండవలెననియు నేను జెప్పియుండలేదా? ఇంక నీవ్రేళ్లను దగులఁబెట్టుదుము. అప్పుడు నీబాధ చెప్పఁదరముగాదు. దానికి నీ వొకవేళఁ దాళుకొన్నను, దానికంటెఁ గ్రూరమగు వేఱొకహింస చేయుదుము. ఆయనకచకచయను వేళకునిన్ను ...... తెలిసియేయున్నదిగదా?

లాల్సింగు—అయ్యా! ప్రభువుగారూ, ప్రభువుగారూ, కాపాడవలెను. నన్నుఁ బ్రాణములతోఁ దగులఁబెట్టకుఁడు. నిజము చెప్పెదను.

ప్ర—సరి. లెమ్ము, మాదక్షిణదేశపు వాడుకలు నీకుఁ దెలియవు. లేకున్న నీతో నిన్నిమాటలాడను. ఎవరు నిన్నంపినది? ఔరంగజీబా? అతఁడిప్పుడు నీకు సాహాయ్యము చేయలేఁడు.

లా—అయ్యా; నేనిపుడు మాటలాడలేను. కట్లు విప్పింపుము. నిజము చెప్పెదను. తమకుమాత్రము దెలిసియుండవలెను రహస్యవిషయములు చెప్పవలెను

ప్ర—(తనమనుష్యులవందఱ నావలఁ బొమ్మని) శీఘ్రముగాఁ జెప్పుము. ఇఁక నీవబద్ధమాడిన నీతలపోవును. నిజము చెప్పుము. తర్వాతఁ గట్లు విప్పించెదను.

లా__అయ్యా! మీకెవరికైన బీజపూరు మంత్రిగారి ముద్రగాని, శివాజీ చేవ్రాలుగాని దెలియునా?

ప్ర__చీ! శివాజీకిఁ జేవ్రాలు చేయను దెలియదు. ఆసంగతి నేనెఱుఁగుదును. మామంత్రిగారి విషయమునఁ దప్పుడు కూతలు కూయకుము

లా__అయ్యా! సత్యమును జెప్పెదను. మీకు సందేహముండిన నామూటను విప్పిచూడుఁడు. అందులో నాచొక్కా జేబులో రెండుత్తరము లున్నవి. దానిలోని ముద్రలఁ జూడుము.

గోపీ__(మూటనువిప్పి జాబుల నెత్తిచూచి) ఇది నిజముగా మంత్రిగారి ముద్రయే. చిన్నాయనా, కావలసిన మీరు చూడుఁడు.

ప్ర__(ఉత్తరములఁజూచి) సీతారామ్! నిజముగ మంత్రి ముద్రయే!

లా__మీ కెవరికైనఁ బారసీకభాష దెలిసినఁ దానినిఁ జదువుఁడు.

గోపీ__(జాబునుదీసి చదివి) నారాయణ! నారాయణ! ఎంతటిద్రోహము! ఎంతటిద్రోహము!

ప్ర__గోపీనాథ్! ఏమది? ఏమది?

గో__మంత్రిగారు బీజపూరు సంస్థానమును ఢిల్లీపాదుషాగారి స్వాధీనముచేయునటుల నొప్పుకొని యున్నారు.

ప్ర__అది నేను విని యుంటిని ఇంకేమిసంగతి?

గో__రెంటిలోను నాసంగతియె (లాల్సింగువంకఁజూచి) ఈయుత్తరములు నీకెట్లు దొరికినవి.

లా—అయ్యా! నేను చక్రవర్తి కొలువులో నుంటిని. ఈ యుత్తరములఁగని, వీని నడిల్షాగారికిఁ జూపి వారికిఁ గలిగిన యాపదఁదొలఁగించి, వారివలన బహుమానము పొందు నపేక్షతో నచటినుండి తప్పించుకొని, యీయుత్తరములతో నేను బయలువెడలి వచ్చితిని.

గో—ఇది శివాజీ వ్రాసినదని నీ కెట్లు దెలియును?

లా—శివాజీ యుత్తరములఁ బారసీకభాషా భాషాంతరీకరణమునకుఁ బ్రతివ్రాయుట నాపని. కావున నాకు దెలిసినది.

ప్ర—అమృతరావును బిలిచి దీనినిఁ జదివింపుము.

అమృత—(అచటికివచ్చి యుత్తరమును జదివి) కామేశ్వరశర్మ మీకు వ్రాసినసంగతియే. మీ రయిదువేలసేనతోను, మంత్రి లక్షసేనతోను శివాజీనిఁ జేరుట. ఇది శివాజీ ముద్రయే. వాని చేతిగుర్తె. వీని కెటుల నీయుత్తరము దొరకినది.

ప్ర—వాఁడు దొంగిలించెను. అందువలననే వీనిఁ జంపవలయునని యోజించుచున్నాను. వీని నవశ్యము చంపవలెను.

అమృత—చంపవచ్చును. అయిన నింకొకపనిఁ జేయుట మేలని నాకుఁ దోచుచున్నది. ఆ జాబుల నెత్తుకొని వీనినిఁ బిలుచుకొని తాము బీజపూరునకేగి, రాజుగారి కార్యదర్శిగారితో బేరము కుదుర్చుకొనిన లక్షరూపాయలు చేతిలో వేసికొనవచ్చును. ఈయుత్తరములను దొంగిలించిన వీఁడు వారిప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరము లియ్యఁగలఁడు. సరియైన నిదర్శ

నములు చూపఁగలఁడు. పిమ్మట వీని మీ యిష్టానుసార ముగాఁ జేయవచ్చును.

ప్ర—లాలా! నీ కెంతవచ్చునని యోజించితివి?

లా—అయ్యా! లక్షలు, నన్నువదలిన మీకొక భాగ మిచ్చెదను.

ప్ర—చీ! తుచ్ఛుఁడా! భాగమా నాకిచ్చెదవు? (తన మనుష్యులనుజూచి,) వీని నురిదీయుఁడు.

గోపీ—చిన్నాయనా! ఇప్పుడువలదు. నన్ను గుఱించి యైనఁదారు దయచేసి వానిని నేఁడు చంపవలదు.

అమృ—వానినిఁ జంపుటవలన మీకు నష్టమే. ఈ యుత్తరములు మీకెటుల దొరకెనని వా రడిగిన మీ రేమిచెప్ప వచ్చును; వీనిని నన్నును గోపీనాథసింగును, బీజపూరున కంపిన లక్షరూపాయలు దొరకును. వచ్చెడులాభమును బోఁగొట్టుకొనవేల.

ప్ర—నేనే బీజపూరుకుఁ బోయెదను. మా పినతండ్రి కొడుకు మాన్సింగును వీనినిఁ బిలుచుకొని పోయెదను. లాలా! నీకును భాగమిచ్చెదను. (కట్లువిప్పి) నీకుఁబ్రాణదానమిచ్చితివి. లోపలికిఁబోయి భోజనము చేయుము.

గోపీనాథ్—నాయనా! మంత్రి మనకు వార్త యంపినందుకు నీ వమృతరావుతోఁ గూడఁబోయి ధనముఁ దీసికొనిరమ్ము.

ప్ర—అటులే చేసెదను.

# నాల్గవ ప్రకరణము

బీజపూరు పట్టణములో మసీదులలోనెల్ల గంటలుమ్రోగుట ప్రారంభమాయెను. గుంపులుగుంపులుగాఁ దురుష్కులు సాయంకాల ప్రార్థనములకై మసీదులకుఁ బోవుచుండిరి. ఆకసమున నక్కడక్కడ నక్షత్రములు గనఁబడుచుండినవి. చంద్రబింబము తూర్పుదిక్కునఁ బొడముచుండెను. పట్టణమున జనఘోష కొంచెము కొంచెముగాఁ దక్కువగుచుండెను. సుమారిరువది సంవత్సరముల వయస్సుగలిగిన బాలుఁడొకఁడును, పదునాలు సంవత్సరముల వయస్సుగలిగిన బాలికయొక తెయు నొక మసీదులోఁ బ్రార్థన ముగించి యచట సమీపమున నున్నయొక సమాధిచెంతకుఁ బోయి, కన్నీరుఁ గార్చుచుఁ గొన్ని మల్లెపూలనా సమాధిపయిఁ బెట్టి "అమ్మా నీవు స్వర్గలోకమున సుఖముగా నుందువుగాత" యనిచెప్పిరి.

రసూలు—గయానా! శీఘ్రముగా రమ్ము. నాకు నేఁడెట్టియాపదయు రానీక కాపాడవలెనని నీవును దల్లినిఁ బ్రార్థనఁ జేసికొమ్ము క్షేమముగానుండిన తేపీవేళకు మరలఁ దల్లిగారినిజూతుము.

గయానా—అన్నా! నీకేల యింతటికష్టము గలిగినది. వివరముగాఁ జెప్పుము.

రసూల్—నీతో నే నాసంగతులనన్నింటినిఁ దరువాతఁ జెప్పెదను. ఇప్పుడవసరముగాఁ బోవలయును. కొన్ని యేర్పాటులనుజేసి భోజనమున కింటికివచ్చి పోవలెను. రాజుగారి పనిమీదనే నే బయటికిఁబోయినటుల నాయనతోఁ జెప్పుము.

రసూలుఖా నిటులఁజెప్పి చెల్లెలి నింటికిఁబంపి తాను దన రక్షకభటులలో ముఖ్యుఁడును దన కాప్తుఁడును నగు మల్హా రరా వుండుచోటికిఁబోయి రహస్యముగా నిట్లనియె.

ర—మహారాష్ట్రుఁడవు గాన తణ్ణాజీ నీకుఁదెలిసియుండ వచ్చునుగదా?

మ—తణ్ణాజీయా! వాఁడేగదా మా కొంపముంచి మా యిల్లు కొల్లగొట్టినవాఁడు? ద్రోహి, ఛండాలుడు. ఘాతుకుఁడు. మా నాయన చచ్చినక్రొత్తలో నొకనాఁడు వాఁడు కొందఱు దొంగలను బిలుచుకొనివచ్చి యర్ధరాత్రి వేళలో మా యింటిలోదూరి మాతల్లి మొదలగు వారిఁజంపి, మాసొమ్మును దోచుకొనిపోయెను. నేను గాయపడి తప్పించుకొనివచ్చితిని. ధనము లేక పోయినందున, న్యాయాధికారుల సాహాయ్యము లేకపోయెను. వానిఁ జంపక నాకనిద్రరాదు. ఆ ద్రోహిని గుఱించి నీకెట్లు తెలిసినును? వానిప్రస్తాప మిపుడేలవచ్చెను.

రసూ—మనయూరి వెలుపలిభాగమునయుండు రాముని గంజాయియంగడికి నేఁటిరాత్రి వాఁడు వచ్చునట్లు దెలియు చున్నది. హిందువుల గుడికి సమీపమున నాయంగడి యున్న దఁట ఆ గుడిలోఁ గొందఱు ముందుగా గుమిగూడి తరువాత రామునియంగడికిఁ బోయెదరఁట అచట. రాజద్రోహపు కుట్రలు జరుగుచున్నవఁట.

మ—అట్లులైన నేను నా మనుష్యులతోఁ బోయి వారినిఁ బట్టితెచ్చెదను. నవాబుగారి విషయమున మనము పాటు పడవలసినది.

ర—కూడదు, నేను బోవలెను. ఆగుడిలో రాజ్యసంబంధమైన మాటలు గొన్ని పారసీక భాషలో జరుగునఁట. అది మీఁకు దెలియదుగనుక నేనేపోవలెను. నీవు మాత్రము నాతోఁ గూడరమ్ము. మొగలాయి వారి ప్రేరణమీఁదఁ గొన్ని కుట్రలు జరుగునఁట. వాని నే నవశ్యకముగాఁ దెలిసికొనవలయును.

మ—శర్జాజీ, శివాజీకిఁ బరమమిత్రుఁడు. శివాజీమూలము ననే వాఁడు వచ్చును. అది బీజపూరు సంస్థానమునకుపద్రవము గలిగించుటకై యుండును. నీవు హిందువు వేషము వేసికొని వచ్చుటయే యుక్తము. ముఖమున గంధాక్షతలఁ బెట్టుకొనుము. తెల్లవాఱిన పిమ్మటఁ దుడిచివేయవచ్చును. ఈసమయమున మనము జాగ్రత్తగా నుండి సంగతులను దెలిసికొనవలెను. మంత్రిగారు సేనలతోఁగూడ నలదుర్గములో నున్నారు. మొగలాయివారిసేన, దౌలతాబాదులో నున్నది. మహారాష్ట్రులు శివాజీక్రింద హెచ్చరికతో నున్నారు. కనుక మన మవశ్యమీ కుట్రను దెలిసికొనవలయును.

ర—నే నింటికిఁబోయి భోజనముచేసి, నాయనగారి యొద్ద సెలవుతీసికొని శీఘ్రముగా మరలి వచ్చెదను. నీవును భోజనము చేసి సిద్ధముగా నుండుము.

రసూలు అంతట నింటికిఁబోయి, భోజన మొనర్చి యీ సంగతినంతయుఁ దండ్రియగు నబ్దుల్లాఖానుకుఁజెప్పి సెలవు తీసికొని మరలి మల్హారరావింటికి వచ్చిచేరెను.

అంతట వారిద్దఱు నింటిలోపలికిఁ బోయిరి. మల్హార్‌రావు రసూల్ ఖానునకు హిందువునియుడుపులనిచ్చి, ముఖమున

గంధాక్షతలు పెట్టెను. వా రిరువురును గత్తులను దుపాకులను రహస్యముగా నుంచుకొని బయలువెడలి, చీకటిలోనే పట్టణ బహిఃప్రదేశముం జేరిరి. అచటఁ గొందఱు దుర్మార్గులును దొంగలును వారిని దోచుకొనిపోవుటకై దగ్గరకు వచ్చిరిగాని, ఆయుధపాణులై వేఱొకబరువును లేక పోవునట్టివారి నడ్డగించుటచేతఁ గత్తిపోటుతప్ప వే తేలాభమును దొరకదని నిశ్చయించుకొని మఱలిపోయిరి.

మల్హారరావు—రసూల్‌గారూ, మన మాయుధపాణులమై రాకుండిన మనకుఁ దప్పక ముప్పుగలుగును.

రసూల్—నిజమే. అదిగో వెలుతు రగపడుచున్నది. ఆచోటుగానే యుండవచ్చును. హిందువుల మంత్రముల ప్రతిధ్వనియు వినఁబడుచున్నది. ఉదీపమగుపడుచోటనే రాముని యంగడి యుండవచ్చును. మంత్రధ్వనులు వచ్చుట యాగుడి నుండి యనియే తోఁచుచున్నది.

మల్హారరావు—ఈ వినంబడెడి సవ్వడి నిశ్చయముగ నాచెట్ల గుబురుమధ్యనుండు కాళికాలయమునుండియే. ఇదియే రామునంగడి. నేనుముందుగా నాదేవాలయము చెంతకుఁబోయి చూచివచ్చెదను. నీవుఁగొంతదూరమునఁ బొంచి యుండుము.

రసూల్—అట్లుచేయుట యపాయకరము. ఇరువురము నేకకాలమునఁ బోవుదము.

అంతట వారిరువురు నాదేవాలయము చెంతకేఁగి దాని ప్రాకారము నడుమనుండు నొకరంధ్రముప్రక్క నిలిచి, యారంధ్రమునుండి లోపల జ్వలించుచున్న యొకహోమగుండమును, దానిప్రక్కనఁ గూర్చుండియున్న ముగ్గుఱు మనుష్యు

లను జూచిరి. ఆముప్పురిలో నిరువురు ధవళవస్త్రములు ధరియించి, గంధాక్షతలు పెట్టుకొని బ్రాహ్మణులవలె నగుపడిరి. మూఁడవవాఁడు దేహమంతటను బూదిఁబూసికొని, జడలు కట్టియున్న తలవెండ్రుకలను దలపాగవలెఁ జుట్టి కౌపీనము మాత్రము ధరించి, పద్మాసనము వేసికొని హోమగుండమునకు ముందుగా నొక జింకతోలుమీఁదఁ గూర్చుండి, యొడమచేతి వ్రేళ్లతో మెల్లమెల్లన రుద్రాక్షమాలికను ద్రిప్పుచుండెను.

అప్పుడు, రసూల్—(రహస్యముగా) ఊరివారుగారు. వీరిలో నిరువురు విప్రులు నొకఁడు యోగీశ్వరుఁడని నాకుఁ దోఁచుచున్నది.

మల్హార్—అట్లైన నీ విటనుండుము. నే నీదేవాలయము చుట్టుకొని లోపలికేఁగి వారెవరైనదియు వారి నడిగి తెలిసికొని మఱలివచ్చెదను.

అంతట మల్హార్‌రావ్ గుడిచుట్టుకొని మెల్లగా నడచుచు గుడి వాకిటికివచ్చి నిలిచి, వారలకు నమస్కారము చేసెను. ధవళవస్త్రములు ధరించినవారిలో నొకఁడు తటాలునలేచి మల్హారరావునుజూచి "పిలువఁబడక యీయర్ధరాత్రి వేళలో నీ విచటి కేలవచ్చితివి? నీ వెవడవు?" అని యడిగెను.

మల్హారరావు—అయ్యా, నేను చిత్తూరిలోనుండుచిదానందస్వాములవారికి శిష్యుండ. నన్ను నిత్యానందుఁడని పిలుతురు. కొంతపనియుండి నే నీపట్టణమునకు వచ్చితిని. రాత్రి ప్రొద్దెక్కినందునను వర్షము వచ్చుచుండుటచేతను, విశ్రమించుటకై యిచ్చటికి వచ్చితిని.

మొదటి బ్రాహ్మణుడు—ఈబిజాపురములో నెన్నియో మతములున్నవి. వానిలో నొక్కదానికిఁ బోవు నిలువకుము.

మల్హార్—అయ్యా, కొంచెము దయయుంచి రాత్రి విశ్రమించుట కించుక చోటిమ్ము. మతములు దూరముననున్నవి. నేను మిక్కిలి బడలియున్నాను.

బ్రాహ్మ—ముందుగా నావలఁబొమ్ము. పోకున్న మేము నిన్ను నెట్టిత్రోయుదుము.

మల్హార్—అయ్యా, యీదేవాలయము పేరేమి? కొంచెము దయయుంచి చెప్పుము. నే నిప్పుడే కదలెదను. నాపైఁ గోపగించకుము.

బ్రా—ఇది కాళికాదేవాలయము. కదలుము.

మల్హారరా వంతట గుడిచుట్టుకొని రసూల్ఖా నుండు చోటికివచ్చిచేరెను వారిరువు రారంభ్రము చెంత నేనిలుచుకొని వీరెవరైనది గని పెట్టవలెనని యుండిరి. అప్పుడు వా రాడుకొను మాట లీ క్రిందివిధమున వినఁబడెను.

మొ-బ్రా—(యోగినిఁ జూచి) ప్రహార్ సింగ్, ఆబాలుఁ డెవడో నీకుఁ దెలియునా? నేను జిదానంద స్వాములవారి శిష్యుల నెఱుఁగుదునుగాని వీరిని నే నెప్పుడును జూడలేదు.

యోగి—(నవ్వుచు) ఎవ్వఁడైన నేమి? వాఁ డీగుడి పేరునుగూడ నడిగెను. వానియెడల సందేహమేల?

మల్హార్—(మెల్లగా రసూల్ఖానుతో) వింటివా? ప్రహర్సింగఁట, ఆపోపుదుదొంగ, ఆదొంగలపెద్ద, ఆఘాతకుఁడు.

రసూల్—(మెల్లగా) వారు మఱల మాటలాడెదరు. గమనింపుము.

యోగి—లాలా! ఆకాగితములు నీ కెక్కడదొరకినవి. వానిలో నేమియు మోసము లేదుగదా? ఎట్లైన నీకర్థభాగ మిచ్చెదను. (నవ్వుచు) నీవు నాఁడే పెద్దలలోఁ గలిసియుందువు. నీయదృష్టము మంచిది; నాచేతఁబడియు బ్రతికితివిగదా! ఎవ రాతలుపుఁదట్టునది? (నిదానించి) మాన్సింగ్! తలుపు తెరువుము. ఇద్దఱే రావలసినవారు. ఎక్కువజన మగుపడిన ముందుగాఁ దెల్పుము.

మాన్సింగు తలుపుఁదెఱచినతోడనే యిద్దఱుమనుష్యులు లోపలికిఁ బోయిరి. వారు జ్వలించుచున్న హోమగుండము చెంతకు వచ్చినతోడనే వారిముఖములు స్పష్టముగాఁ గనఁబడెను. ఆయిరువురిలో నెక్కువ వయస్సుగలవాఁడు బిజాపూరు రాజ్యాంగ కార్యదర్శియని రసూల్ తెలిసికొనెను. చిన్నవాఁడు ముఖమును గుడ్డతోఁ గప్పుకొనియుండెను. గాన నాతనిఁ గుర్తెఱుంగజాలకుండిరి గాని, యతఁడు కూర్చుండినపిమ్మటఁ గప్పును దీసినందున నతఁడు బిజాపూరు ప్రభువు. ఆలీ ఆడిల్‌షా యని రసూల్ నిశ్చయించెను. కొంతకాల మందఱును మౌనమున నుండిరి. పిమ్మట కార్యదర్శి మాన్సింగుతో నిట్లనియె.

కార్య—అయ్యా, కాగితముల నెత్తుము; పైకము సిద్ధముగా నున్నది; నీవు చెప్పినగురు వితఁడేనా ?

లాల్సింగు—అవును. ఈయన మహాత్ముఁడు. ప్రపంచములోని సామాన్యబంధములం జిక్కక, పక్షపాతము లేక సర్వసముఁడై, తదేకధ్యానముగల్గి, తుచ్ఛైహికలాభములందాసక్తి వదలి, వైరాగ్యముతో నుండెడివాఁడు. ఈయన కొక్కచోట నునికిపట్టు లేదు. ఈయన నవాబుగారిమీఁద ననుగ్రహముంచి

యిచటికి విజయము చేసిరి. ఇంతవఱకీయన యాత్మధ్యానమున నుండుటచే మీతో మాటలాడలేదు. ఆతఁడు తనయుద్దేశ్య కార్యముల వదలి యిటకు వచ్చుట మనభాగ్యవశము. వారి యుత్తరువైనవెంటనే కాగితముల నిచ్చెదము.

యోగి—స్వర్ణము, ముందుగా స్వర్ణము రావలయును. దేవాలయము గట్టించవలయును.

కార్య—(నవాబునుజూచి) అయ్యా లెంపు, వీరియొద్ద కాగితము లేదు. ప్రభువుయొక్క ధనమును లాగుటకుఁ బన్నిన యుపాయముగాని వేఱొకటిగాదు.

లాల్సింగు—అయ్యా, తొందరపడకుము. కార్యములు తొందరపడినఁ జక్కఁబడునా? ఇదిగో కాగితముల సంచి (యోగివంకఁ జూచి) అయ్యా, తెలుపవచ్చునా?

యోగి—తెలుపుము. శీఘ్రముగాఁ గానిమ్ము.

(అంతట లాల్సింగు జాబులనెత్తి) ఇదిగో బీజపూరు మంత్రి చేవ్రాలు.

కార్యదర్శి—(జాబునుదీసి చదువుకొని నవాబుచేతి కిచ్చుచు, ఆహా! మంత్రిగారెంతటిద్రోహమున కొడిగట్టిరి. సంస్థానమునే యౌరంగజేబు చక్రవర్తి స్వాధీనము చేయుటకు సమకట్టిరి. మీరును జదివిచూడుఁడు. (లాల్సింగునుజూచి) ఈకాగితములలోని యక్షరములను నాయొద్దనుండు మంత్రి చేవ్రాలును రెంటిని బరీక్షించి మీపైకము మీకిచ్చెదము.

ప్రహర్సింగ్—కూడదు. కూడదు. పైకమురాక యేకాగితములు గాని వచ్చినవారుగాని, యీ చోటినుండి కదలఁ గూడదు.

కార్య—నీవెవఁడవు. నోరు మూయుము!

ప్ర—నేనెవఁడనా? నేనెవఁడనా! (వాకిట క్రిందనున్న కత్తిని పైకిఁదీసి) కదలకుఁడు. కదలిన మీ ప్రాణములు మిగావు.

మాన్సింగ్—కత్తి నెత్తికొనుము.

నవాబు—తొందరపడకుము లాల్సింగడిగిన నిచ్చెదను.

లాల్సింగ్—ఇప్పుడే యియ్యవలెను. వాని చేతి కియ్యవలెను ఆయన హత్యకు వెనుదీయఁడు.

ప్ర—కార్యదర్శిగారూ, ధనమిచ్చిన నేనేమాత్రము గీడు చేయను. నవాబు నిటవదలి మీరుపోయి ధనము తేవలసినది. నా స్నేహితుఁడు మాన్సింగ్ రూపాయలసంచుల మోసికొనివచ్చును.

నవాబు—కార్యదర్శీ, నీవుపోయి పైకమును దెమ్ము. అతఁడు చెప్పినట్లు నేనిచటనే యుండెదను.

కార్యదర్శి—నేను నిన్నొంటరిగా వదలిపోవుట యుక్తముగాదు.

ప్ర—నీవు సత్యముగాఁ బ్రవర్తించిన నేభయము నుండదు.

నవాబు—అయ్యా, పొమ్ము. వానికి ద్రవ్యాపేక్షయే గాని నన్నుఁ జంపవలయునని యక్కఱలేదు. నాకు భయము లేదు.

కార్యదర్శి మాన్సింగును లాలాను బిలుచుకొని వెలుపలికేగెను. మల్హారరావును రసూల్ఖానును సంగతులన్నియు గమనించుచు, రంధ్రమునుండి చూచుచు మునుపున్న చోటనే

నిలచియుండిరి. అప్పుడు ప్రహార్సింగ్ నవాబునకుఁ దన్నుఁ దెలిపి నవాబుగారు తన్నుఁ గాపాడునటుల వాగ్దత్తము చేసిన, దానతనికై సత్యముగాఁ బాటుపడి సాహాయ్య మొనర్చెదనని చెప్పెను. నవాబుగా రావిషయము నాలోచించి వాని కటులనే వాగ్దత్తము చేసెను. అంతటఁ బ్రహార్సింగు తాను "దేవి పాతుమాం" అను సంకేతవాక్యముతో నవాబునొద్దకు మాఱువేషమున వచ్చుచుండునట్లును, బైటజరుగు సంగతుల నప్పటప్పటికి నవాబుకుఁ జెప్పుచుండునట్లును జెప్పెను.

వారిటుల మాటలాడుచుండఁగా మాన్సింగ్ లాల్సింగ్, కార్యదర్శి, వీఱునువ్వులును లోపలికిఁ బోయిరి. మాన్సింగ్ రూపాయల సంచిని ప్రహార్సింగు ముందటఁ బెట్టి "మనకుఁ జెప్పిన పదివేల రూపాయలకంటె నధికముగానే యిచ్చిరి" అనిచెప్పెను. ప్రహార్సింగుయొక్క సెలవుఁదీసికొని నవాబును, మంత్రియును వెంటనే వెడలిపోయిరి. లాల్సింగు వారితోడనే పోవుటకుఁ బ్రయత్నించెను గాని ప్రహార్సింగు వానిని బలాత్కారముగ నీడ్చి కూర్చుండఁబెట్టి నిలిపెను.

నవాబుగారికిఁ బ్రహార్సింగునుబట్టి చెఱసాలలో నుంచుటకైనను, లేక చంపుటకైనను గావలసినంత యుద్ధభటుల గుంపు సమీపమున నుండినను దాను బ్రహార్సింగునకుఁ జేసిన వాగ్దానమువలనను, మంత్రి కుట్రతోఁ జేరిన యితర వార్తల నతనిమూలకముగఁ దెలిసికొనవచ్చునను గోరికచేతను, బ్రహార్సింగువలన నితర సాహాయ్యమును బొందవచ్చు ననునమ్మకమువలనను, నాతని కేమాత్రమును గీడు చేయకుండెను. రసూల్ఖాఁ మంత్రిపుత్రునికిఁ బ్రియమిత్రుఁడైనందున, నీయుదం

తము గొంతయైన రసూలుఖాఁ దెలియునట్లుగాని నవాబునకుఁ దెలిసిన ప్రాణముల కపాయము కలుగును గనుక రసూల్ బయటఁబడకయే యుండి లోపలజరుగు వ్యవహారములను గమనించుచు మల్హారరావుతోఁగూడ నావంద్రముప్రక్కన నుండెను. నవాబు పోయినవెంటనే లాల్సింగు ప్రహార్సింగునుజూచి తనభాగపు ధనమును దనకిమ్మని యడిగెను. ప్రహార్సింగా మాటమాత్రముననే కనుసైగచేసికొని కోలవికట్టిగత్తి దానితో లాల్సింగును జేతివ్రాటఁగొట్టి "ఓరీ! తుచ్ఛుఁడా, ధనమూకావలెను? అనిచెప్పెను. లాల్సింగా దెబ్బతగిలినంతనే క్రిందఁబడెను.

ప్ర—మాన్సింగ్, ఇఁక వీనిని జంపవలసినదే. వీనిప్రాణంబుల నిలుపుట యుక్తముకాదు.

మా—ఇదిగో, యురిత్రాడుఁదీసికొని వచ్చుచున్నాను. (లాల్సింగునొద్దకు నురిత్రాడొకటిఁ జేతఁబట్టుకొని పోయెను.) అప్పుడు బైటనుండి చూచుచుండిన రసూల్ఖానుదత్క్షణము మనము లోపలికిఁబోయి యుద్ధపడవలయునని మల్హారరావుతో జెప్పి "ప్రహార్సింగ్, మాన్సింగ్, నిలువుము, నిలువు" మనుచు గత్తిదీసికొని లోపలికి దుమికెను. వానితోడనే మల్హార్ రావును "హర్! హర్! మహాదేవ్!" అనుచుఁ గత్తినిదూసికొని గోడపైనెక్కి లోపలికిఁదుమికెను. అంతలోఁ బ్రహార్సింగు చెంగునఁ గోడనెక్కి బయిటికి దుమికెను. మాన్సింగును గోడనెక్కిదుముకుటకు సిద్ధముగానుండెను. కాని, యపుడు రసూలు తనకత్తిని వానిమీఁదికి విసరివేసినందున నది యాతని వీపున గ్రుచ్చి, వానికి గొప్పగాయమును గలుగఁజేసెను. అయినను వాఁడు ధైర్యమువదలక వెలుపలికి దుమికెను. రసూల్ఖానును

మల్హారరావును వారిని వెంబడింపక దేవళమునందే నిలచి, దిగులుచేతను, దెబ్బచేతను మూర్ఛనొందిన లాల్సింగును జూచి, కొంతనీరు వానినోటఁబోసి వానిని లేవనెత్తిరి. అంతటఁ గొంతవడికి లాల్సింగు నేదదేఱి కూర్చుండి వారిరువురను గని యిట్లనియె

లా—అయ్యా! మీ రెవరు? నన్నుఁజంపవచ్చినదొంగ లెటుపోయిరి! నాబంగార మెక్కడ? ధన మెక్కడ?

రసూ—నీబంగారము పాడుగాను. ప్రాణము పోవునపుడు బంగార మేల? ఇప్పుడుకూడ బంగారు కలవరమేనా? దొంగలు పాఱిపోయిరి. భయపడవలదు

లాల్సిం—అయ్యా, ఆబంగారుకొఱకే నేనింతశ్రమపడితిని. పరదేశములో ద్రవ్యము లేకయున్న నెట్లు జీవింపవచ్చు.

మల్హా—మఱల నెచటనైన దొంగలింపవలసినదే.

లాల్సి—ఆబంగారును బోఁగొట్టుకొని జీవించుటకంటెఁ జచ్చుటమేలు. అయ్యా, యిచట నేమైనఁ గొంతబంగారమైన నున్నదేమో వెదకిచూడుఁడు.

రసూల్—మల్హారరావు, ఇక్కడనే వారెంచినది. వెదకిచూడుము. వారు పరుగెత్తినపుడు గొన్నిసవరములు జారిపడియుండవచ్చును. ఏఱి వాని కిమ్ము.

మల్హా—(కొన్నిసవరముల వేఱుపఱచి తెచ్చి) లాల్సింగ్, ఇదిగో, గొన్నిసవరములు దొరికినవి. తేప వెకువనుజూడుము. ఇంకఁ గొన్నిసవరములు దొరకును. మేము పోయెదము ప్రొద్దయినది.

లాల్సి—అయ్యా నన్ను వదలి పోకుఁడు. నన్ను మీతో

దనే పిలిచికొనిపొండు. లేకున్నఁ బ్రహ్మసింగ్ మరలవచ్చి నన్ను జంపును.

అంతట వారిరువురును వానినిఁ బట్టుకొనిపోయి కట్టెకాపుఁ గావలివాండ్రయొద్ద నప్పగించి వానికిఁ దగిన సంరక్షణఁ జేయుఁడని చెప్పిరి. ఆభటులు లాల్సింగును జూచి యతఁ డెవఁ డనియు గాయ మతని కేల తగిలెననియు వారి నడిగిరి.

రసూల్ఖాను దానికి వాఁడెవఁడైనదియుఁ దనకు దెలియ దనియు, గాయము తగిలినవాఁడై దారిలోఁ బడియుండెననియుఁ, దాను వానిఁ జూచి జాలిఁబూని యచటికిఁ దెచ్చినట్లునుఁ జెప్పెను.

రసూల్ఖాను గాయము చెందినవాని నిటుల వదలి, మునుపు నిశ్చయించుకొనిన ప్రకారము రక్షాజీనిఁ జూచుటకు మల్హార రావుతోఁ గూడ రాముని గంజాయియంగడికిఁ బోయెను. అచటఁ గడపమీఁదఁ గూరుచున్న నారాముని ప్రక్కనే వాకిటి తిన్నె మీఁద వారిరువురును గూర్చుండిరి.

రాముఁడు—ఎవరయ్యా మీరు? ఈయర్ధరాత్రి వేళలో నిచటి కేల వచ్చితిరి !

మల్హా—అయ్యా, మేముపరదేశస్థులము, ప్రొద్దుపోయి యీపట్టణమునకు వచ్చిచేరితిమి. ఆకసమంతటను మబ్బుక్రమ్ముకొని చినుకులు రాలుచుండుటచే నిచట విశ్రమించి నిద్ర పోవుటకై వచ్చితిమి.

రా—ఈయిల్లు రాత్రికిఁ గొందఱి కద్దెకు విడువఁబడి యున్నది. ఇచ్చటికెవ్వరిని రానీయఁగూడదని వారు చెప్పి యున్నారు. మీ రిచట నిలిచిన వారికిఁ గష్టముగా నుండును. కాఁబట్టి మీరు వేఱొకచోటికిఁ బోవలయును.

మల్హా—కావలసియుండిన బాడుగనిచ్చెదము. ఇదిగో, తీసికొనుము. ఈచినుకులలో మేము బైటికిఁబోవుటకు సాధ్య పడదు. చూచితివా యీమెఱుపు? (అని యాకాశమువంకఁ జూచెను.)

రా—సమీపమున గోసాయీమఠ మొకటియున్నది. దానిప్రక్కనే చింతచెట్లనడుమ భవానీ దేవాలయమున్నది. అచటికిఁబోయి పరుండుడు. తత్క్షణము లేచిపొండు.

మల్హా—ఈయర్ధరాత్రివేళలో నెచటికిఁ బోయినను మమ్ము దొంగలనుకొని రాజభటులు పట్టుకొందురు. ఈవానలో బైటకుఁబోవుటకును సాధ్యపడదు. మమ్ము బలాత్కారముగా నెట్టినను మేము పోము. మాయొద్ద నాయుధము లున్నవి. మమ్ము మేము గాపాడుకొనఁగలము.

ఇట్లు వారు మాటలాడుచుండఁగా, లోపలనున్న వారిలో నొకఁడు వాకిటికివచ్చి, యీసందడికిఁ గారణమేమని రాముని నడిగెను. రాముఁడు జరిగినసంగతి నంతయు వానికిఁ జెప్పెను. అంతట వాఁడు కత్తిని జేతికిఁదీసికొని "ఎవరుమీరు? పెద్దమనుష్యులు రహస్యాలోచనలో నుండువేళ నిచటికివచ్చి తొందరచేయనేల ?" అని మల్హారరావు నడిగెను. వాని భయంకరాకారమును గంభీరధ్వనియును నతఁడు తణ్ణాజీ యను సంగతి స్పష్టముగా మల్హారరావునకుఁ దెలిపెను.

మల్హా—(మహారాష్ట్రభాషలో) అయ్యా, నేనొక బీద గోసాయివాఁడను. వీఁడు నాతమ్ముఁడు. విశ్రమించుటకై యిచటికి వచ్చితిమి. మీకేమి దానితోఁ గావలసినది?

తణ్ణాజీ—నీవు గర్విగానున్నావు. వీఁడేలమాటలాడ లేదు?

మల్లా — ఒక సంవత్సరము మాటలాడకుండునని వాఁడు తుల్జాపురి భవానీదేవికిఁ బ్రార్థనచేసికొని యున్నాఁడు.

త — సరి. ముందుగా నవతలికిఁ బొమ్ము. ఇచట నిలువఁగూడదు. అదిగో, దేవగుడియున్నది. అచటికిఁ బొమ్ము.

మల్లా — మమ్ముఁ బొమ్మనుటకు నీకేమి యధికారమున్నది? నీ వెవఁడవు!

రా — (వారుముగ్గురును కత్తులనెత్తికొని యుద్ధసన్నద్ధులుగా నుండుటఁ జూచి, యడ్డముగా వచ్చినిలిచి) అయ్యా, భవానీతోడు. మీతంత్రులతోడు, ఒకరి నొకరు తాఁకవలదు. నేనంతటితో మునుఁగుదును. నన్ను రాజారడించును. నిదానింపుడు. నిదానింపుడు.

త — (లోపలినుండి వచ్చి కత్తిదూసికొనిన తనమనుష్యుల నిర్వ్యరతో) నిదానింపుఁడు. కత్తులను గ్రిందఁబెట్టుఁడు తొందరపడవలదు. (మల్హారరావుతో) ఎవఁడవు నీవు! మాసంగతిని దెలియక మాటలాడితివి. నీపేరేమి? నీయూరెద్ది? ఇచటి కేలవచ్చితివి?

మ — నేను గోసాయిని. సంగతి మునుపే చెప్పియుంటిని. నాపేరుసీతారాంజీ. మాయూరు పునహాసమీపము. నేను గొంత రహస్యమైన పనిమీఁదఁ బ్రహార్సింగునొద్ద కిచటికి నంపఁబడితిని. ఇప్పుడే యాభవానీ దేవాలయములో నతనిఁ జూచి మాటలాడివచ్చితిని. ఇచ్చటఁ గొందఱినిఁ జూచుటకై యతనిచేఁ బంపఁబడి వచ్చితిని. ప్రహార్సింగు దేవాలయము లోనే యున్నాఁడు. వారిని రప్పించిన, మీకు సమస్తవిషయములుఁ జక్కఁగఁ దెలియును.

తన్హాజీ యంతటఁవనమనుష్యులలో నొక్కనిఁ బ్రహర్షింగను బిలిచికొనిరష్మని దేవాలయమున కంపెను. తన్హాజీతోఁగూడ నొకఁడే యుండుటచేత మల్హారరావు వెంటనే కత్తిని దూసికొని తన్హాజీపైకి "హర్, హర్, మహాదేవ్" అనుచు దుమికెను. రసూల్ తన్హాజీతోఁగూడనున్న మనుష్యుపై కిదుమికెను. మల్హార్ రావునకు మాత్రము తన్హాజీకత్తిపోటు భుజముపైనఁ దగిలి, రక్తము ప్రవహింపఁజొచ్చెను. రాముఁడుకూయుటవిని రాజభటులు వచ్చుటఁగని తన్హాజీయును వానియనుచరుఁడును బెరటిత్రోవనుండి తప్పించుకొని పరుగెత్తిపోయిరి. రసూల్ఖాను బరుగెత్తిపోయి వీధిలోని రాజభటులను జూచి తన్హాజీతలఁ దీయువానికి వేయిరూపాయలు బహుమానమిచ్చెదను" అనిచెప్పెను. అనేకులు రాజభటులు తన్హాజీనిఁబట్టుటకు బోయిరి. కాని యొకఁడైనను వానిఁ బట్టలేదు. గాయముచెందిన మల్హార్ రావును విడిచిపోవుటకు నిష్టములేక రసూల్ఖా తన్హాజీని వెంబడింపక నిలిచి, తనచేతిగుడ్డను మల్హార్ రావునకు గాయము తగిలినచోటఁ గట్టెను అప్పటికిని రక్తము ప్రవాహముగా నాచోటఁ గారుచుండెను. రసూలు చేతిగుడ్డయుఁ దడిసెను. అప్పుడు కొందఱు యుద్ధభటులచటికివచ్చిరి. వారిలో నొక పెద్దమనుష్యుఁడు రసూలునుజూపి రామునితోనిట్లనియె. వీఁడెవఁడు? ఆమనిషినిఁ బొడిచినవాఁడు వీఁడేనా ?

రా—అవును. వీరిరువురే పోట్లాడినారు. వీఁడే హత్య చేసెను.

పెద్దమనుష్యుఁడు—(భటులనుజూచి) అదిగో వాని కత్తిపైనఁగూడ రక్తము కనఁబడుచున్నది. వానినిబట్టికట్టుఁడు.

అంతట భటులు రసూల్‌ఖానును బట్టి కట్టివేసిరి. ఆ పెద్దమను ష్యుఁడు రసూలును జూచి నీ వెవఁడ వని యడిగెను. అందుకు రసూలు తాను దురకవాఁడే యనియు, వానెవరైనదియు, నుదయమునఁ దాను జెప్పుచున్నసు వారలకెల్లఁ జకను దెలియు ననియు ధైర్యముతో వాక్రుచ్చెను. వారప్పుడు మల్హారరావు నకుఁ గొంచెము నీటిని ద్రాగుటకిచ్చి, తడిగుడ్డ గాయముమీఁదఁ జుట్టి వానినిఁ గూర్చుండఁబెట్ట, వాఁడు తనకు గాయముఁగలుగఁ జేసినవాఁడు తణ్ణాజీ యని చెప్పి రసూలును విడుదల చేయుఁడని దఫేదారు రసూల్‌ను విడిపించి యతనితో నిట్లనియె. "అయ్యా వారిని వేఁడెను. మీ పేరేమి? కొత్తవాలుగారికి రాత్రి జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పవలసియున్నది. మహారాష్ట్రులుగూడఁ బట్టణము లోపలికి వచ్చుటకుఁ బ్రారంభించిరి. కుట్రలు విశేష ముగా జరిగినట్లున్నది.

రసూల్—నేను రసూల్ఖా ననువాఁడను. మాతండ్రి అప్రుల్ఖాఁ.

దఫే—అయ్యా, దయచేసి క్షమింపవలెను. మిమ్ము గుఱుతు తెలియక మీ కపరాధ మొనర్చితిని.

రసూల్—(నవ్వుచు) దఫేదార్, కొంచెము నీటిని దెప్పిం పుము. నేను నాముఖమును దుడుచుకొనినఁ నన్ను మీరంద ఱును గుఱుతుపట్టఁగలరు. మీరు మీయుద్యోగ ధర్మమునే నెఱవేర్చితిరి. మీవలనఁ దప్పులేదు. ముందుగా వ్రణవైద్యుని రప్పించి మల్హార్‌రావునకుఁ జికిత్సఁ జేయింపుడు. ఆయంగడివాఁ డెచ్చటికేగెను, వానినిఁబట్టితెండు, వానికి తణ్ణాజీ వృత్తాంత మంతయుఁ దెలియు.

రసూల్ఖానుహుకుము త్తరువు చేసినప్రకారముగా డఫేదారుఁడొక మనుష్యుని, వ్రణవైద్యునిఁదీసికొనివచ్చుటకుఁబంపి, కొందఱిని రాముని వెదకితెచ్చుటకుఁబంపెను. కొంతసేపటికి వ్రణవైద్యుఁడువచ్చి మల్హారరావునకుఁ గట్లుగట్టెను. బటులు మల్హారరావు నొకయింటికిఁ దీసికొనిపోయి, యచట నొక శయ్యాసమర్పి యందు వానిని బరుండఁబెట్టిరి. రసూల్ఖాను నతనితోడనే పోయి ప్రక్కనేయుండెను. రసూల్ఖాను ప్రార్థనమువిూఁద డఫేదారుఁడు తనకుమారుని, జరిగినసంగతియంతయుఁ దెలుపుటకు నజ్జఖ్ఖానుకొద్దకుఁ బంపెను. కొంతసేపటికి భటులు కొందఱు రామునిఁగట్టి యీడ్చికొనివచ్చిరి. అప్పుడు రామునకు దేహమంతట మన్ను గ్రమ్మియుండెను. ముక్కుల నెత్తురుగాఱుచుండెను. దేహము వణఁకుచుండెను. ముఖము వెలవెలఁబాఱియుండెను. వాఁడు రసూలును జూచినతోడనే యేడ్చుచునతని కాళ్ళమీఁదఁ బడెను.

రసూల్—(రామునిఁజూచి) ఓరీ దొంగా! లెమ్ము. నీ వాడినమాటయేమి? నేనా వానిని గాయపఱచినది?

రాము—క్షమింపవలెను. దయయుంపవలెను. నావలనఁ దప్పిదమే. మీరిట్టివారని తెలియక నేరముచేసితిని. మీరే నాకుదిక్కు. దయయుంచి కాపాడవలెను. నాకు దెలిసిన సంగతియంతయుఁ దెలిపెదను.

రసూల్—తెలుపకున్న నీదేహము కాకులకు గ్రద్దలకుఁబిండియగును. నిజముచెప్పితివేనిఁ గాపాడెదను అబద్ధమాడిన నీతలపోవును. తెలియునా?

రాము—అయ్యా, ఈకట్లను విప్పింపుము. పిమ్మటఁ జెప్పెదను. మిక్కిలి బాధగానున్నది. దాహమునకుఁ గొంచెము నీటిని దెప్పింపుము.

వాఁడిటులఁ బ్రార్థింపఁగా రసూల్ఖా నచటనున్న యొకహిందూభటునిఁబంపి, కొంచెము నీరుఁ దెప్పించి, రామున కిప్పించి, వానికట్లు విప్పించెను. రాముఁడా నీటిఁద్రాగి, దప్పిఁ దీర్చుకొని రసూల్ఖానుతో నిట్లనియె.

రాము—అయ్యా, మీరును, మల్హారరావును వచ్చుట కఱగడియకుమునుపు తన్నాజీ యిద్దఱుమనుష్యులతో నాయంగడికివచ్చెను. ఇంటిలోఁ బ్రవేశించుటకు మునుపే నాలుగుప్రక్కలను జూచుచుండుటకు వేగువాండ్రను నియమించి బయటనిలిపిరి. వారు మిక్కిలిరహస్యముగా మాటలాడుచుండిరి. ఆమాటలు చక్కగాఁ దెలియలేదు. ఎవరో ప్రహార్సింగనువాఁడు తమయొద్దకచటికొకగోసాయితోఁగూడ వచ్చునటులఁ జెప్పుకొనుచుండిరి. వానితో మాటలాడి శీఘ్రమునఁ బోవలెనని యనుకొనుచుండిరి.

ర—వారు నీయంగడి కింతకుమును పెప్పుడైన వచ్చియుండిరా?

రాము—నిన్నసాయంతనమున నొకమనుష్యుఁడు నాయొద్దకు వచ్చియుండెను. రాత్రికిఁ బదిరూపాయలు, అద్దెతీసికొని రాత్రి యచటికెవ్వరును రానీయక చేసి, తమ కాయిల్లు విడువవలెనని నన్నుఁ బ్రార్థించి, నాచేతఁ బదిరూపాయలు పెట్టెను. నే నందుల కొప్పుకొని యట్టులే చేసితిని.

డఫేదా—నీవేల యీసంగతి మాకు ముందుగాఁ దెలుపకపోతివి?

రాము—అయ్యా, నేను బీదవాఁడను. కుటుంబిని. ఎవరైన నొక పెద్దమనుష్యుఁడు నాలుగురూపాయలిచ్చినఁ దీసికొని గది నొకరాత్రికి వదలుట తప్పిదమా? గది నద్దెకువదలుటయు ముందుగాఁ దెలుపఁబడవలయునా? నేనియ్యకుండినను మఱియొకరియ్యరా?

ర—నీచేతఁ గాగితములు దొరకెననివింటిని. వానిసంగతియేమి?

రాము—వారు పోయినతరువాత రక్తముల బొట్లు, ఇంటిలోఁబడియుండుటఁజూచి, దీపము వెలిగించి లోపలఁ జూచితిని. అపుడు నా కీసంచిదొరకెను. ఇందులో నీయుత్తరములుండినవి. (అని యాసంచిని రసూల్ ముందటఁ బెట్టెను.)

రసూ—(జాబులనుచూచి) ఇవి మహారాష్ట్రభాషలో వ్రాయఁబడియున్నవి. నా కాభాష తెలియదు. మల్హారరావు లేచిన తరువాత వానిచేత వీనిఁ జదివింపవలెను.

మల్హారరావు—కాగితములా? ఏమి కాగితములు? నాకు చూపుము. నాకు రెండవచేయి స్వాధీనముకాలేదు.

అంతట రసూల్ఖాను దీపమును వానిప్రక్కనఁ బెట్టించి, జాబులను వానియెదుటఁ బెట్టించి, వానిఁ జదువమనెను. మల్హారరావాజాబులచూచి, యవిశివాజీయొక్క మనుష్యుఁడైన కామేశ్వరశర్మచేతఁ బ్రహారసింగునకు వ్రాయఁబడినవనియు, అందులో మహారాష్ట్రులు ప్రహారసింగుయొక్క సహాయము కోరియున్నారనియుఁ జెప్పెను. రసూల్ఖా నంతట నాయుత్తరములఁ

దీసికొని, మల్హార్ రావు నొక పల్లకిమీఁదఁ బెట్టి వానియింటికిఁ దీసికొనిపొండని రాజభటులకుఁ జెప్పెను. తా నుదయమునఁ గొత్వాలుతో మాట్లాడి పిమ్మట నింటికిఁ బోవుచటులను జెప్పెను.

---

## అయిదవ ప్రకరణము

రసూల్ఖాను మల్హారరావుతోఁగూడ నిల్లువదలి పోయిన తరువాత, అఫ్జుల్ఖాను తనమేడమీఁది గదిలో నొంటరిగాఁ గూరుచుండి బీజపూరు సంస్థానముయొక్క రాజ్యాంగస్థితిని గుఱించి తలపోయుచుఁ గొన్ని కాగితములఁ జూచుచుండెను. ఆకాగితములు బీజాపూరు సంస్థానముయొక్క వాయవ్యపశ్చిమ ప్రదేశముల పాలనాధికారులు వ్రాసిన యుత్తరములు. అందులో శివాజీమూలకముగా జరుగు కుట్రలవలనఁ బర్వత ప్రదేశములలోనివారు, వారి కెదురుతిరిగినట్లును, శివాజీ యౌరంగజేబుతోఁ జేరిన బీజాపూరు సంస్థానమును బట్టుకొనుటకుఁ బ్రయత్నించుచుండునట్లును గనఁబడుచుఁబడి యుండెను. అఫ్జుల్ఖాను బీజపూరు సంస్థానమున రాజ్యాంగ కార్య నిర్వాహకుఁడును, సేనాధిపతియు, నవాబునకు మిక్కిలి నమ్మకమైనవాఁడును నయినందున, నవాబుగా రీకాగితములను ముందటి సాయంకాల మీయనచేతి కిచ్చి, జరుగవలసిన కార్యములనుగుఱించి యోజింపుమనెను. బీజపూరు పట్టణము లోపల మొగలాయివారికి సాహాయ్యులుగా నుండువా రనేకు లుండిరి. రాజ్యాంగమున సాగుదలఁ బోగొట్టుకొనినవారును, నవాబుగారి యాగ్రహమునకుఁ బాత్రులయినవారును, మొగలాయివారి కాప్తులుగనుండి, పట్టణములోపలఁ గుట్రలఁబన్ను

చుండిరి. సంస్థానమంత్రియైన ఖాన్ మహమ్మద్ వంటివారు కొందఱు తామే నవాబులుగావలె ననుపేరాసతో నౌరంగజేబు కుట్రలకు లోబడియుండిరి. బిజాపూరు నవాబు మహమ్మదీయులలో షియ్యా యను నొకతెగకుఁ జేరినవాఁడు. ఔరంగజేబును, అఫ్జుల్ఖానును, బిజాపూరులోని మఱికొందఱు మహమ్మదీయులును సున్నీ తెగవారు. సున్నీలకును, షియ్యాలకును బరస్పరవిరోధము కలదు. అందుచేత నట గొందఱు మొగలాయివారికి సాయముగా నుండిరి. అఫ్జుల్ఖాను సున్నీలతోఁ జేరినవాఁడయ్యును సత్యపథమును వదలఁగూడదని రాజుగారికి నమ్మకముగా రాజ్యాంగపుఁ బనులు చూచుచుండెను. ప్రస్తుతము బిజాపూరు సంస్థానాధిపతియగు నవాబు ఆలీ, ఆడిల్షాకు నీయఫ్జుల్ఖానునందుఁ బూర్ణమైన నమ్మకమును బ్రేమయు నుండెను. అఫ్జుల్ఖానుకును నవాబునం దనురాగము గలిగియుండెను. కాబట్టి యాసంస్థానమునకు వచ్చిన యాపదవియెల్లను దనకుఁగలిగిన కష్టములవలెనే యెంచి ప్రతిక్రియకై యఫ్జుల్ఖాను దీర్ఘాలోచనఁ జేయుచుండెను.

ఈ సంస్థానములోఁ జేరిన రాజ్యములోపల వాయవ్యపశ్చిమదిగ్భాగములయందుండుజను లాయుధపాణులై గుంపులు గూడుటయును, నవాబుగారిచే నియమింపఁబడిన యధికారులను వారు తిరస్కారము చేయుటయును, శివాజీ కచట విశేషము చెల్లుబడి యుండుటయు, శివాజీ ముందుఁ బన్నును వసూలుచేయుటకుఁగూడ నవాబుగారి యుద్యోగస్థులకు సాధ్యపడకుండుటయు, అఫ్జుల్ఖాను మనస్సున గలవరమును, విషాదమును గలిగించెను. ఏకకాలమున నౌరంగజేబుతోను శివాజితోనుయుద్ధము

పెట్టుకొనుట కష్టము గనుక నెటులైనను సదుపాయముచేసి యొకనితో మాత్రము యుద్ధము పెట్టుకొనుటకు యోచించు చుండెను.

ఇటులుండఁగా నరుణోదయమున నొకబాలుఁడు తలుపుఁ దట్టుటయును, దనభటు లతనిఁ దఱుమఁగొట్టుటయును గమనించి తెలిసికొని, యఫ్జుల్ఖాను తలవాకిటికిఁబోయి, యాబాలుని బిలిచి, వచ్చినపని యేమని వాని నడిగెను. అంతట నా బాలుఁడు రాత్రి రాము నంగడియొద్ద జరిగినవృత్తాంతమంతయుఁ దెలిపి తెల్లవాఱినతోడనే రసూల్ఖాను కొత్తవాలుదగ్గఱకుఁ బోవలెను గనుక నింటికిరాలేఁడనియుఁ జెప్పెను. అఫ్జుల్ఖా నామాటలు వినినతోడనే తత్తఱముతోఁ బ్రయాణమై, తన భటులలో నఱువదిమంది యీటెగాండ్రను బిలుచుకొని గుఱ్ఱముపై నెక్కి రసూలుండుచోటుకిఁబోయెను. రసూల్ఖానుండు చోటున కఫ్జుల్ఖాను చేరినతోడనే, రసూ లెదురేగి, లోపలికిఁ దోడితెచ్చి, మల్హారరావుండుంగడిలో, గూర్చుండఁబెట్టెను. అఫ్జుల్ఖాను ప్రక్కనఁ గూర్చుండినతోడనే మల్హారరావు కన్నీటిం గార్చుచు, శయ్యపైనుండి యిట్లనియె.

మ—అయ్యా! ఆపాపిష్ఠి తణ్ణాజీ నాకుఁ బ్రాణాపాయముఁ గలుగఁజేసెను

అఫ్జుల్—భయపడవలదు. ప్రాణాపాయ మేమియు నుండదు. సావకాశముమీఁద నెమ్మదియగును.

మ—తణ్ణాజీ యింకను బట్టణములోనేయుండును. వానిఁ గనిపెట్టితెచ్చుటకు మనుష్యులఁ బంపుము. వాఁ డెక్కడనైన నొక గోసాయీమఠములో దాఁగియుండును.

అ—తణ్ణాజీ బిజాపురము లోపలికివచ్చి, యింతపనిఁ జేసెనుగా! ఎవఁడురా బైట! మీలో నొకఁడుపోయి పట్టణపుఁ గావలివాండ్రనుజూచి తణ్ణాజీ యిచటికి వచ్చినసంగతిఁ దెలిపి పట్టణమునుండి వెలుపలికిఁ బోవువాండ్రను శోధనచేసి తణ్ణాజీ యగుపడిన వాని నిచ్చటికిఁ బట్టి తేవలసిన దని చెప్పుము.

అని చెప్పఁగాఁ దక్షణమే యొకమనుష్యుఁడు బయలు దేఱిపోయెను.

అ—(రసూలునుజూచి) రసూల్, నీ వాయుడుపులను దీసి యీయుడుపులను ధరించుకొనుము. నీవు హిందూ దుస్తులతో నుండుట చక్కగా లేదు.

ర—ఈ దఫేదారుఁడా క్షేపణ చేయకుండిన నటులనే చేసెద. నేను వారిస్వాధీనములో నుండుసంగతి మఱచితిరా?

అ—ఛీ! నీవు వారిస్వాధీనములో లేవు. నీవు సరియైన యుడుపులను ధరించికొనుము.

రసూ లటులనే ధరించుకొని యఫ్జల్‌ఖానును దూరముగాఁ బిలుచుకొనిపోయి, రహస్యముగా, రాత్రి యంతయు భవానీ దేవ్యాలయములో, జరిగినసంగతినంతయుఁ దెలిపెను?

అ—ఆహా! మంత్రి యెంతటిద్రోహమున కొడిగట్టెను. వీఁ డింతటి యసత్యవాది యని నే నెన్నడును దలఁపలేదు.

ర—నాయనా, ఎటులనైనను వానిఁగాపాడవలయును. అతనికుమారునికి నాచెల్లెలి నియ్యవలెననియు మనము నిశ్చయించియుండలేదా? ముందుగా వానికి జరిగినదంతయుఁ దెలిపిన నతఁ డొకవేళఁ దప్పించుకొనవచ్చును. వానిని మన్నింపుమని నవాబుగారిని మీరు ప్రార్థింపుఁడు.

అ—నేనిరువురికిని బాధలేనిమార్గమును యోజింపవలెను. నవాబు నన్ను నమ్మినవాఁడు. మంత్రి మనకాప్తుఁడైనవాఁడు. నీవు మంత్రికుమారునొద్దకుఁ బోయి యీసంగతులను దెలిపి, తగిన జాగ్రతపడుమని చెప్పుము. నేను నవాబునొద్దకుఁ బోయి, వారి కాపదరానివిధమును యోజించెదను. కొత్వాలు తిన్నయింటికి ద్రోహ మెంచెడివాఁడుగాఁడు. కాఁబట్టి వాడు మనకేమియుఁ జెడుపుచేయఁడు. అయినను లాలానోటికేమిచేయవచ్చును వాఁడేల జరిగినసంగతుల దాచును. కావలివారు వానిని గొత్వాలుదగ్గఱకుఁదీసికొనిపోయినటులనున్నది.

ర—మనమును కొత్వాలుదగ్గఱకే పోవుట యుక్తము. సూర్యోదయము కావచ్చినది. శీఘ్రముగాఁ బోవలెను.

రసూల్లా ననినమాటకు అఫ్జుల్లాఖా సమ్మతించెను. వారిరువురును బరివారసహితులై బయలువెడలిరి. ఈటెగాండ్రగుంపు ముందునడచెను. రక్షకభటులు వెనుకనడచిరి. అఫ్జుల్లాఖానును రసూల్లాఖానును రెండు ధవళాశ్వములపై నెక్కి రక్షకభటుల నడుమఁ బోవుచుండిరి. తెల్లనైన యుడుపులను ధరించుకొని బంగారు సరిగదువ్వాలువలెఁ బైనవేసికొని, యెఱ్ఱని సరిగతలపాగలు ధరించి, స్వారిచేయుచు, నడువీధిని జనుచున్న వారి యాకారములు చూచువారికి, వింతయు, వేడ్కయుఁ గొలుపుచుండెను. అంతఁ గొంతసేపటికి వారు కొత్వాలుగృహము చేరిరి. అచట ముందుప్రక్క నొకగదిలో లాల్సింగును పరుండబెట్టి యుండుట రసూలు చూచెను. వారచట నిలువక కొత్వాలు కచ్చేరి చేయుచోటికిఁ బోయిరి.

ఆకొత్వాలు పారసీకదేశస్థుఁడు. అతఁడు విశేషకాపట్య

మును, బుద్ధిసూక్ష్మతయుఁగలవాఁడు. చిన్నతనంబునఁజక్కఁగా జదువుకొనియుండెను. ఆతఁ డనేకసంవత్సరములు బీజపూరు సంస్థానమునఁ గొలువుఁగొలిచి, నవాబునొద్ద నమ్మకమువడసి, బుద్ధిమంతుఁడను పేరుబొంది, యీ యధికారపదవిఁ గాంచెను ఈ యుద్యోగములో మిక్కిలి క్రూరుఁడను పేరు నితఁడు సంపాదించెనుగాని, లంచములు తీయుచుండుటవలన ధనికులకు మాత్రము మంచివాఁడుగా నుండెను.

ఇతఁడు మిక్కిలి భయంకరమైన యాకారమును గల వాఁడు. ఇతని గొప్పదైన ముఖమును, వెడలుపైన కనులును, నిడివియైనవాడియు, నల్లనైన రూపును, గఠినమైన వాక్కును, వీక్షించినవారికి వెఱపుఁ గొలుపుచుండెను. విచారణచేయు నపు డితఁ డెంతటి యాశ్చర్యకరమైన సంగతి వినినను, నవ్వుటయే లేదు; కఠినశిక్ష విధించునపుడును వ్యసనమును గనఁ బఱచినదిలేదు. ఇతనికిఁగల యధికార మింతింతనరాదు. గొప్ప వారిఁ దలదీయుటలో మాత్రము నవాబునకుఁ దెలుపవలయునే గాని తక్కినవారిఁ దలదీయుట మొదలగు శిక్షలను విధించుట కితనికిఁ బూర్ణాధికారముండెను. కాళ్లునఱకుట, చేతులునఱకుట, ముక్కుకోయుట మొదలగునవి ఇతఁడు చేయుస్వల్పశిక్షలు. రసూల్‌ఖాను కొత్వాలుదగ్గఱకుఁ బోవుటకు ముందు నాఁటి రాత్రి యిద్దఱికి ఘోరమైన గాయములు తగిలియుండెను. ఒక శవముభవానీదేవ్యాలయముచెంతఁ బడియుండెను. రసూల్ఖాను నాఁడర్ధరాత్రివేళలో పట్టణమువెలుపలఁ దిరుగుచున్నందులకుఁ గావలివాండ్రును, రాము నంగడికి వచ్చినందులకు దఫేదారు మొదలగువారును సాక్షులుండిరి. తణ్ణాజీనిఁ జూచినందులకు

రాముఁడొకఁడే సాక్షి. ప్రహరసింగును జూచినందుకు లాల్సింగొకఁడేసాక్షి. ఈసాక్షులు నమ్మఁదగినవారు కారు. కాఁబట్టి కొత్వాలుదగ్గఱకుఁ బోవునపుడు రసూల్ఖాను మనసు కలవరముగనే యుండెను.

అఫ్జుల్ఖాను కుమారునితోఁగూడ నాకొత్వాలు కచ్చేరిలోపలఁ బ్రవేశింపఁగనే, కొత్వాలఫ్జుల్ఖానుకుమాత్రము సలాముచేసి, మర్యాదతో గుర్చీనిచ్చి, కూర్చుండుమనెను, గాని రసూలున కేమాత్రపు మర్యాదయుఁ జేయక, యతనిని దీక్ష్ణమైనదృష్టితోఁజూచుచుండెను. ఈసంగతిని గమనించి యఫ్జుల్ఖాను కొత్వాలుకు రసూలునుజూపి యతఁడు తనకుమారుఁడే యనిచెప్పెను. గాని కొత్వాలు దానికేమియుఁ బ్రత్యుత్తర మీయక యూరకుండెను.

అ—రసూల్! రమ్ము, కొత్వాలుగారు పనిమీఁద నున్నారు. నామాటలు వారిచెవిని దూరలేదు. ఇన్నిదినములు వారికుండిన మర్యాద యిపుడు వారిని వదలినట్టున్నది. మన మింక నిలుచుట మేరగాదు.

కొత్వాలు—పోఁగూడదు, కదలఁగూడదు, అఫ్జుల్ఖాన్, నీవుమాత్రము పొమ్ము. ఇచటనీవు నిలిచితివేని నీకు వ్యసనము కలుగును. ఇఁక నిచటఁ జరుగఁబోవుసంగతులు నీకు వ్యసనకరములైనవే. నీకుమారుని కత్తిమీఁద రక్తము గనఁబడుచున్నది. దానినిగుఱించి విచారింపవలెను. (రసూలువంకఁ జూచి) వారు నీవిషయమునఁ జెప్పెడుమాటల కేమి బదులు చెప్పెదవు?

ఇది యఫ్జుల్ఖాఁ కుమారుఁడు చేయఁదగినపనియా? సత్యముగాఁ బలుకుము. దైవసాక్షిగాఁ జెప్పుము.

ర—అయ్యా, నేను దుంటరిని గాను, త్రాగుఁబోతును గాను ఈ దఫేదారు నడిగిన నతఁడు జరిగినసంగతినంతయుఁ దెలుపును. నావలన దోష ముండునదియు, లేనిదియు నతఁడే తెలుపును.

కో—నీవు రాత్రి గోసాయివేషమును బూని, ఇంకొక మనుష్యునితోఁగూడఁ దిరుగుచుండ లేదా?

ర—అవును, మాతండ్రియు త్తరువు మీఁద నేపోయితిని.

కో—దఫేదార్, రాత్రి జరగినసంగతులను దెలుపుము.

దఫే—అయ్యా, రాత్రి సుమారు పండ్రెండుగంటల కిద్దఱు గోసాయీలు ఒకగాయముచెందినమనుష్యుని పట్టుకొని వచ్చిరి. గాయముచెందినవాఁడు దూరదేశస్థుఁడు. వాఁడు ఢిల్లీదేశపుభాష మాట్లాడుచుండెను. వాఁడు తనకుఁ గంతప్రదేశమున గాయముతగిలినదనియు, తన్ను దొంగలుకొట్టిరనియుఁ జెప్పెను. గోసాయీలు వానిని మాయొద్దవదలి యెచటకో పోయిరి. వానిని మేము రాత్రి యొకపడకమీఁదఁ బరుండఁబెట్టియుండి, యుదయమున నిచటికిఁ దెచ్చితిమి అదిగాక యుదయమునఁ గొందఱుభటులు మాతోఁ జేరినవా రూరివెలుపల భవానీదేవ్యాలయముదగ్గఱకు పోయినప్పుడు, అచట నొకశవముండెను. ఆశవముపైనజందెములుండెను శవము పడియుండినస్థలమునకును గుడికిని నడుమఁ గొన్ని మొహారీలు చల్లఁబడి యుండినవి. త్రోవలో రక్త ముండెను.

కొత్వాలు—మీయొద్ద నొప్పగింపఁబడిన మనుష్యుఁడేమి చెప్పెను.

దఫే—ఎవరో ప్రహారసింగఁట, మాన్సింగఁట. వారిరువురును, ఆదేవాలయములో వాని పదివేలరూపాయీలదోచుకొనిరఁట; గాయపఱచిరఁట సంస్థాన కార్యదర్శిగారు కూడ నచటికి వచ్చియుండిరఁట. వానిమాటలలో నేమియు నర్థముకాలేదు.

కొ—మీయొద్ద నొప్పగించినవారెవరు? వారిట్టివారని దెలిసికొనలేక పోయితిరా?

దఫే—ఒకఁడు మాత్రము మల్హారరావు అని యనుకొనుచుండిరి. వేఱొకఁ డెవఁడో దెలియదు.

ర—మఱియొకఁడు నేను.

కొ—నేను నట్లే యనుకొంటిని. దఫేదార్! వానిచేత నాయుధము లుండినవా?

దఫే—ఖేటములు, ఖడ్గములుగూడ నుండినవి.

కొ—ఆ యాయుధము లెక్కడ?

దఫే—అయ్యా, ఇదిగో నాయొద్దనున్నవి. రసూల్ఖాను నాచేతికిచ్చెను. (అని కత్తులను జూపెను.)

కొ—సరి, కత్తిమీఁదను ఖేటముమీఁదను రక్తముతగిలియేయున్నది. రసూల్ఖాఁ, దీనికేమి సమాధానము చెప్పెదవు.

ర—నేను చెప్పవలసినది తరువాతఁ జెప్పెదను.

కొ—(భటులతో) గాయము చెందినవానినిఁ దెండు. అని (భటులచేఁ బిలిచికొని రాఁబడిన లాల్సింగునుజూచి) నీవెవరు? నీకీగాయమొనర్చిన దెవరు? నీవెక్కడనుండి వచ్చితివి?

లాల్సింగ్—నన్నెవరు గాయపఱచిరో నాకుఁ దెలియదు? గుడిలో నన్ను దోచుకొనిరి, నేను పరదేశిని.

కో—పదివేలరూపాయిలా?

లా—కాదు. నాబోఁటి బీదవానికి, పదివేలరూపాయిలెట్లువచ్చును? నాయొద్దనున్న స్వల్పధనమును దోచుకొనిరి.

కో—ప్రహారసింగా దోచుకొనినది?

లా—ప్రహారసిం గెవరో నాకుఁ దెలియదు.

కో—నీ కెవరు గాయముచేసినది చెప్పవలయును.

లా—యోగివేషమున నున్నవాఁ డొకఁడును, మఱియొకఁడును నన్నుఁ దోఁచుకొనిరి. ఆవెనుక నిద్దఱు గోసాయీలువచ్చి నన్నులేపి నాకు దాహమునకు నీరిచ్చిరి.

కో—ఇద్దఱు గోసాయీలా? (రసూలునుజూచి) అందులో నీవొకఁడవుగదా?

ర—ఆమాట నేను ముందఱనే చెప్పియుంటిని. నాతో గూడ వచ్చినవాఁడు మల్హారరావు.

కో—నీవేల యాచోటికిఁబోయితివి. వివరముగాఁ దెల్పుము?

ర—నేనుపోయినది రాజ్యాంగ సంబంధమైనకార్యము అది మిగుల రహస్యమైనది గనుక ఆప్రశ్నమునకు నేనుత్తరము చెప్పవలసినదిలేదు. దాని నడుగఁదగినవారికి బదులుచెప్పెదను.

కో—జాగ్రత. ఇక్కడ రహస్యములు సరిపడవు.

ర—ఆవిషయమునుగుఱించి నేను మా నాయనతోఁ జెప్పితి. అంతమాత్రము చాలును.

అఫ్‌జుల్‌ఖాన్—అవును, నాతోఁ జెప్పెను. అది నీకుఁ జెప్పఁదగినది కాదు.

కో—హత్యజరిగి, నీసుమారునికత్తికి నెత్తురు తగిలియున్నది కాఁబట్టి యతనినడత సందేహాస్పదముగా నున్నది. దాని కతఁడు నమ్మఁతగిన సమాధానము చెప్పవలసియున్నాఁడు. రాము నంగడిదగ్గఱ జరగిన దొమ్మివ్యాజ్యమునకును నీకొమారుఁడే యుత్తరవు చెప్పవలసియున్నాఁడు.

ర—నేను దొమ్మివ్యాజ్యములు వేయువాఁడను గాను. త్రాగుబోతును గాను. రాముఁడు నిచటనే వచ్చియున్నాఁడు. వానిని విచారింపుము.

కో—దఫేదార్ నీకుఁదెలిసినది చెప్పుము. (భటులను జూచి) ఆరామునిఁ బిలువుఁడు.

దఫేదారుఁ డంతటఁ దనకుఁదెలిసిన విషయమంతయు వివరముగాఁ దెలిపెను. ఒకభటుఁడుపోయి రామునిఁ బిలుచుకొనివచ్చెను.

కొత్వాల్—రామా! రాత్రి నీయంగడిదగ్గఱ జరిగిన సంగతియంతయుఁ దెలుపుము.

రా—రాత్రి నాయంగడిదగ్గఱ నీరసూల్ఖానుకును తణ్ణాజీకిని కొన్నిమాటలు జరగెను.

కో—తణ్ణాజీయా, ఏమి! త్రాగిమాట్లాడెవా? తారుమారుగ మాట్లాడకుము.

రా—అయ్యా, నేను త్రాగలేదు. నేను త్రాగఁగూడదని యాఁనఁబెట్టుకొని యున్నాను. స్వామితోడుగఁ జెప్పెదను. నిశ్చయముగా తణ్ణాజీతోనే యీయన మాట్లాడెను.

కొ—దఫేదార్, వాఁడు గోసాయీ వేషముతో నుండెనుగదా?

డ—రసూల్ఖాఁ చెప్పినది యదియేగదా?

కొ—రామా, రసూల్ఖాను తన్నాజీ కేమి చెప్పెను. నిజము చెప్పుము. లేకున్న ని న్నురిదీయుదును.

రా—నేనేల యబద్ధమాడవలెను! (రసూల్ఖానుఁజూపి) ఈయన ప్రహార్సింగుతో మాట్లాడినట్లు తన్నాజీతోఁ జెప్పెను. తన్నాజీ యీాయనతో శివాజిని గుఱించియు నేమో చెప్పుచుండెను. ప్రహార్సింగున కేమోసమాచారము చెప్పవలసియున్నదనియు తన్నాజీ చెప్పెను. ఇంతలో నితనితోఁగూడనుండినమనుష్యుఁడు తన్నాజీని బొడిచెను అంతట వారిరువురికి వ్యాజ్యమాయెను నేనుగుఁతలు పెట్టితిని. రక్షకభటులువచ్చిరి. తన్నాజీ పరుగెత్తిపోయెను. వానినిఁబట్టుటకు నేను వెంటనేపరుగెత్తితిని.

ర—ఛీ! తప్పుడుకూతలు కూయకుము.

రా—అయ్యా, వానిమాటల వినుఁడు. అతఁడు మనుష్యులనుబంపి నన్నుఁ గట్టించెను. నాచేతు లెటుల వాచియున్నవో చూడుఁడు. తన్నాజీయిచ్చిన కాగితములకూడ రసూల్ఖానువొద్ద నున్నవి. అతని శోధించిన దొరకును. వాని నేను చూచితిని.

కొ—సరి, ఈరసూల్ఖాను మూలముగ రాజద్రోహపుఁగుట్రలు, విశేషముగా జరుగుచున్నవి. నేను దాక్షిణ్యము చూచువాఁడను గాను ఇటువంటి విషయములలోఁ గ్రూరమైన శిక్ష విధింపవలసినదే. (రసూలునుచూచి) ఇఁకను నీవేమి చెప్పియుఁ బ్రయోజనము లేదు. నీవు శిక్షకుఁ బాత్రుఁడవు.

అ—(కొత్వాలు సేవకులు రసూలుపైఁ బడుటఁ జూచి కత్తిదూసికొని లేచి) రసూల్! లెమ్ము, రమ్ము. ఈతొత్తుకొడుకులలో నెవరు మునుపు చచ్చెదరో చూచెదము. మనుష్యులనేకులు వైటనున్నారు. వారిచటనుండిన వీరితల లిదివఱకే యెగిరియుండును. బిస్మిల్లా!

ర—(చేతిలోనికత్తిఁ బడవైచి) నాయనా, నిదానింపుము. న్యాయమార్గముననే నానిర్దోషత కొత్వాలునకుఁ దెలిపెదను. అబద్ధమాడిన యీగడియకో యింకఁ గొంతవడికో శిక్షగలుగును. మనకు దొమ్మియుద్ధము పనిలేదు.

అ—ఛీ! అఫ్ఘనుదేశమునఁబుట్టి వీనికి భయపడి కత్తిని గ్రిందవైచుట సరియా?

కొ—అయ్యా, అఫ్జుల్ఖాన్, న్యాయసభలోనా కత్తుల నుపయోగింపవలెను? అదియుఁగాక మీరిచట నొంటరిగా నున్నారు. నాభటులలో నొకరిద్దఱుచచ్చినను మీరుతప్పించుకొని పోలేరు. కత్తిని లోపలనుంపుము. మంత్రిగారి యుత్తరువయ్యెడువఱకు మీకొమారు నంపుటకు సాధ్యపడదు.

ర—నాయనా, తొందరపడకుము. రాజుగారి కీసమాచారము తెలిసినంతలోనే మనభయముతీరును. రాజద్రోహుల మనుపేరు మనకు రాఁగూడదు.

కొ—అఫ్జుల్ఖాన్గారూ! మంత్రిగారు సాయంతనము మాత్రము పట్టణమునకువచ్చును. అంతవఱకు మీరిచటనే యుండుఁడు ఆగది మీకు విడిచియున్నాను. మీకు భోజనము సిద్ధము చేయుట కుత్తరువు చేసియున్నాము.

ర—నాయనా, మన మాగదిలో నుండుట మేలు.

కొత్వాలుగారూ, సమీపమున రాజభటులగుంపు కావలిగాఁచుచుండఁగా, నాముని యిష్టములేకయే వానియింట రత్నాక్షి యెట్లుండును? ఆవిషయమును మీరు చక్కఁగా యోజింపుఁడు. తక్కిన సంగతులను డఫేదారు నడుగుఁడు.

ఇట్లుఁజెప్పి రసూలు తనతండ్రిని బిలుచుకొని కొత్వాలుచేఁ దెఱవఁబడిన గదిలోనికి కొత్వాలుతోఁగూడఁబోయెను. ఆగది కుర్చీలతోను, మెత్తలతో గూడిన మంచములతోను క్రిందఁ బరుపఁబడిన రత్నకంబళ్లతోడను, మనోహరమైనదియు, విశాలమైనదియునై యుండెను. ఆగదికి రెండుప్రక్కల గవాక్షము లుండెను.

కొత్వా—రసూల్ఖాన్, మీ యొద్దనుండు కాగితముల నిచట నాకు రహస్యముగాఁ జూపుఁడు. వాని నేను శోధన చేయవలసియున్నది.

రసూ—అయ్యా, అవి నవాబుగారికే చూపవలసినది. నవాబుగారితో సంబంధమైన రహస్యవిషయము లం దున్నవి. కాఁబట్టి వాని నితరులకుఁ జూపఁగూడదు.

కొ—సరి, నేను పోయెదను. మీ యిష్టప్రకారము మీరు చేయుఁడు. (అని బయిటికేఁగెను)

అఫ్జుల్ఖాన్—రసూల్, కొత్వాలువలన మన కాపద గలుగునేమో యని నాకు దిగులుగానున్నది. నవాబును చూచుటకును లేకపోయెను. ఇప్పుడు కార్యమించిపోయెను.

ర—నాయనా, భయపడవలదు. నేను డఫేదారు కుమారుని రహస్యముగా మంత్రికుమారునొద్దకు నీసమాచారమును చెప్పుటకుఁ బంపియున్నాను. మంత్రి యుత్తరువు లేక

కొత్వాలు మనల నేమియుఁ జేయఁగూడదుగదా? మంత్రి కుమారుఁడు తనతండ్రికిఁ జెప్పి మనకుఁ గీడు రానటులఁ జేయును. ఒకవేళ నిచటి కిప్పుడే వలయునంత బలముతోఁ గూడవచ్చును.

ఆ—మంత్రి యిప్పుడు తానుండు కలవరములో మన కేమాత్రము సాహాయ్యమును జేయలేఁడు. నవాబుగారి యాగ్రహమునకుఁ బాత్రుఁడాయెను. నామాటలఁ జెవిని బెట్టక పోయెను.

కొత్వాలు బయటకువచ్చినతోడనే యొకసేవకునిఁ బిలిచి రసూలుండు గది వాకిట నిలిచి, తనయుత్తరువు లేక లోపల నుండువారిని వెలుపలికి రానీయకయు, బయట వారిని లోపలికి రానియ్యకయుఁ, జూచుచుండవలెనని యుత్తరువు చేసెను.

అఫ్జల్ఖాన్ పరివారముతోఁ జేరిన యాఫ్ఘన్ యుద్ధభటుల వలనఁ దన కేమియు నపాయము లేక యుండుటకు నేనూరు యుద్ధభటులఁ దనకు సాహాయ్యము పంపవలెనని కొత్వాలు మంత్రికుమారుని కొక యుత్తరము వ్రాసిపంపెను.



## ఆరవ ప్రకరణము.

తణ్ణాజీ మల్హారరావు చేతినుండి తప్పించుకొని రాము సంగడియొక్క పెరటిత్రోవనే పరుగెత్తిపోయి, వెనుకటివీధిలోఁ బ్రవేశించి, తనచారులను గలసికొని, గాయము చెందియుఁ దనతోఁగూడఁ బరుగెత్తివచ్చిన తనమనుష్యుని వారిచేత నెత్తించుకొని పట్టణమువెలుపలి కేగెను. పట్టణమునకుఁ బడమటిపార్శ్వమున రెండుమైళ్ళదూరములో నుండునొకశిథిలమైన దేవా

లయములోపల వారు ప్రవేశించిరి. అచటికి నిటుల రహాస్యము గావచ్చు మహారాష్ట్రులకు వండి పెట్టుటకు యోగివేషముతో నొక గోసాయివాఁడు నివసించుచుండును. పగటి వేళయందు వాఁడొకఁడే యచటఁ గనఁబడును. మహారాష్ట్రులు రాత్రి రెండుగడియల ప్రొద్దునకు నచటికివచ్చి చేరుదురు. ఆదేవాలయమునకుఁ జుట్టుప్రక్కల రెండుమైళ్ళ దూరములోపల పల్లెయే లేనందున రాత్రివేళలో నెవరు నచటికి రారు. కాఁబట్టి యాదేవాలయమునకు మహారాష్ట్రులు వత్తు రనుసందియ మెవ్వరికిని లేకుండెను. అచటికి తన్నాజీ వచ్చి చేరువేళకు సుమారు మూఁడు జాములరాత్రి గడచెను. అప్పటికి వంట పనులు ముగిసి, భోజనము సిద్ధముగానుండెను. పగలు వంట చేసిన సందేహాస్పదమగునని రాత్రివేళ వంటపనులు చేయుట వాడుక. సేవకుఁ డొకఁడు బహిర్ద్వారమునఁ గావలియుండెను. దేవాలయమున రమారమి ముప్పదుగురుమహారాష్ట్రు లుండిరి. తన్నాజీపోయి చేరిన గడియసేపునకుఁ బ్రహారసింగు నొద్దకుఁ బంపఁబడినవాఁడును వచ్చి చేరి ప్రహారసింగు దేవ్వాలయమునఁ గనఁబడలేదనియు, దేవ్వాలయము సమీపమున మాన్సింగు మాత్రము చచ్చి పడియుండెననియు, రామునంగడియొద్ద జరగిన సంగతులు తన కొకవేఁగులవాఁడు దెలిపినందునఁ దాను శీఘ్రముగాఁ దమ టెంకియగు నాచోటికివచ్చినట్లును జెప్పెను. బీజపూరు సంస్థానపు యుద్ధభటు లింకఁ దమ్ము వెదకి కనిపెట్టుటకు వత్తు రనుభీతితో, తన్నాజీమొదలగువారు రెండుగడియలరాత్రి యుండునపుడే భోజనాది కార్యంబులఁ దీర్చికొని బయలువెడలిరి. తన్నాజీ యొక సేవకునితోఁ బశ్చిమదిక్కునకుఁ బోయెను.

తక్కినవారు వాయువ్య దిఙ్మార్గమునఁ బోయిరి. అరుణోదయవేళకు నా దేవ్యాలయమున నొక మహారాష్ట్రుఁడు గూడ నిలువలేదు.

బీజపూరులో నవాబుగారి రాజగృహము, ఏ డంతస్థుల హర్మ్యముగా నుండెను. ఇప్పటికి నాకట్టడముఁ గాంచువారు దాని వైచిత్ర్యమునకును, గట్టినవాని బుద్ధిసూక్ష్మతకును మిగుల నాశ్చర్యపడుచుందురు. ఇప్పుడు పైమిద్దెలు రెండును మనుష్యులకు నెక్కుటకు వీలులేక శిథిలమైయున్నది. ఆకాలమున వీధులుగాను, గృహములుగానుండిన ప్రదేశ మిపుడు బయలుగానున్నదిగాని, యాబయళ్ళనడుమ నచ్చటచ్చటఁ గొన్ని మసీదులును, శిథిలమైనగృహములును గనఁబడుచున్నవి. నగరునకు దూరముగానున్న వీధులలో నిపుడు చిన్నపల్లెలున్నవి.

బీజపూరు నవాబుగారు రాత్రి భవానీదేవ్యాలయము నుండి వెడలి, తననగరు చేరువేళకు నుదయమునకుఁ బదిగడియలప్రొద్దుండెను. నవాబుగారు నగరును జేరఁగనే మేడమీఁదఁబైయంతస్తునసుండు తన శయ్యాగృహముఁ జేరి, యేకాంతముగా శయ్యపైఁ బరుండి, తన కప్పుడాపదవిన మున్పుదప్పించుకొన వెరవునెమకుచుఁ, జింతాక్రాంత హృదయుఁడై నందున మేలుకొనియే యుండెను. వెండితోఁ జేయఁబడిన దీపపు స్తంభంబులయందు దీపములు వెలుఁగుచుండెను. పడమటిపార్శ్వమున గవాక్షములు తెఱువఁబడి యుండెను.

నిష్కారణముగాఁ దనమంత్రి శత్రువులతోఁ జేరి తన కెదురు తిరుగుట నవాబునకుఁ మిగుల నాశ్చర్యమును, వ్యసనమును, భయమును, గలుగఁజేసెను. ఈమంత్రి చిన్నతనంబున

నవాబుగారి తండ్రియొద్ద బానిసగా నుండి, యతని యనురాగ
మును సంపాదించి, కొన్నినాళ్లకుఁ బైన మంత్రిపదవినిఁ బొం
దెను నవాబును,తన తండ్రిదినములనుండియునున్న వాఁడనియు,
విశేషానుభవముఁ గలిగిన వాఁడనియు,వీనియందు గౌరవముంచి
యా యుద్యోగముననే వీనిని నిలిపియుంచెను వానియందున్న
నమ్మకముచేతనే యతనికిరువదివేల సేనసాహాయ్యమిచ్చి, మొగ
లాయివారివలన నుపద్రవముగలుగనీయక తమరాజ్యముయొక్క
యుత్తర సరిహద్దులను గాపాడుట కతని నంపెను. వానికంటె
నమ్మకముగా నుండినవాఁడు అఫ్జుల్లాఖానుదప్ప వేఱొకఁడా
రాజ్యాంగమున లేఁడు. తన యుద్యోగస్థులలో ముఖ్యుఁడైన
కొత్వాలు మంత్రికి స్వాధీనుఁడై మంత్రి చేతిలో బొమ్మవలె
నుండెను. అఫ్జుల్లాఖానుకూఁతును మంత్రికుమారుని కిచ్చునటుల
నిశ్చయముచేయఁబడి యుండినందున మంత్రి కనిష్టమగు కార్య
ముల నెఱవేర్చుటయం దతనిని గూడ నమ్ముటకు లేదు. ఈ
యోజనతో రాత్రియంతయు నవాబుగారు ప్రొద్దుపుచ్చు
చుండిరి. అరుణోదయ మైనతోడనే యతఁడు తనయొద్దనున్న
సేవకులనంపి తమపేష్కారగు నీలకంఠరావును, గురువులగు
దస్తగిరి సాహేబును కార్యాలోచనమునకై రప్పించెను.
ఈ నీలకంఠరావున కిప్పుడు సుమా రెనుబదిసంవత్సరములవయ
స్సుండును ఇతఁ డిరువదిసంవత్సరముల వయస్సున నవాబుగారి
కొలువులో స్వల్పవేతనమున లేఖరిగాఁ జేరి, తనబుద్ధి సూక్ష్మత
చేతను, సత్యప్రవర్తనచేతను నవాబుగారి యనుగ్రహమును
నమ్మకమును సంపాదించి, రాజ్యాంగముయొక్క పన్నును
వసూలుచేయుటకు ముఖ్యాధికారియగు పేష్కారి యుద్యోగ

మును బొందెను. ఇతనియందు నవాబుగారికి విశేష గౌరవ విశ్వాసములు గలిగియుండుటచేత నితనితోడఁగార్యాలోచనము చేయుటవాడుక. దస్తగిరిసాహేబు స్వకులాచారములయందు విశేషాభిమానియు, హిందువులయందు మిగుల నసూయగల వాఁడునునై యుండెను. నవాబుగారు వారిరువురకును రెండు కుర్చీలనిచ్చి కూర్చుండ నియమించి యిట్లనిరి.

నవాబు—అయ్యా, నీలకంఠరావుగారూ! మహారాష్ట్ర భాషలో వ్రాసియున్న ఈయుత్తరములఁ జదివి వానిలోనిసమా చారముల నాకుఁ దెల్పుము. మీకంటె నమ్మకమైనవారు నా కెవరును లేరు. (అని యుత్తరముల నతని చేతికిచ్చెను.)

నీల—అయ్యా! మీతండ్రియు, మీతాతయు నాయం దెంతయు నాదరమునే చూపుచుండిరి. ఇన్ని దినములును మీ సంస్థానమునకు నమ్మకముగానే పనిచేయుచుంటిని. (ఉత్త రములఁజూచి) అయ్యా, ఇది శివాజి వ్రాసినది.

దస్త—ఆయధముఁడా! వాఁడు మొన్ననే మనకోటల రెంటిని పట్టుకొనెనఁట. వాఁడుండు ప్రతాపగిరి కోట పట్టుట కసాధ్యమైనదఁట. వీని పోరాటమే యెక్కువాయెను.

నవా—ఆతనిఁజదువనిమ్ము. వెనుకమాటలాడవచ్చును.

నీల—ఈ యుత్తరము శివాజీ మొగలాయి చక్రవర్తి యగు ఔరంగజేబునకు వ్రాసినది ఇందులో మీరు హిందు వులను మిగుల బాధపెట్టు చుండునట్టును, అందుచేత మహా రాష్ట్రులందఱును మీ ప్రభుత్వమున కెదురు తిరిగి మొగ లాయివారికి సహాయపడునట్లును దానికిఁ బ్రతిఫలముగా

మహారాష్ట్ర దేశమును శివాజీకిఁ జక్రవర్తి వదలవలసినదనియుఁ వ్రాయఁబడియున్నది.

నవా—నీలకంఠ రావుగారూ! ఈసందర్భమున మనము చేయవలసిన కార్యమును దెలుపుఁడు. మీరీ రాజ్యాంగవిష యములలో విశేషానుభవము గలవారలు.

నీలకంఠ—అయ్యా! నామాటలు మీ కసూయఁ గలిగించునేమో యని సందేహముగానున్నది. మీ రవశ్యము చెప్పవలయుననిన చెప్పెదను.

దస్తగిరి—ఏలినవారి యంతస్తును గౌరవమును గని పెట్టి మాటలాడుము.

నవా—అవశ్యము లేదు; మీకు యుక్తమని తోఁచినది మీరు చెప్పుఁడు.

నీతి—ప్రజానురాగముఁ గాంచని ప్రభువు సౌఖ్య మును, భార్యానురాగముఁ గాంచని పతిభోగమును,శూన్యము లైనవే. పరిపాలిత పరిపాలకుల కన్యోన్యస్నేహము లేకున్న నెమ్మది యుండదు. తన్నొల్లని సతితోఁ గాపురముచేయు భర్తకుఁ దనభార్యవలనఁ దనకేకాలమున నెట్టి చెడుగు గలు గునో యను శంకయు, భార్య పరపురుషగమనముచేఁ దన కవమానముఁ గలిగించు నను శంకయు నెడతెగక యుండి యాతనిఁ జింతామగ్నమానసునిఁగాఁ జేయునటులఁ, బ్రజల యనురాగముం గాంచని నృపతి కెప్పటికిని సంశయమును భీతియు గలుగుటయు నెమ్మది లేకుండుటయుఁ దటస్థించును. మహారాష్ట్రులు మీచేఁ బాలింపఁబడిన జనులైనందున వారిని మీరు సామోపాయమున మీ స్వాధీనమం దుంచుకొనిన

మొగలాయివారిని జయించుట సులభసాధ్యంబు. ఏ రాజు ప్రజల మనస్తాపంబునకుఁ బాల్పడునో ఆతని రాజ్యంబుపట్టుట శత్రువులకు సులభంబు. శివాజీ యవతారపురుషుఁడనియు, దైవానుగ్రహముఁ గలవాఁడనియు మహారాష్ట్రుల కండఱికిని నమ్మకముగలదు. కాఁబట్టి యతనితో సంధిచేసికొనియతనిని స్వాధీనమున నుంచుకొనుట యుక్తము.

దస్తగిరి—హిందువులకు అల్లాగదా దేవతలు? వారలకు దైవమెక్కడిది? జ్ఞానమెక్కడిది? వారినిఁ జంపుటయే మనకు ముఖ్యధర్మము. కొరానులో నేమిచెప్పియున్నది? అన్యమతస్థునిఁ జూచినంతమాత్రమునఁ జంపవలసినదని చెప్పియుండలేదా?

నవాబు—రాష్ట్రములో నిజనులనందఱఁ జంపిన పిమ్మట రాజెవరినిఁ బాలింపవలెను. దేశమందంతట హిందువులుండుటచేత నందఱను జంపించి యాపని చేయుటలో నున్న మహాత్మ్మీయులను బోఁగొట్టుకొని నిర్మానుష్యమైనతరువాత భూమి నేలవలయుఁ గాఁబోలు. గురువులవారి యాలోచనప్రకారము చేసిన శీఘ్రముగఁ గడతేరవచ్చును. గురువులుగారూ! మీ యాలోచన చాలును.

నీ—మీ గురువులవారి యిష్టప్రకారము మహారాష్ట్రలను హత మొనర్చుటకే యత్నించినను నది యిపుడు కొనసాగునా? శివాజీ కోటనుఁ బట్టుటకుఁ బ్రయత్నము చేయునెడల మనసేన నంతయుఁ బ్రతాపగిరికే పంపవలయును. ఆ సమయమున మొగలాయివారిసేన పట్టణముపైకివచ్చిన, పట్టణము మొగలాయి వారిదే. శివాజీతో యుద్ధము చేయుటవలన నీకు జయ

ముగలుగుట సందియము; ఇచటఁ బట్టణము పరాధీనమగుట నిశ్చయము. ఇంతయే మనకుఁ గలుగులాభము. శివాజీని మంచి తనమున స్వాధీనపఱచుకొనవలయును.

దస్తగిరి—నవాబుగారూ! ఇతనిమాట నమ్మకుఁడు. ఇతఁడు హిందూపక్షపాతి. శివాజీపైకి మనము యుద్ధమునకుఁ బోవు సమయము మొగలాయివారి కెటులఁ దెలియును! ముందుగా మహారాష్ట్రుల జయించిన మొగలాయివారిని వెనుక జయింపవచ్చును. ఇంటఁ గెలిచి రచ్చఁ గెలువవలయునని వినలేదా?

నీల—అయ్యా, నే నింక సెలవుదీసికొనెదను.

నవాబు—పొమ్ము. ఈవిషయమును గుఱించి దీర్ఘాలోచన చేయవలసియున్నది. మీ రీ సంగతులను రహస్యముగా నుంచవలయును.

అంతట నీలకంఠరావు వెడలిపోయెను. నవాబును దస్తగిరిసాహేబును మంత్రిగారి ద్రోహమును గుఱించి మాటలాడుచుండిరి. మంత్రి నెటులనైనఁ జంపించవలెనని దస్తగిరి సాహేబు పలుమాఱు నవాబునకు నొక్కి చెప్పుచుండెను. ఆసమయమున "దేవీ పాతుమాం" అను నొక శబ్దము రెండుమాఱులు వినఁబడెను.

నవాబు (గురువులవారితో) సాహేబుగారూ! ఏమా శబ్దము? ఒక సేవకునంపి తెలిసికొనుఁడు.

దస్తగిరి—నేనేపోయి చూచివచ్చెదను. (అని బయటఁ బోయెను.)

దస్తగిరి——(మఱలఁ గొంతసేపటికి వచ్చి) ఎవరో గోసాయివాఁడు వచ్చి వీధిలో వెఱ్ఱికేకలు వేయుచున్నాఁడు. వానిఁబట్టి కట్టించుట యుక్తము. వానిఁ గొత్వాలునొద్దకుం బంపవలెను.

నవాబు——మీరుపోయి కార్యదర్శి నిటకుఁ బంపుడు.

దస్తగిరి సాహేబు సెలవుదీసికొనిపోయి తన కెదురుగా వచ్చుచున్న కార్యదర్శికి నవాబు పిలుచుచున్నటులఁజెప్పి యతనిని నవాబునొద్దకు బంపి తానింటికిఁబోయెను. కార్యదర్శినవాబు దగ్గఱకు వచ్చినతోడనే నవాబుతన వాకిటఁగూయుచున్న వాఁడు ప్రహారసింగనియు, కొన్నిసంగతులను దనకుఁ దెలుపుటకై కడచినరాత్రి తనతోఁ జెప్పినప్రకారము వచ్చినట్లును దెలిపి యతనిని లోపలికిఁ బిలుచుకొని రమ్మని యుత్తరువుచేసెను. అంతట నాకార్యదర్శి వెలుపలికిఁబోయి యాగోసాయీవానిని శోధనచేసి నిరాయుధుఁడుగా నుండుటఁ దెలిసికొని నవాబునొద్దకు వానినిఁ బిలుచుకొని పోయెను. క్రొత్త హిందువును రాజగృహములోనికిఁ బిలుచుకొనిపోవుట యచటిజనుల కాశ్చర్యభయములఁ గలుగఁజేసెను గాని, కార్యదర్శి నవాబునకు విశ్వాసపాత్రుఁడు గనుక ఎవరును మాటలాడక యూరకుండిరి. వారు మిద్దెపైకిఁ బోయినతోడనే కార్యదర్శి ప్రహార్సింగును ద్వారము వద్ద నిలిపి, తాను ముందుగా నవాబువద్దకేగి వానిని లోపలికిఁ బిలుచుకొనివచ్చుటకు మరల ననుజ్ఞఁగైకొని ప్రహారసింగును నవాబునొద్ద నిలిపెను.

ప్ర——నవాబుగారికి నొక విన్నపము. తమయందు నాకుఁగల పూర్ణమైన నమ్మకమువలననే నే నొంటరిగా మీ

సన్నిధానమునకు వచ్చితిని. మీయొక్క కార్యము ననుకూల పఱచుటకొఱకే నేనిచటికి వచ్చితిని.

నవాబు—భయపడక వచ్చినపనిని శీఘ్రముగాఁ దెల్పుము. మనసంగతులన్నియుఁ గార్యదర్శికిఁ దెలియును. కాబట్టి యన్నిసంగతులును దాపక చెప్పుము.

ప్ర—సరే! జాగ్రతగా వినుఁడు. మీరు మీప్రాణములను గాపాడుకొనుటకుఁ గొన్ని పనులను శీఘ్రముగను జాగరూకతతోను జేయవలయును.

నవాబు—అట్లగునా! చెప్పుము.

ప్ర—అపును మీమంత్రి నేఁడు రెండుజాములకిచటికి వచ్చిచేరును; నిన్న ఆల్మిలాయను గ్రామమున నుండెను. అతఁడింతశీఘ్రముగా వచ్చుటకుఁ గారణమేమియో తెలియునా?

నవాబు—నేనతనిని రమ్మనివ్రాసియుంటిని. అందువలననే యతఁ డింతశీఘ్రముగా వచ్చుచున్నాఁడు.

ప్ర—ఓహో! మీయాజ్ఞప్రకారమే యతఁడు వచ్చుచున్నాఁడనుకొంటిరి. మీరు పిచ్చివారు; నిష్కాపట్యులు. అతఁడు మాజనులలో వేగురను సహాయము తీసికొని జాగరూకతతోడనే వచ్చుచున్నాఁడు.

నవాబు—దురుద్దేశముతోడనే వచ్చుచున్నాఁడా? వివరముగాఁ జెప్పుము.

ప్ర—ఓరాజా, ఆయుత్తరమును నీవు వ్రాయకున్నను, అతనిని నష్టరాదు. ఆయుత్తరమును జూచినంతట నతనికి మఱింత జాగరూకత కలిగెను. నాకు ధనమే ప్రధానమనియు, ధనమొసంగెడివారికి నేనెట్టిపనినైనఁ జేయుదుననియు నతనియభిప్రా

యము. అందువలన నతఁడు నిన్న నలదుర్గమునుండి యొక మనుష్యుని నావద్దకుఁబంపెను. నేనిక్కడికి బయలుదేఱివచ్చినం దున నాకు బదులుగా నాకుమారుఁడతనివద్దకేఁగెను. మిమ్ము నేఁడె చంపవలయుననియు నందుకు మేము మనుష్యులను సహాయము చేయవలసినదనియుఁ జెప్పి అందులకై లక్షరూపా యీలు నాకుమారునిచేతికి మీమంత్రి యిచ్చెను. నాకుమా రుఁడు ధనముఁ దీసికొనెనుగాని మనుష్యులను జేర్చుకొనుటకై యొకదినము సావకాశము కావలసియున్నదని చెప్పి, మఱల వచ్చి గుఱ్ఱపుస్వారిమీఁద నా రాత్రి యీపట్టణపు సమీపమున నాబసదగ్గఱకు వచ్చెను. నాతమ్ముఁడగు మాన్సింగ్ రాత్రి యాదేవాలయములో దొంగలచేఁ జంపఁబడినందున రాత్రి ప్రొద్దుపోయినను నేను నా బసకుఁబోయి చేరితిని.

నవాబు—చచ్చిపోయెనా? అయ్యో! పాపము!

ప్రహారసింగ్—అవును. నేను దప్పించుకొని పరుగెత్తి పోయి కొంతసేపు గడచి మఱల దేవాలయముదగ్గఱకుఁబోయి వాని వెదకితిని. వాఁడు కత్తిపోటుతగిలి చచ్చిపడియుండెను. అందువలన నేను నాబసకుఁ బోవువేళకు రాత్రి మూఁడుజాముల ప్రొద్దాయెను. నాకుమారుఁడు నాతో నీసంగతులన్నియుఁ దెలి పెను. నేను నిన్నుఁగాపాడు తలంపుతో నీసమాచారమం తయు నీతోఁ జెప్పుటకు వచ్చితిని. మంత్రికి నతినినేనను నల దుర్గములో వదలిరమ్మని నాకుమారుఁడు యోజన చెప్పినందున నతఁడు నేనను దీసికొనిరాక వాఁడుచెప్పినటులఁ జేసెను. మీ రాజ్ఞచేసిన మంత్రినిఁ జంపించెదను. నన్నిప్పుడును గాపాడెద

నని ప్రమాణము మీరుచేసి వాగ్దానమిచ్చిన చాలును. బహు మతి వేఱు నాకక్కఱలేదు.

అప్పుడు నవాబు ప్రహారసింగ్ తలపైనఁ జెయిపెట్టి "అల్లాసాక్షిగా నీకేచెడుపును నేనెన్నటికినిఁ జేయను. నీతప్పుల క్షమించితిని. ఎటులనైన మామంత్రినిజంపి నాయాపదను దొలగింపుము."

ప్ర—నీవీ కోటనువదలి నేఁడంతయుబయటికిఁబోకుము. కోటలోని నీరక్షకభటులును ద్వారపాలకులును మీ విషయమున సత్యముతప్పక నమ్మకముగా నుండువారు; తక్కిన నేనను నమ్మఁగూడదు.నీయుద్యోగస్థులలోసత్యవాదియువిశ్వాసపాత్రుఁడునునైనవాఁడు అప్జల్ఖానొక్కఁడే. అతనికుమారుఁడును నమ్మఁదగినవాఁడే వీరిరువురును మీకొఱకెంత శ్రమయైనఁబడుదురు. వారు నాకుఁ గానివారైనను నీకు సత్యముగాఁ బాటుపడువారు. ఈ విషయములను గమనించి ప్రవర్తించుము. నావలననైనంత సాహాయ్యము నేను జేయుచుండెదను. నేను శీఘ్రముగాఁ బోవలెను. కార్యదర్శిని నాతోడ వీధివఱకంపుము. నీపనులను నెఱవేర్చి నేను మఱలివచ్చెదను.

ప్రహారసింగిటులఁ జెప్పి సెలవుఁ దీసికొని వెడలిపోయెను. కార్యదర్శి వీధివఱకుఁ బోయి, యతనినంపి మఱలెను. నవాబు దిగులుతీరి నెమ్మదిగానుండెను.



# ఏడవ ప్రకరణము.

మంత్రి కుట్రతోఁ జేరిన విషయములు రసూల్ఖానునకు ముందునాఁటి రాత్రియే యెఱుక పఱుపఁబడెనను సంగతి, కొత్వాలునకు నాఁటియుదయము జరగిన విచారణతోఁ దెలిసెను. రసూలా యుత్తరములను గొత్వాలునకుఁ జూపఁగూడదనియు, రాజునకు మాత్రము చూపఁబడుననియు, నొక్క వక్కాణించుటచేత మంత్రి కుట్ర యతనికిఁ దెలిసియున్నదనియు, ఆ విషయములను రాజునకుఁ దెలుపుటకై యతఁడు నిశ్చయించి యున్నట్లును కొత్వాలూహించెను. అందువలనఁ దాను ముందుగా మంత్రితో మాట్లాడి పిమ్మట రాజసభకుఁ బోయి రసూల్ఖానును, అఫ్జుల్ఖానును దాను తనవద్దనిలిపియున్న సంగతి రాజునకుఁ దెలుపవలెననియు, కొత్వాలు నిశ్చయించెను. పట్టణములోపల నప్పుడప్పుడు జరుగు సంగతులను కొత్వాలుకుఁ దెలుపుటకు వేఁగులవా రనేకులుండిరి. నాఁడుదయమునుండియును కొత్వాలు రసూలును విచారణచేయుచుండుటచేత, వేగులవారితో మాటలాడుటకుఁ గొత్వాలునకు సందర్భము లేక యుండెను. మంత్రి కుట్రలతో జేరినవిషయములను అఫ్జుల్ఖానునెదుటఁ దాము మాట్లాడుట యుక్తము గాక యుండెను. దాన నిపుడు కొత్వాలు రసూలును, అఫ్జుల్ఖానును గదిలోవదలి, వారిని బయిట రానీయకుండునటుల నాగది వాకిట మనుష్యులను పారాయించి తాను దనయింటి పెరటిప్రక్కనున్న గదికిఁబోయి, వేగువారల నచటికి రప్పించెను.

వారిలోనొక బ్రాహ్మణుఁడుముందుగా నచటికివచ్చెను.

కొత్వా—శాస్త్రులుగారూ, ఏమి సంగతి?

బ్రా—(ఒక యుత్తరమును జేబులోనుంచి యెత్తి) అయ్యా, ఈయుత్తరము కామేశ్వరశర్మచేత వ్రాయఁబడినది. ఇందులో నతఁడు తన చెల్లెలిని తుల్జాపురిలో నొక బ్రాహ్మణుని కిచ్చి వివాహము చేసెననియుఁ, బ్రహారసింగును తనవద్దకు రప్పించుటకుఁగాని, యేదైన నేర్పాటునకతనిని సమ్మతింపఁజేయుటకుఁ గాని, యతనికి సాధ్యపడనట్లును, ఇట్లాగ్రామమునకుఁ బోవుట కతనికి భయముగా నుండునట్లును, దెలిపియున్నాఁడు మంత్రి గారే ప్రహారసింగును స్వాధీనపఱచుకొనవలెననియుఁ గనఁ బఱచియున్నాఁడు. (అనియుత్తరములఁ గొత్వాలునకిచ్చెను.)

కొత్వాలు—మంచిది. ఆయనకీ సంగతిఁ దెలిపెదను. కామేశ్వరశర్మ నలదుర్గమునకుఁబోయి మంత్రిగారితో మాటలాడలేదా? అది సమీపమేగదా?

బ్రా—రక్షకపత్రము పంపకయే యాతఁడు పోఁడఁట.

కొత్వా—అంత సందేహ పడనేల ?

బ్రా—అతఁడు మిమ్ము నమ్మలేదు. తణ్ణాజీ శివాజీల వలె నతఁడు జహాజాగ్రత్తతో నున్నాఁడు.

కొత్వా—తణ్ణాజీ రాత్రి పట్టణములోనుండెనఁట ఆసంగతి నీకేమైనఁ దెలియునా?

బ్రా—అదిసంపూర్ణముగనబద్ధము ఎందరో తణ్ణాజీలు మాటిమాటికిఁ గనబడుచున్నారు. అతఁడు తణ్ణాజీయని నమ్మరాదు. నేను సెలవుదీసికొనెదను. మంత్రిగారు వచ్చినతరువాత మీ యొద్దకువచ్చి మాటలాడదెను.

ఇటులఁ జెప్పి యా బ్రాహ్మణుఁడు వెడలిపోయెను. ఆ బ్రాహ్మణుఁడు మహారాష్ట్ర పక్షపాతియైనను మంత్రి మొద

లగువారికి నిష్టుఁడువలె నటించుచుండెను. మంత్రి మొదలగు వారి కితఁడు మహారాష్ట్రులపక్షమును దెలుపకుండెను. తురుష్కులకనుకూలుఁడుగా నటించుచు, మహారాష్ట్రులకార్యములఁ జక్కఁబఱచుటకై వారలచే నియమింపఁబడి, తన బుద్ధిసామర్థ్యముచేత నితఁడు తురుష్కులవద్ద నమ్మకమును సంపాదించుకొనెను.

ఈ బ్రాహ్మణుఁడు పోయినతరువాత నవాబునగరి ద్వారపాలకుఁడొకఁడు కొత్వాలునింటికివచ్చి రాత్రి కార్యదర్శిగారూరి వెలుపల భవానీదేవాలయమునకెవరినోయొకనినిగూడఁబిలుచుకొనిపోయెననియును, రాత్రిప్రొద్దు పోయినతరువాత మరల నతడు నగరునకు వచ్చెననియు, నుదయమున నీలకంఠరావును దస్తగిరిసాహెబును నవాబుదగ్గఱకు వచ్చి మాట్లాడిపోయిరనియు, గోసాయీ వాఁడొకఁడా వెనుకనగరులోనికి వచ్చెననియుఁ జెప్పెను. కొత్వా లంతట లేచి మరలఁ దన సభాస్థలంబునకు వచ్చి, నయోపాయముచేత రసూలువద్దనుండు నుత్తరముల సంగతిని దెలిసికొనుటకై రసూలుండు గదిలోనికిఁ బోయెను.

కొ—అఫ్‌జుల్ఖానుసాహెబుగారూ! నేనింతకాలముమిమ్ము వదలియుండినందుకు క్షమింపవలెను. కొంత ముఖ్యమైన పనియుండి పోయి యుంటిని. మీకు భోజనము పెట్టిరా?

అఫ్‌జు—పెట్టిరి.

కొ—నేను నేఁడుదయమునఁ గఠినముగా మాటలాడినందుకు మీ రాయాసపడకుఁడు. న్యాయస్థానంబున నిష్పక్షపాతముగా నుండవలెనుగదా! రాత్రి జరిగినవిషయములో రసూలుపై నేరమగుపడలేదు. చంపఁబడినవాఁడుకూడ నన్య

మతస్థుఁడైన హిందువే కాఁబట్టి, యదొక గొప్ప నేరముగాదు. లాల్సింగును దప్పించి కాపాడినది మాత్రము శ్లాఘ్యమైన కార్యము.

ర—నేను వానినిఁ దప్పించుటయేమి ! వాఁ డిప్పుడు హాయిగా నున్నాఁడా?

కొ—సౌఖ్యముగా! నున్నాఁడు, మీ కాగితములను జూపుదురేని నేను మిగుల సంతసమందుదును.

ర—ఆది నవాబుగారితో సంబంధించిన రహస్యమునియు, బయలు పఱుపరాదనియు నే నింతకుముందే తెలిపియుండ లేదా! నవాబుగారితోఁ జేరిన రహస్య విషయములను వెలిపుచ్చుమని చెప్పుట మీకు న్యాయముకాదు.

కొత్వా—సరి, లాల్సింగును విచారింపవలసి యున్నది. వానిని రక్షకభటులవద్ద నొప్పగించినవాఁడవు నీవు గనుక, వాని నిచటికిఁ బిలిపించినీయెదుటనే విచారించుటయుక్తము కాఁబట్టి, వాని నిచటకు రప్పించెదను (అనితలుపుదగ్గఱఁ గావలియున్న వానినంపి లాల్సింగ్ను రప్పించెను.)

కొ—లాల్సింగ్ ఇటులగూర్చుండుము. నీకు భోజనము పెట్టిరా! బాధలేక సౌఖ్యముగ నున్నావా?

లా—తమ దయవలన సౌఖ్యముగానున్నాను. భోజన మాయెను.

కొ—రాత్రి వీరు నిన్నుఁ దప్పించుటకు మునుపు జరిగిన సంగతులను విశదముగాఁ దెలుపుము.

లా—ఇద్దఱు గోసాయీలు వచ్చి నన్ను దొంగలనుండి తప్పించి కాపాడిరి. వా రెవరైనదియు నాకుఁ దెలియదు.

రసూలు—నాముఖమును గమనించిచూచి యాగోసా యీలలో నేనొకఁడనుగా నుండినఁ దెల్పుము.

లా—(నిదానించిచూచి) నీవే, నాప్రాణమును గాపాడిన పుణ్యాత్ముఁడవు.

వారిటుల మాటలాడుచుండఁగా నొకసేవకుఁ డాగది వాకిటికివచ్చి, నిలిచి, కొత్వాలునుజూచి, మంత్రికుమారుఁడు బయటవచ్చి కాచుకొని యున్నటులఁ జెప్పెను. కొత్వాలు సేవకునివంకకుఁ దిరిగి కొంచెము ముందునవచ్చి, తాను పనిమీఁద నుండుటవలన నతనిఁ జూచుటకుఁ గొంచెము సేపగుననియు, ఆలస్యము చేయుటకుక్షమింపుమనిమంత్రికుమారునికిఁ జెప్పుమనియు నతనికిఁ గావలసిన వస్తువుల నతని కియ్యవలసినదనియుఁ జెప్పి యాసేవకునిఁ బంపి మరలఁ దనచోటికి వచ్చెను. ఈ సమయములో లాల్సింగునకును రసూలుకును సైగల మూలముగాఁ గొన్ని కుట్రలు జరిగెను. కామేశ్వరశర్మ వ్రాసినదని వేఁగువాఁడు కొత్వాలున కిచ్చిన యుత్తరము కొత్వాలు జేబులో నుండి క్రిందికిఁబడెను. కొత్వాలు తాను సేవకునితో మాటలాడుచుండుటచేత దానిని గమనింపలేదు. రసూలాయుత్తరమునెత్తి సంగతులు దెలిసికొని మరలదానినచట నేయుంచెను

కొ—లాల్సింగ్! తరువాతి సంగతులఁ దెలుపుము.

లా—అయ్యా, స్వల్పధనమును జేర్చిపెట్టియుంలాపుడి ద్రవ్యముచు, జారిసెలవులకుఁ దీసికొని, బయలుదేఱి పోయా, రికి వచ్చిచేరితిని. అచటినుండి బయలుదేఱి వచ్చుచుండఁగా ఆల్,—ఆమ్,—ఆయూరిపేరు నాకు జ్ఞాపకములేదు. భీమానదియొద్దనున్నది.

కో__అట్లేలా ?

లా__ఆయూరి చెంతకు వచ్చునపుడు ఇద్దఱు గోసా యీలు నాకుఁ గనఁబడిరి; వారితోడనే వచ్చుచుంటిని. వారు నన్నుఁ బిలుచుకొనివచ్చి యాదేవాలయమును జాముప్రొద్దు నకు వచ్చిచేరిరి. ప్రొద్దుపోయినందున నచిత్కప్ప వేఱేచోటును దొరకదని వారు చెప్పినందున నేను వారితోడనే శయనించి తిని, కొంతప్రొద్దెక్కినతరువాత వారు సాధనమును గుడ్డలను దోచుకొని పరుగెత్తిపోయిరి. పిమ్మటఁ గొంతసేపునకు వీరు వచ్చి నన్నుఁ గావలివాండ్రయొద్ద విడిచిరి.

కో__అబద్ధపుమాట లాడకుము. కార్యదర్శిగా రా దేవాలయములో నీతో నేమిమాట్లాడిరి? మేము నీకు శత్రు వులము గాము. నిజము చెప్పుము.

లా__కార్యదర్శియా, ఆయనయెవరు? వారితో నా కేమిపని. (రసూలువంకఁ దిరిగి) మీ రెవరైన నాయొద్దకే తెంచి నపు డాతనిఁ జూచితిరా?

ర__లేదు. నీ వాబూడిదనడుమఁ బడియుంటివి.

కో__(నేలనుగ్రుద్ది, చుఱచుఱ లాల్సింగునుజూచి)నీవు కావలివాండ్రతోఁ జెప్పినదేమి? ప్రహారసింగ్ సమాచార మేమి? నిజము చెప్పుము?

లా__ప్రహారసింగా?(నిదానించి)దారిలో వచ్చునపుడు ప్రహారసింగనుదొంగ యొకఁ డుండునటులఁ వింటిని. అంత కంటె వానిసంగతి నాకేమియుఁ దెలియదు.

కో__లాలా, నీవబద్ధమాడెదవు నిన్నుఁ గొఱతవేసె దను; భద్రము.

అ—కొత్వాల్, వాని నట్లడుగుట నీకుఁ దగదు. అతఁడు నేరస్థుఁడుగాఁడు. వానిని విచారణచేయుట నీపని. ఇటువంటి క్రూరమైనపనుల మాయెదుటఁ జేయఁగూడదు. మా కిచట సాహాయ్యములేకయుండినను దుర్మార్గపుఁబనులకు మే మడ్డుపడుదుము.

అఫ్జుల్ఖా నీమాటచెప్పినందులకు కొత్వాలు మిగులఁ గోపించి తనమనుష్యులఁ బిలిపించుట కాలోచించెను. కాని యంతలో మంత్రికుమారుఁడు సపరివారుఁడై బయిటనుండుటయు, రసూలునకతఁడు ప్రాణస్నేహితుఁ డగుటయును, గొత్వాలు మనస్సునకుఁ దగిలెను. అందుచేత నతఁడు తనకోపముఁజూపుటచేఁ బ్రయోజనమేమియు నుండదని నిశ్చయించుకొని 'ఖాన్‌సాహేబు' అని యఫ్జుల్ఖానుతోఁ దిన్నఁగా మాట్లాడుటకుఁ బ్రారంభించెను. అప్పుడు రసూల్ఖాను లేచి తనశాలువును తటాలునఁ గొత్వాలు ముఖముపై నవైచి, యతనిని వెనుకకుఁ బడఁద్రోఁచి, కాళ్ళతో శాలువును ద్రొక్కి ముఖమును గదలనీయక పట్టుకొనెను. అఫ్జుల్ఖాను దనబాకును దీసికొని కొత్వాలు ఱొమ్ముమీఁద మోదెను.

రసూ—నాయనా, వాఁడు నోరుతెఱచిన, బాకును వానిఱొమ్మున లోతునకుఁ బోవునటులఁ బొడువుము. లాల్సింగ్ వానికాళ్ళను గట్టుము. వానియుంగరమును దీసి నాచేతికిమ్ము. వానిజేబులోని కాగితములను దీసి నాచేతికిమ్ము.

అ—కొత్వాల్, జాగ్రత. నీవు నోరుమూసికొని యుండిన నిన్నేమియుఁ జేయను; మాటలాడినాఁ జంపెదను; నీవంటి రాజద్రోహులు మాకు మిత్రులుగారు

లాల్సింగ్ కొత్వాలు కాళ్ళను జేతులను గట్టియుంగరములను, జాబులను దీసి రసూల్ఖాన్ చేతికిచ్చెను. రసూల్ఖానంతట వాకిటికివచ్చి మంత్రికుమారుని రమ్మని సైగఁజేసెను. కొత్వాలుత్తరవుమీఁదనే రసూలు మంత్రికుమారుని బిలిచెనని తలఁచి సేవకు లూరకుండిరి. మంత్రికుమారుఁడు దగ్గఱకు వచ్చినతోడనే, రసూ లతనితో రహస్యముగా, కొత్వాలు మనుష్యుల నిరాయుధులఁ జేయింపుమని చెప్పెను. మంత్రికుమారుఁడు తనశాలువును దీసికొని మఱల వచ్చెదనని బిగ్గఱగాఁజెప్పుచు వెలుపటికివచ్చి తనపరివారములో నేఁబదిమనుష్యులను గొని, కొత్వాలుమనుష్యుల నిరాయుధపాణులఁగా నొనర్చి యొకగదిలోఁ ద్రోయించి, “నాయుద్ధభటులు ఐదువేల జనులు బయటనున్నారు భయపడకుము” అని రసూలుతోఁ జెప్పెను రసూలును, అఫ్జుల్ఖానును నామాటకు మిగుల సంతసించిరి.



## ఎనిమిదవ ప్రకరణము.

నవాబు ఆలీ ఆడిల్షాగా రుదయమున జాముప్రొద్దెక్కిన తరువాత వాడుకప్రకారము మజ్జనభోజనాదులం దీర్చికొని రాచఠీవితో సభామండపంబున కేతెంచి సింహాసనారూఢుఁడై యుండెను. నవాబు గురువులగు దస్తగిరిసాహేబును, కార్యదర్శియును సింహాసనముచెంత బల్లలపైఁ గూర్చుండి యుండిరి. ఉద్యోగస్థులెల్లరును, పురజను లనేకులును, దమతమ మర్యాదలకుఁ దగిన యుడుపులను, భూషణములను, ధరించి యుచిత

ప్రదేశములయందుఁ గూర్చుండిరి. ఆయుధపాణులగు యుద్ధభటులు సభామండపమున నొక్కప్రక్క బారులుతీరి నిలిచి యుండిరి. ద్వారపాలకులు ఖడ్గపాణులై మోసలఁ గాచియుండిరి. మంత్రిస్థానమును, అఫ్జుల్లాను స్థానము ననాక్రమితముగానే యుండెను. అఫ్జుల్లాను రాని కారణమేమనినవాబు దస్తగిరి సాహేబును గార్యదర్శిని నడిగెను. వారు తమకుఁ దెలియదని చెప్పిరి. అంతట నవాబొకసేవకు నఫ్జుల్లాను కొఱకుఁబంపెను. ఆసేవకుఁడు శీఘ్రముగామఱలివచ్చి, యఫ్జుల్లానును, రసూల్ఖానును ఉదయమునఁ గొత్వాలు నింటికిఁబోయి, యచటనే నిలిచి యుండునట్లు దస్తగిరి సాహేబుతో రహస్యముగాఁ దెల్పెను.

దస్తగిరి నవాబుతో “అయ్యా, అఫ్జుల్లానును రసూల్ఖానును కొత్వాలింటికిఁ బోయియున్నారు. మంత్రికుమారుఁడేనూరుయుద్ధభటులతో నచటికేపోయినటులవింటిని. కొత్వాలును సభకురాలేదు. అఫ్జుల్లానును మంత్రిపుత్రులతోఁజేరి యున్నందున నతఁడు మంత్రికుమారునితోఁ బోయి కొత్వాలింటిని దమయుద్ధభటులతో ముట్టడించియున్నట్టు నాకుఁదోఁచుచున్నది. వారు మంత్రివచ్చువఱకు నచటనుందురు. ముందుగా యుద్ధభటుల నచటికిఁబంపి కొత్వాలును విడిపించి, యఫ్జుల్లానును రసూలును, మంత్రికుమారునిఁ బట్టి చెఱసాలలో నుంచవలెను.

నవాబు—కార్యదర్శీ! అటులఁగూడ జరగియుండునా? అఫ్జుల్లా నంతటిద్రోహముసకుఁ బాల్పడఁడని వింటిని (సేవకుఁడొకఁడు తనవద్ద కేతెంచుటఁ గని) ఏమిసంగతి ? ఇంత యవసరముగా నీవిప్పు డిచ్చటికివచ్చిన కార్యమేమి?

సేవకుఁడు—అఫ్జుల్ఖానును గాపాడవలసినది. అతఁడాఫ దలో నున్నాఁడు.

నవాబు—అతఁడు మాకుఁ బ్రతిపక్షమునఁ జేరియున్న టులఁ దెలియవచ్చుచున్నది. అతనిని మేము గాపాడుటేమి?

సే—అయ్యా, అఫ్జుల్ఖాను భార్యయు, గూఁతురును, రాణి గారియొద్దకు వచ్చియున్నారు. ఈయుత్తరమును జూడుఁడు.

నవాబు—(ఆయుత్తరమును జూచి) ఆహా! నిమిషమాత్రములో నెంతదురభిప్రాయపడితిని! అఫ్జుల్ఖానును, రసూల్ఖానును, గొత్వాలు చెఱసాలలో నుంచియున్నటులఁ దెలియుచున్నది ఆసంగతి నఫ్జుల్ఖాను భార్యయెఱిఁగి, నాభార్యచెంతకు వచ్చి మొఱపెట్టుకొనినందున నతనిని గాపాడవలయునని నాభార్యయే వ్రాసియున్నది ఇంతకంటె నమ్మకమైన సమాచారమేదియుఁ గానము, (ఒకసేవకునిఁ జూచి) ఇస్మేల్ఖాఁ, ముందుగా నిన్నూఱుయుద్ధభటులతో కొత్వాలునింటికిఁబోయి, రసూలును అఫ్జుల్ఖానును విడిపించికొని రావలయును కొత్వాలును బట్టి కట్టించి తెమ్ము. అతఁడు మంత్రికుట్రలోఁ జేరినవాఁడనుసంగతి స్పష్టముగాఁ దెలిసినది; తక్షణమే పోవలెను.

నవాబుగారి యుత్తరువుప్రకారము యుద్ధభటులు కొత్వాలు నింటికిఁబోయిరి. కార్యదర్శి సభ్యులనందఱను మాటలాడక యుండవలయునని యాజ్ఞాపించి, ప్రస్తుతకార్యములను గుఱించి సభ్యుల కిటులఁ దెలిపెను.

కా—(లేచి) "గౌరవనీయులగుసభ్యులారా! నేఁటిదిన మీసభను జేర్చుట వేడుకకొఱకుఁగాదు; మిక్కిలియాపత్కరములైన సందర్భములు మన నవాబుగారికిని నతని రాజ్యాంగమున

కును నిపుడు తటస్థించినందున వానిఁ దొలఁగించి, దేశమున
కును, నవాబుగారికిని నెమ్మదిఁ గలుగఁ జేయుటకుఁ దగు
ప్రయత్నములు మనము చేయవలసియున్నది ఇప్పుడు వచ్చి
యుండునట్టి యాపదను తొలఁగించుటకు నవాబుగారికి మీ
యందఱి సాహాయ్యమును గావలసియున్నది. మీ సాహాయ్య
మను నావలేక యీ యాపత్సముద్రమును దాఁటుట నవాబు
గారికి సాధ్యముగాదని నాకుఁ దోఁచుచున్నది. ఈనవాబుగారి
తాతల ముత్తాతల నాఁటినుండి, యీసంస్థానమునకు నమ్మక
ముగాఁ బాటుపడుచు నాధారముగా నుండునట్టి మీతో
బహిరంగముగా యోచనచేసి జరగవలసినపనుల జరపించు
టకై యీసభ ఇప్పుడు కూర్పఁబడినది. ఈ సంస్థానములో,
గొన్నికుట్రలు జరగుచుండి యిప్పుడు బయటఁబడినవి. ఆకుట్ర
లలో, నవాబుగారి పాలనకు లోఁబడి, వారిసొమ్మును భుజించి
వారివద్ద నమ్మకమునుఁ బొందినట్టివారు చేపుటయు, దేశము
యొక్క నెమ్మదికి భంగము గలుగఁజేయునట్టి కుట్రలను
రహస్యముగా మాప్రజ లొనర్పుటయుఁ గడునీచముగదా?
అందులో నాసేవకులుగానుండి, నానమ్మకమునుబొంది, గొప్ప
పదవిని గని, నాసొమ్ము తినుచుండువారును చేరి నాకు ద్రోహ
ము చేయుటకును, దేశముయొక్క నెమ్మదికి భంగము గలుగఁ
జేయుటకును బ్రయత్నించుట యెంతటి నీచమును శోచనీయ
మును నగు కార్యమో మీరే యోజింపుఁడు. మావద్ద
నమ్మకమును బొందినవారిలో ముఖ్యుఁడగు మనమంత్రిగా
రొడిగట్టిన ఘాతుకకృత్యములు మీకీ కాగితమువలనఁ దెలి
యవచ్చును (అని కొన్నియుత్తరములనెత్తి చూపి) ఇదిగో

వారిచేవ్రాలు; ఇదిగో వారిముద్ర చూడుడు. ఈయుత్తరములు ఢిల్లీ పాదుషాయగు ఔరంగజేబుచే వ్రాయఁబడినవి. ఇందులో ఔరంగజీబుకు బీజపూరుసంస్థానమును బట్టుకొనుటలో మంత్రిగారు సాహాయ్యము చేయునట్లును, అందు కాతఁడు మంత్రిగారికి లాభములో సగము ఇచ్చుపాటులును గనబఱుపఁబడియున్నది. చూచితిరా? యెంతటి ద్రోహమున కతఁ డొడిఁగట్టెను. (అనేకజను లాహాకారవముతో లేచుటఁ గని) నిదానింపుఁడు. వాని నిచటికిఁ, బిలిపించి విచారించెదము. మనవద్ద శిక్షలేక తప్పించుకొనినను దేవుడు చేయు శిక్ష తప్పదుగదా? సర్వాంతర్యామియగు నీశ్వరున కంతయుఁ దెలియునుగదా ? ఈచిన్నయుత్తరము శివాజీ యౌరంగజీబునకు వ్రాసినది. వాని తండ్రిని మాతండ్రి పలుమాఱు మన్నించి కాపాడినసంగతి యెల్లఱకుఁ దెలిసినదే. వీనికి నే నే చెడుగును జేయలేదు ఢిల్లీ పాదుషా మొదటినుండియువీనిని దలుముచునే యుండెను. నేను వీనికి విరోధినైతిని. పాదుషా వీనికాప్తుఁడాయెను. దక్షిణహిందూస్థానమున వీరిరువురును పంచుకొందురఁట. ఔరంగజీబునకు సహాయముగా వీఁడిచటిసంస్థానముల నాక్రమించునఁట. (నిదానించి) మీకెల్లఱకు నన్యమతస్థుఁడగు శివాజీపాలనమునం దభిలాష మీకున్నయెడలఁ దెలుపుఁడు. నే నిపుడే సన్న్యసించి మక్కాకుఁబోయి నాజీవితమును గడపెదను. మీకందఱకు నేనుబాలించవలెనను కోరికయుండి, నమ్మకముగాఁ బాటుపడెదు పక్షమున, నెప్పటియాటుల నిలిచెదను.

జనులు—(దీన్, దీన్, దీన్,) అని యాయుధములతో లేచిరి. ఈసమయములో నశ్వారూఢులైన యుద్ధభటులగుంపు

సభామండపమునందుఁ గనఁబడెను. ఆగుంపునడుమ నలుప్రక్కల మూయఁబడిన పల్లకీయొకటి యగపడెను. ఆపల్లకీకి నిరువంకల అఫ్జుల్లాఖాను రసూల్ఖానులు వచ్చుచుండిరి. నవాబుగారాశబ్దమునువిని, యావంకఁజూచిరి. అంతలో అఫ్జుల్లాఖానాపల్లకినిమండపముయొక్క ద్వారమున దింపి, భటులను దానికిరుప్రక్కల నుంచి, నవాబుగారి సింహాసనము చెంతకువచ్చి, వారికి సలాము లొనర్చి, తనకత్తిని నతనిముందటఁబెట్టెను. రసూల్ఖానును దండ్రి వలెనే వంచనమొనర్చి కత్తిని నవాబుముంగలఁబెట్టెను.

అ—అయ్యా, అల్లాదయవల్లమేమీ ద్రోహిచేతినుండి తప్పించుకొని, వీనిని మీవద్దకుఁ దెచ్చితిమి.

నవా—ఎవఁడతఁడు? మంత్రియా?

అ—కాదు కాదు. కొత్వాలు.

న—(తనచేతి నఫ్జుల్లాఖాను తలపైనుంచి) దైవాధీనము.

రసూల్—మీకును స్వామిదయవల్ల భయముతీఱెనదిగదా? నాకు మిక్కిలి సంతోషముగా నున్నది.

అ—అయ్యా, పల్లకిని తెఱువవచ్చునా?

న—తెఱువుము.

కొ—(తెఱచినపిమ్మట) అయ్యా, నాకట్లువిడిపింపుఁడు.

న—ఆకట్లను విడువుము.

అఫ్జుల్లా నంతటఁ గొత్వాలువద్దనున్న యుత్తరముల నొకటొకటిగాఁ దీసి నవాబుచేతి కిచ్చెను పిమ్మట సేవకులు కొత్వాలుకట్లనూడ్చిరి. నవా బాయుత్తరములను గుమాస్తాలచేఁ జదివించి, సభలోని పెద్దమనుష్యులచే ముద్రను చేవ్రా

లును శోధనచేయించెను. శోధనలో కొత్వాలు మంత్రికుట్రలోఁ జేరినట్లు స్పష్టముగఁ దెలిసెను.

న—కొత్వాల్ ! నీకు నూయన్న మంత చేదాయెనా! ఇవి నీయక్షరము లేగదా? బదులు చెప్పుము.

కొ—ఆయక్షరములు నావే విధికృతముఁ దప్పింప నెవరితరము; వచ్చునది రానిండు.

నవా—(సభనుజూచి) హితులారా! జరిగిన సంగతులు మీకు స్పష్టముగాఁ దెలియుచున్నవిగదా? మంత్రిని గూడ రానిండు. వారివాఙ్మూలమును విచారించి తీర్మానముచేయుదము.

---

## తొమ్మిదవ ప్రకరణము.

వారిట్లు మాటలాడుచుండఁగా నొక రాజభటుఁడు నవాబుదగ్గఱకు వచ్చి, నవాబుగారికి వందనముచేసి (సలాం) మంత్రి చంపఁబడినట్లును, పట్టణము వెలుపట నల్లకల్లోలముగా నుండునట్లును దెలిపి, నవాబుగారిని నగరులో నొక రహస్యస్థలమున శీఘ్రమున దాఁగుకొనుఁడని వేఁడెను. మంత్రి చనిపోయినందున తనకేమియు నపాయము లేదని చెప్పి నవాబుగారా సింహాసనముమీఁదనే కూరుచుండి యుండెను. ఇంతలో మఱియొక రాజకీయోద్యోగస్థుఁ డచటికేతెంచి, మంత్రితో వచ్చిన యుద్ధభటులే యతని పురబహిర్మార్గమునఁ జంపి, వెలుపటిబయలులోఁ బ్రవేశించి త్రిప్పుకొని పోయిరనియు, ఈ కార్యములన్నియు సంభవించుటకు మునుపు గోసాయి వాఁ

డొకఁడు 'దేవీపాతుమాం' అని కేకవేయుచు వారి కెదురు పడెననియు, మంత్రితోడ వచ్చినవారితో నతఁడేవో రహస్యపు మాట లాడెననియు, నందుమీఁద వారు మంత్రినిఁ జంపి రనియు, రాజకీయభటు లచట స్వల్పసంఖ్యగా నున్నందున వచ్చినవారిని వీ రేమియుఁ జేయలేక పోయిరనియుఁ దెలిపెను ఇంతలో గోసాయివాఁడొకఁడు "దేవీపాతుమాం" అని కూఁత లిడుచు సభామంటపములోనికిఁ దటాలునఁ బ్రవేశించి, నవాబు గారి చెంతకువచ్చి, మంత్రి గతించినసంగతిఁ జెప్పి, మంత్రి జేబులో దొరకినవని కొన్నియుత్తరములను నతని చేతికిచ్చి యవసరముగా మరలి, వెలుపటికిఁ బోయెను. అప్పుడు దస్తగిరి సాహేబు సభవారిఁజూచి,"అల్లాదయచేత నొకద్రోహి చచ్చెను. ఆలీయును మహామ్మదును సమస్తవిషయములును గమనించుచున్నారు. శివాజీనిఁ జంపుట యిఁక సులభము. సత్యమతస్థులకు జయముతప్పునా! దీన్, దీన్, దీన్, ఫత్తేహీమానూమీబ్బా (మహమ్మదు మతమును నమ్మనివారికెల్ల మరణము) వీరస్వర్గమును బొందుటకు సిద్ధపడుఁడు" అనెను. సభవారందఱు, 'దీన్, దీన్, దీన్' అని యఱచిరి.

నవాబు—(కొంచెము నిదానించి) ఈసభవారిలోపల శివాజీని శిక్షించునంత ధైర్యముగలవారెవరైననుండిన నీపట్టు తుండుగుడ్డ నెత్తికొనుఁడు (అని యొకతుండుగుడ్డను తనముందున్న బల్లపై నుంచెను)

అ—(లేచి యాగుడ్డనెత్తికొని) తమ సేనాబలమును, నాస్నేహితుల సాహాయ్యము లుండిన నేను నెఱవేర్చెదను.

దస్తగిరి—సేన కదలువఱకు నిత్యమును మన జమ్నా

మసీదులో నల్లాకు ప్రార్థన జరిపించవలెను. అల్లాదయవలన సమస్తము కూడివచ్చును.

నవా—ప్రొద్దయినది. సభలోని పెద్దమనుష్యులకుముందుగాఁ దాంబూలములం బెట్టుఁడు వాసనద్రవ్యముల వారిలో ముఖ్యులకు వాడుకచొప్పున నిండు. కొత్వాలును మాముందు నిలుపుఁడు. అతనివద్దనుండు కాకితములను జదువుఁడు. అతని విషయమున నక్రమము జరుగఁగూడదు

కొ—అవశ్యము లేదు. మంత్రి యిచటికి వచ్చియుండిన మీయందఱితల లీవఱకెగిరియుండును. ఇప్పుడు మీ కాలము బాగుగానున్నది. నేను దాఁచుటలోఁ బ్రయోజనమేమియుఁగాన రాదు. నేను మంత్రికుట్రలోఁ జేరియేయుంటిని. ఇప్పుడు మీరు మీయిష్టానుసారముగాఁ జేయవచ్చును. నేనిఁక మాటలాడను.

న—వీనితలను దీసివేయవలెను. దుష్టుల శిక్షచేయకుండుట రాజధర్మము కాదు.

నవా బిటు లుత్తరువు చేసినతోడనే రాజభటులు కొత్వాలును సభామంటపమునుండి వెలుపలికిఁ దీసికొనిపోయిరి. నవాబు తనకంఠముననున్న ముత్యాలసరమొకటి తీసి రసూలుచేతికిచ్చి, యాతఁడు నాఁడుదయమున గొత్వాలునుబట్టి తెచ్చినందు కది బహుమానమని చెప్పెను. నవాబుగారొక కత్తినెత్తి అఫ్జుల్ఖాను చేతఁబెట్టి, బీజపూరు సంస్థానమును గాపాడవలసిన భార మతనిపై నుంపఁబడినదని చెప్పెను.

ర—అయ్యా! నాకొకప్రార్థనయున్నది. దానిని మీ రంగీకరింపవలెను. నామిత్రుఁడైన మంత్రికొమారుని గాపాడ

వలెను. అతనివలన నే నేరమును లేదు అతని నడతకు నేను త్తర వాదిగ నుండెదను.

న—(తన వ్రేలియుంగరములలో నొకదానినిఁ దీసి) ఈ యుంగరమును వానికిచ్చి, దీనిని వానికి నే నభయదానసూచకముగా నిచ్చితినని చెప్పుము. ఆలీఅడీల్ఖావలన నతని కేభయమును గలుగదని స్పష్టముగాఁ దెల్పుము. నేఁటికిఁక సభ చాలింపవలెను? మీరందఱును సెలవుదీసికొనుఁడు.

నవాబిటులఁ జెప్పినతోడనే తాంబూలములు తట్టలోఁ బెట్టఁబడి సభవారి కియ్యఁబడినవి. సభవారందఱును నవాబునకు వందనమొనర్చితమతమయిండ్లకుఁబోయిరి. అఫ్‌జుల్ఖానులాల్సింగును బిలుచుకొని తనయింటికిఁబోయి వానినిగుమాస్తాగానుంచుకొనెను. నాఁటియపరాహ్ణమున నూరికిబయటనుండు చింత తోపులో జనులు గుంపుగూడిరి. ఒకగోసాయివాఁడచట నొక రత్నకంబళిని క్రిందఁబఱచుకొని కూరుచుండెను. అతని తల వెండ్రుకలు జడలుకట్టుకొని ముఖమునందును వీపునందును వ్యాపించియుండినవి. చినిఁగిన పేలికల నతఁడు కట్టుకొనియుఁ, బైనవేసికొనియు వికారస్వరూపముతో నగుపడెను అతఁడొక యినుపగుదియను జేతఁబట్టుకొని, యప్పుడప్పుడు "దేవీపాతుమాం" అని బిగ్గఱఁగా గూయుచు నుండెను. దారినిఁబోవు వారిచే వేయఁబడిన గొన్ని రాగినాణెములు రత్నకంబళిమీఁదఁ బడియుండినవి. అతనికి ముందటఁ గొంతదూరములో హిందువులును తురుష్కులును గలసిన గుంపుండెను. వారిలోనిద్దఱు పట్టాకత్తులను దీసి చేతఁబట్టుకొని యుండిరి. ఒకఁడు డాంబిక వేషముతో, నిలిచియున్న వారిలో గొందఱి నధికారము చేయు

చుండెను. కొంతసేపటికి రాజభటులు కొత్వాలు నొకబల్ల మీఁదఁబెట్టి యచటికిఁ దీసికొనివచ్చిరి. కొత్వాలునకు దైవప్రార్థన జేయుటకుఁ గొంత యవకాశమిచ్చినపిమ్మట, నొకయధికారి పట్టాకత్తులనుపట్టుకొని యున్నవారినిఁ జూచి, యిఁకఁ గొత్వాలును నఱకవచ్చునని చెప్పెను. వారిలో నొకఁడు కొత్వాలు శిరమును ఖండించెను. అచటనున్న గుంపులో నిద్దఱు కావలివాండ్రచటనే యుండిరి. తక్కినవారందఱును బట్టణమునకు మరలిపోయిరి.

---

## పదియవ ప్రకరణము.

తణ్ణాజీ నాఁడుదయమున బయలువెడలి బీజపూరునకు సమీపమునఁ బదిమైళ్లదూరముననున్న యొకపల్లెను జేరి, యా దినమున బీజపూరులో జరుగు సంగతులను దెలిసికొనుటకై శానాయూరిలోనే నాఁడంతయును నిలిచియుండి, వేఁగువారల నంపి బీజపూరులో జరగు సంగతులను నాఁటిరాత్రి దెలుసుకొనెను. మంత్రియును కొత్వాలును మహారాష్ట్రులతో గాఢముగ స్నేహము గలవారై యుండినందున తణ్ణాజీకి బీజపూరులో రహస్యముగా సంచరించుటకును, బీజపూరుసమీపమునందుండుటకును, ధైర్యముండెను. మంత్రియునుగొత్వాలును నాఁడే చనిపోయినందునను, నవాబువిషయమున సత్యముగా బాటుపడువాఁడును, మహారాష్ట్రులయందు ద్వేషముగలవాఁడునైన యఫ్జుల్ఖానుకు రాజ్యాంగ కార్యనిర్వాహకమునఁ బూర్ణాధికారము గలుగుటయును మహారాష్ట్రులకుఁ దప్పక ముప్పు

గలిగించునని యూహించి, కూడినంతశీఘ్రములో నాపల్లెనుండి వెడలవలయునని తన్నాజీ నిశ్చయించెను. నాఁటి యర్ధరాత్రికి వెన్నెలపోయిన తోడనే తన్నాజీ యొకయనుచరునితోఁగూడ బయలుదేఱి, వేగముగా స్వారిచేయుచుఁ బోవుచుండెను. వేకువజామున సూర్యోదయమునకు నాలుగుగడియల ప్రాధుం డఁగా వారొక తిప్పచెంతఁ జనుచుండి, తమవెనుక సుమారు రెండుమైళ్లదూరమున నొక వెలుఁగుగని, యాదిక్కున దృష్టిని గుడించిచూచిరి. అశ్వారోహకులైన భటులగుంపును, గత్తుల తళతళకాంతియు, వారికండ్లకగుపడెను. గుఱ్ఱముల త్రొక్కుడు శబ్దమును వారిచెవులకు వినవచ్చెను. తన్నుబట్టుటకై వచ్చిన నవాబుభటులగుంపుగా నది యుండవచ్చునను సందేహము తన్నాజీకిఁ గలిగెను. తిప్పనుఁ దూర్పుప్రక్కన మార్గమును, తిప్పకుఁ బడమటిప్రక్కన వరిపొలములు నుండుటచేత, తన్నాజీ తనయనుచరుని, మార్గమునకు సమీపమున, దూర్పుప్రక్కన నున్న యొక మఱ్ఱిచెట్టు తొఱ్ఱలోఁ గూర్చుండి వారిమాటలఁ దెలిసికొనుమని చెప్పి, తాను తిప్పనుఁ బడమటనున్న వరి పొలములో దాగెను. ఆ యనుచరుఁడు తొఱ్ఱలో డాగుకొని యుండగా నాగుంపు మఱ్ఱిచెట్టు సమీపమున నా త్రోవలో నిలిచెను. ఆగుంపులో నొకడు "తన్నాజీని బట్టుట సులభము కాదు. మంత్రిని గొత్వాలును చిక్కించినటుల వీనినిఁ జిక్కిం చుటకు సాధ్యపడదు. దీపముల నార్పిపోవుదుమేని యొకవేళఁ బట్టవచ్చును. కాఁబట్టి దివ్విటీల నార్పుడు" అని చెప్పుట యా యనుచరునికి వినఁబడెను. వా రంతట దివ్వెలనార్పి త్రోవనే పోవుచుండిరి. కొంతసేపు గడచినపిమ్మట నా యనుచరుడు

తన్నాజీదగ్గఱకుఁబోయి చేరి, తాను వినిన సంగతినిజెప్పి, యా గుంపు ప్రహార్నింగు దిగ నుండవచ్చుననెను. తన్నాజీ యంతట నచటనే కొంతసేపు నిలిచి తన యనుచరునితోఁ గూడ ముందువచ్చిన త్రోవనే తిరిగి, రెండుమైళ్లదూరము పోయి, యచటఁ బడమటిప్రక్కకుఁ దిరిగి పోవుమార్గమును బ్రవేశించి పోవుచుండెను.

నాఁటి మధ్యాహ్నమున తుల్జాపురిలోని భవానీదేవ్యాలయములో మహారాష్ట్రులందఱును సభగూడునటుల రెండు దినములకుముందు తన్నాజీకి సంగతి కామేశ్వరశర్మచేఁ బంపఁబడియుండుటవలనను, మంత్రియును గోత్వాలును జనిపోయిన సంగతి మహారాష్ట్ర ముఖ్యులకుఁ దెలుపవలసి యుండుటవలనను, తన్నాజీ మధ్యాహ్నమువఱకు దారిలో నెచటను నిలువక పోయి తుల్జాపురి సమీపములో సింధుపురి యను గ్రామమును జేరెను. తన్నాజీ యాగ్రామములో నొక బందుగు నింట మధ్యాహ్న భోజనముచేసి, యిరువదిసేవకులను సహాయముగాఁదీసికొని, వేఱొకగుఱ్ఱముపై నెక్కి శీఘ్రముగనే తుల్జాపురికిఁబోయిచేరి, సాయంతనము భవానీదేవ్యాలయముఁ బ్రవేశించెను. భవానీ దేవ్యాలయమున నపుడు జన సమ్మర్ద మెక్కువగనుండెను. అనేక మహారాష్ట్ర ముఖ్యులచట జేరియుండిరి. భవానీ విగ్రహమున కెదురుగా మాత్రము త్రోవవిడిచి, యా త్రోవ కిరుకెలంకులను విగ్రహముప్రక్క దృష్టిగలవారై యందఱును గూరుచుండి యుండిరి. తన్నాజీని జూచినంతటనే కామేశ్వరశర్మ యతనికెదురుగాఁ బోయి స్వాగత మొసంగి, తానున్న తావునకుఁ బిలిచికొనివచ్చి ప్రక్కనఁ గూర్చుండఁ

బెట్టెను. తణ్ణాజీ కామేశ్వరశర్మకు బీజపూరులో ముందుదిన ము జరిగిన సంగతులను రహస్యముగాఁ దెలిపెను. కామేశ్వ రయ్య శీఘ్రముగా సభ ముగియునటులఁ జేసి జరగవలసిన పనులను గుఱించి యోజించుచుండెను చెప్పి దేవాలయములోపలఁ జీకటిగా నుండు నొక మూలకేగెను. అప్పు డచట, స్తంభము చాఁటుననుండి బాలామణి కామేశ్వరశర్మవద్ద కేతెంచి, "ఇది మంచిసమయమే; ఆమె యొంటరిగ నమ్మవారి విగ్రహము ముందటఁ దలుపుప్రక్కన నిలిచియున్నది. నిన్నడ్డగించువా రెవ్వరును లేరు వేగముగాఁ బొమ్ము." అని చెప్పెను.

ఆ సమయమున వనజాతీ పుష్పమాలికలను జేతఁబట్టు కొని భవానీవిగ్రహమునకుఁ బూజచేయుచున్న బ్రాహ్మణుని చేతి కొక్కొక్క మాలగా నందియిచ్చుచుండెను.అప్పుడామె స్నానమొనర్చి, కీల్గంటు వేసుకొని, పుష్పమాలికలఁ గీల్గంటునఁ జుట్టుకొని, పట్టుచీర కట్టుకొని, నిలుచుండెను. కామేశ్వరశర్మ మోహనాంగి చెంతకుఁబోయి మాటలాడుట కుద్దేశించెనుగాని భవానీ విగ్రహముయొక్క భయంకరరూపమును, మోహ నాంగి ధ్యానములో నుండుటయును బ్రాహ్మణుఁ డొకఁ డచటఁ బూజచేయుచుండుటయును,గమనించి,తనకిది సమయముగాదని యెంచి, మరల, సభకువచ్చి కూర్చుండెను. సభామంటపమున నలుగడలను దీపములు ముట్టింపఁబడెను. మహారాష్ట్రులు దప్ప నితరులు సభలో లేరని నిశ్చయము చేసికొనినతరువాత తణ్ణాజీ లేచి, సభఁ గలయఁజూచి, జరగవలసిన విషయముల గుఱించి ప్రసంగము చేయుట కారంభించి యిటులఁ బలికెను.

"మహారాష్ట్ర సోదరులారా! అన్యమతస్థుల హింసించు

వారును భూతదయాది సుగుణహీనులునగు నీతురుష్కులక్రూర ప్రభుత్వమునకుఁ గలకాలమును మనము లోఁబడియుండి, వారు మన దేవాలయములఁ బాడుచేయుచు మనమతస్థులను పడ రానిపాట్లఁ బెట్టుచునుండ నోర్చుకొని యుండుటకు మనము వారివంటి మగవాండ్రము గామా? వారికుండెడి బాహుబల మును శౌర్యమును మనకు లేకపోయెనా! మనలో నైకమ త్యము లేకుండుటయే మనము వారికి లోఁబడియుండుటకుఁ గారణమను విషయము దీర్ఘాలోచనచేసిన మీకెల్లరకును బోధ పడును. ఆ యైకమత్యమును గలిగించి తురుష్కుల పాలనము నుండి మనదేశమును విడుదలచేసి, దేశమునకును, మతమున కును, దేవాలయాదులకును గీడు మూడనీయక చేయుటకై యీసభ గూర్పఁబడినది. మనము చేరియుండుస్థలము, మాహే శ్వరి మహిషాసురుని మర్దించి దేశమునకు క్షేమముఁ గలుగఁ జేసిన ప్రదేశము భవానీ సన్నిధానముననే మనమిపుడు చేరియుండుటవలన, దుష్టశిక్షణ శిష్టపరిపాలనా దక్షురాలగు మహేశ్వరి మనప్రయత్నముల సఫలముచేసి మన కవశ్యము జయంబొనగూర్చును. మహేశ్వరి యప్పటప్పటికిని మనశివాజీ మహారాజుగారి స్వప్నములోఁ దోఁచుచుఁ జేయవలసిన కార్య ములను దెలుపుచుండుట మీరిదివఱకును వినియేయుందురు. కాఁబట్టి మీరందఱు నొకటిఁగాజేరి శివాజీ మహారాజునకుఁ దోడునిలిచిన మనకెల్లరకును క్షేమంబుగలుగును. (అని దేవి ప్రక్క ముఖముత్రిప్పి) తల్లీ! జగన్మాతా! జగదీశ్వరీ! నీ పుత్రులగు మాకు శత్రుంజయమును, క్షేమమును గలుగజేయ వలసిన భారము నీదే. నీభక్తులగు మాకెల్లరకు నుత్సాహ

శౌర్యసాహసజయంబుల నొసంగుము." తణ్ణాజీ యిటులాడిన తోడనే సభ్యులందఱును 'జయకాళీ, జయకాళీ' అని కూయిడ సాగిరి. కూఁతలణఁగినపిమ్మట తణ్ణాజీ యాదేవాలయపు గుమాస్తాను బిలిచి, యచటఁజేరియున్న మహారాష్ట్రుల పేరులును, వారొకరొక రెంతసైన్యమును తీసికొని రాఁగలరో యాసంఖ్యలను వ్రాయుమని చెప్పెను. అతఁ డటులనే యొక్కొకని వద్దకుఁబోయి పేరులును, సంఖ్యలను వ్రాసితెచ్చి తణ్ణాజీ చేతి కిచ్చెను.

త—(లెక్కనుగూర్చి) ఇదివరకు నిరువదివేల జనమునకు లెక్క యేర్పడినది. శివాజీ మహారాజువద్ద. పదివేలజనముండును. మీరందఱు నిపు డూరక వారివారి తావుల నుండి కొండమీఁద మంట గనఁబడునపుడు వచ్చి చేర్పవలయును. అదివఱకును జరుగుసంగతులు రహస్యముగా నుండవలయును; అఫ్‌జుల్ఖానునకుఁ దెలిసిన మీ కుపద్రవము గలుగును; మేమప్పుడు సహాయము చేయలేము (నిదానించి) మీరిఁక మీ తావులకుఁ బొండు. నే నిప్పుడే వెడలిపోయెదను. కామేశ్వరయ్యా! నీవు బహుజాగ్రత్తతో మెలఁగవలెను. ప్రహర్సింగు చేతగాని, యఫ్‌జుల్ఖాను చేతఁగాని, నీవు చిక్కిన నీకు మరణము నాఁడేగలుగును. నే నిపుడేపోయెదను; భద్రముగా నుండుము.

ఇటులచెప్పి తణ్ణాజీ బయటికివచ్చి తనగుఱ్ఱముపై నెక్కి యనుచరులతో వెడలిపోయెను. సభవారందరును వారివారి యిండ్లకేగిరి.

---

## పదునొకండవ ప్రకరణము.

బీజపూరునందు యుద్ధయాత్రాసన్నాహ మొనర్చుటకుఁ గొన్ని దినములు పట్టెను. యుద్ధభటులకు నిలువగానున్న సంబళము లియ్యఁబడినవి తుపాకులు కత్తులు మొదలగు సాధనములు సిద్ధము చేయఁబడినవి. పర్వతప్రదేశములలో సేన నడచుటకుఁ గావలసిన పరికరములును చేర్పఁబడినవి. అఫ్జుల్ఖాఁ చిన్నప్పు డాపర్వతప్రదేశములలోఁ బెరిగినవాఁడును, గొన్ని సంవత్సరము లాదేశమును బాలించినవాఁడు నగుటచేఁ దనకుఁ బర్వతప్రదేశముల యుద్ధయాత్ర చేయుటకుఁ గావలసినంత సన్నాహము చేయించెను. తాను బయిటనుండు సమయమున మొగలాయివారివలనఁ బీజపూరు పట్టణమున కపాయము గలుగునన్న సందియము అఫ్జుల్ఖానున కుండెను. అందుచేత నతఁడు వెలుపటనున్న సైన్యములనే యుద్ధయాత్రకుఁ జేర్చెను. యుద్ధభటుల నందఱను సాయంకాలమున జమ్మా మసీదులోఁ జేర్చి, దస్తగిరిసాహేబు యుద్ధప్రోత్సాహమును చేయుచుండెను. అన్యమతస్థుల నెంతయెక్కువ సంఖ్య జనులను జంపిన నంతయెక్కువ సంతోష మల్లాకుఁ గలుగుననియు, అన్యమతస్థులఁ జంపుట తురుష్కులకు ముఖ్యధర్మమనియు, అటులఁ జంపిన తురుష్కులకు నిరంతర స్వర్గసౌఖ్యము గలుగుననియు, అట్టి యుద్ధములోఁ జనిపోయెడి వారికిఁ దప్పక స్వర్గము గలుగుననియు దస్తగిరి సాహేబు వారి కుపన్యసించుచుండెను.

అఫ్జుల్ఖా నిటులఁ గొన్ని దినములు యుద్ధసన్నాహము చేయుటకై బీజపూరులోనుండి, నలదుర్గములో మంత్రియధీన

మునున్న సేనతోఁ దనవద్దనున్న సేననుగూర్చి యుద్ధయాత్ర వెడలుటకై, తనసేనతోను, కుటుంబముతోను నలదుర్గము నకుఁ బోయెను. మల్హార్ రావునకు గాయము కుదిరినందున నతఁ డఫ్జుల్ఖానుతోఁ గూడనే పోయెను. దస్తగిరి సాహేబును సేన తోఁగూడనే వెడలెను. వీరు బీజపూరు వదలిన మూఁడవదిన మునకు నలదుర్గము జేరిరి. వీరు పోయి చేరిన తోడనే యచటి రాజకీయోద్యోగస్థు లఫ్జుల్ఖానున కెదురేగి సత్కార గౌరవములతో నతనిఁ దోడితెచ్చిరి. అచటఁ గట్టఁబడియున్న రాజకీయసౌధములలో నతఁడు విడిసెను. అఫ్జుల్ఖాను నలదుర్గ ములో మూఁడుదినములుండి యచటిసేనను యుద్ధమునకుఁగట్టా యితం బొనర్చెను. మూఁడవనాటి సాయంకాలంబున నఫ్జు ల్ఖాఁ తనమేడమీఁదఁ గూరుచుండి యుండఁగాఁ బ్రహర్సిం గచటికి వచ్చి తనరాక నెఱిఁగించి యతనికిఁ గొన్ని రహస్య విషయములఁ దెలుపవలసియున్నదని చెప్పెను. అతనిని నిరా యుధునిఁజేసిలోపలికివిడువవలసినదని యఫ్జుల్ఖాను నుత్తరువు చేసినందున భటు లటులనే యొనర్చిరి. ప్రహర్సింగ్ మేడ లోపలి కేగెను.

ప్ర—సాహేబుగారూ! కొత్వాలును జంపిన నాఁటి రాత్రి నేను నా మనుష్యులనుగొని బీజపూరు పట్టణమునంత టను వెదకించినను తన్నాజీ గనఁబడలేదు. తన్నాజీ వాడుకగా విడియు ప్రదేశములలోను వెదకించితినిగాని, మాకతఁడు దొరక లేదు. అర్ధరాత్రికిఁ బైన నేను గొంద ఱాశ్వికభటులతో వెడలి తుల్జాపూరికిఁ బోవుమార్గముననే యేబదిమైళ్ళదూ రము పోయిచూచితిని.అప్పటికిని నా కతఁడగుపడలేదు. మఱి

సటిదినము సాయంతనమునన తఁడు తుల్జాపురిలో భవానిదేవాలయమునఁ గనఁబడెను. ఆరాత్రియే తుల్జాపురినుండి వెడలెనఁట. వాఁ డెచటకిఁ బోయినదియు వాఁ డిపు డెచటనుండునదియుఁ దెలిసికొనుట యసాధ్యముగానున్నది. అతఁడు బీజపూరునుండియు పోయినదే విచిత్రము!

అఫ్జుల్ఖాన్—తణ్ణాజీ మహారాష్ట్రులలో ముఖ్యుఁడుగాఁబోలు.

ప్ర—తణ్ణాజీ, కామేశ్వరశర్మ శివాజీ, వీరు మువ్వురును మహారాష్ట్ర ముఖ్యులు. మహారాష్ట్రసమాజమునకు వీరు క్రమముగా నస్థిచర్మ ప్రాణములవంటివారు. తణ్ణాజీ తుల్జాపురికి వచ్చినదినమున మహారాష్ట్రులందఱును భవానీదేవాలయమున సభగూడిరి. తణ్ణాజీ, వారిపేరులనువారికిఁగల సైన్యములలెక్కయును వ్రాసికొని తనయుత్తరు వైనప్పుడు వారు వచ్చునటుల నేర్పాటొనర్చి వెడలిపోయెను. కాఁబట్టి మీరేమాత్రము నాలస్యముసేయక సేనతోఁగూడ నా తుల్జాపురిని చుట్టుకొని, పురిలోపలనుండు మహారాష్ట్రముఖ్యులఁబట్టుకొనవలెను అట్లు చేయకున్న మీకుఁ గష్టమొదవును. మహారాష్ట్రులందఱు నొక్కటిగాఁ గూడిన వారిని జయించుట యసాధ్యమని నాకుఁ దోఁచుచున్నది.

అ—ఆసంగతులు నీ కెట్లు దెలియును? ఇపుడు తుల్జాపురిలో వారితోఁ జేరినవా రెంద ఱుందురు?

ప్ర—నేనును మా యన్నకుమారుఁడును నలుగు రనుచరులతో రాత్రి బైరాగివేషము వేసికొని తుల్జాపురికిఁ బోయియుంటిమి అచట మేము విచారించి యీసంగతులను దెలిసి

కొంటిమి. వా రనుచరులతోఁ గూడ నేనూటికిఁ బైననే యుందురు.

అ—ఆ దేవాలయపుఁ గట్టడము బటువైనదేనా? దానిని భేదించుటకు ఫిరంగీలు కావలసియుండునా?

ప్ర—మీరు దండెత్తివచ్చుట వారికి ముందుగాఁ దెలిసినయెడల ఫిరంగీల సహాయము లేక మీరు లోపలఁ బ్రవేశింపలేరు. మనము రాత్రి వేళఁ దటాలునఁ బ్రవేశించుటయే యుక్తము. పగలు వారు దొరకరు. రాత్రి ఫిరంగీలను గొండపై కెత్తికొనిపోవుట యసాధ్యము.

అ—సరి, సరి, అటులే చేసెదము. ఈ కాఫిర్లను (అన్యమతస్థులను) అటులనే జంపవలయును; అవి మంచివల.

ప్ర—అటులనే చేయుఁడు. ముందుగా బయలుదేఱిపోయి సగముత్రోవలో నుండు వంశులూరిలో దండువిడిసి యుండుఁడు. నేను రేపు సాయంతనమున నా సేనతోఁగూడ వచ్చి మిమ్ముఁ గలిసికొనెదను. మనమందఱమును తేపు రాత్రి తుల్జాపురిని జేరవలయును. అమ్మవారి విగ్రహమునకు మాత్రము చెడుగు చేయకుండునటుల సైనికుల కుత్తరవు చేసెదను. ఈసంగతులు రహస్యముగా నుండవలెను.

అ—అటులనే యుత్తరువు చేయుదును.

ప్ర—సరి! నేను సెలవుదీసికొనెదను. (అని వెడలిపోయెను)

హేవళంబిసంవత్సర భాద్రపద బహుళ చతుర్దశి నాఁడు సాయంకాలమున నలదుర్గమునుండి యఫ్జుల్ఖాన్ సేనాసమేతుండై వెడలెను. నాటియుదయముననే ప్రహార్సింగ్ అఫ్జుల్ఖానుతో మాట్లాడినది. అమావాస్య తిథి గడవఁగనే

మఱునాఁటిరాత్రి భవానీదేవాలయములో నుత్సవములు ప్రారంభించుటచేత, జను లనేకులు చుట్టుప్రక్కలపల్లెలనుండి తుల్జాపురికి వచ్చుచుండిరి.

నాఁ డర్ధరాత్రమునఁ బాడ్యమి పుట్టువేళ నవరాత్ర్యుత్సవ ప్రారంభమని యెల్లరును వినియుండిరి. అమావాస్య నాఁడుగుడిలోపల నర్చనలును, నభిషేకములును జరుగువాడుక కలదు. చుట్టు ప్రక్కల నుండువారు గుంపులు గుంపులుగాఁ దుల్జాపురికి వచ్చి చేరుచుండిరి. అమావాస్య నాఁటిరాత్రి వఱకును గడియగడియకు జనసమ్మర్ద మెక్కువగుచుండెను. పూటకూలియిండ్లును మిఠాయియంగడులును వీధివీధికిని మూల మూలకును గ్రొత్తగా నేర్పడినవి. దేవాలయము చుట్టును బూలయంగడులును, దమలపాకుల యంగడులును, టెంకాయ కర్పూరము మొదలగు పూజాద్రవ్యముల యంగడులును గ్రొత్తగాఁ బెట్టబడినవి.

అఫ్జుల్ఖాఁ నలదుర్గమును సేనతోఁగూడఁ జేరిన సంగతి కామేశ్వరశర్మ చారులవలనఁ దెలిసికొనెను. వారిక షోలాపురికి వత్తురనియుఁ, గామేశ్వరశర్మ వినియుండెను. ఈ సంగతులను శివాజీకి ముందుగాఁ దెలుపవలసిన దవశ్యముగా నుండుటచేతను, తురుష్కు లింతసమీపమునకు యుద్ధసన్నద్ధులయి వచ్చియుండునపుడు తుల్జాపురిలో నిలుచుట యపాయకర మగుటవలనను శివాజీ టెంకియగు ప్రతాపగిరి కేగుటకు నితఁడు నిశ్చయించెను. ఆసంగతి నితఁడు మహాదేవశాస్త్రులకు నమావాస్యనాఁ డుదయమునఁ దెలిపెను.

కామేశ్వరశర్మ చూపులవలనను, జాడలవలనను, తన

యం దనురాగముగలిగి, మోహాంధకారమున నున్నాఁడని వనజాక్షికిఁ దెలియునుగాని, యామెకు వానియం దొక్కింతయుఁ బ్రేమ లేనందునను, నామె సదాచార సంపన్నురాలై నందునను, వానిని గన్నెత్తియైనను జూడక వానియందు జుగుప్సతో నుండెను. కాఁబట్టి కామేశ్వరశర్మ యూరువిడిచి పోవునది యామెకు మిగుల సంతోషకరముగా నుండెను. శాస్త్రులకు వానియందు సందియము లేకుండుటచేఁ దానుమాత్రము కొంచెము వ్యసనపడెను.

అమావాస్యనాఁటిసాయంతనముననే, మహాదేవశాస్త్రులు తనభార్యలను బిలుచుకొని దేవాలయమునకుఁ బోయెను కామేశ్వరశర్మయు వారితోడ దేవాలయమునకేగి, తాను కొన్నిపుస్తకముల మఱచివచ్చినటుల వారికిజెప్పి, మరలి యింటికివచ్చి, తనసేవకులనుగొని, యొకపల్లకియు నలుగురుబోయీలను, రెండు గుఱ్ఱములను సిద్ధము చేయించి, దేవాలయపుదిడ్డివాకిలిప్రక్క పడికట్టులచెంత నిలిపి, దేవాలయము లోపలికి వచ్చెను. కామేశ్వరశర్మ దేవాలయములోపలఁ బ్రవేశించిన తోడనే బాలామణిని జూచి తాను సమస్తము సిద్ధము చేసినటులఁ జెప్పెను. బాలామణి తానెటులనైన వనజాక్షిని మోసపుచ్చి యామె బందుగులవద్దనుండి యవలఁ దీసికొనివచ్చునటుల కామేశ్వరశర్మకు జెప్పెను.



## పండ్రెండవ ప్రకరణము.

అమావాస్య నాటి సాయంకాలమునఁ బ్రహర్సింగ్ తాను ముందుదినమునఁ జెప్పినప్రకారముననే నాలుగువందల యుద్ధభటులతో వచ్చి తండులూరుఁ జేరెను. ప్రహర్సింగ్ భటులను బయటనిలిపి, తన యన్నకుమారునితోడ నఫ్జుల్లానుండు మేడకుఁ బోయెను. ఆసమయము నటఁ దురుష్కుల గురు వొకఁడు దైవప్రార్థనాప్రారంభసూచకమగు నొకపాటఁ బాడెను. తురుష్కులందఱు నచటఁ గుమిగూడి మక్కాపట్ట ణముప్రక్క ముఖముద్రిప్పుకొని, మోకాళ్ళమీఁద నిలిచి, కన్నులు మూసికొని దైవప్రార్థన చేసిరి. అఫ్జుల్లానును నటు లనే ప్రార్థనచేసెను. ప్రార్థన ముగిసినపిమ్మట జనసంఘము వెలు పలికిఁబోయెను. అప్పు డఫ్జుల్లాఖ ప్రహర్సింగునుజూచి, రమ్మని పిలిచి "యుద్ధయాత్రకు సిద్ధముగా వచ్చితివా" అనియడిగెను.

ప్ర—నేను సిద్ధముగానే యున్నాను. నాలుగువందల యుద్ధభటులతో వచ్చియున్నాను.

అ—నేనును సిద్ధముగానే యున్నాను. సేన యేమార్గ మున నడువవలయును?

ప్ర—సేన రెండుతెగలుగాఁ జీలవలెను. మనమిరువుర మొకతెగకును, నా యన్నకుమారుండును, నీకుమారుఁడును మఱియొక తెగకు నధ్యక్షులుగా నుండవలెను. బయలువెడల వలసిన వేళకు నేను భేరీ వాయించెదను. ఆశబ్దము వినినతో డనే యందఱును గదలవలయును. నేను సెలవుదీసికొనెదను. (అని వెడలిపోయెను.)

దస్తగిరి సాహేబు— రాత్రివేళలో సేన నడపవలసిన యవశ్యమేలకలిగెను ? హిందువులెవరైనను నెదురుతిరిగిరా?

అ— హిందువు లెవరును సంస్థానమున కెదురుతిరుగ లేదు. కొన్ని రాజకీయరహస్యకార్యములకై నేనును నా కుమారుఁడును బోవలసియున్నది. ఇపుడు షోలాపూరునకు యుద్ధయాత్ర వెడలుట లేదు.

దస్తగిరి— ఎక్కడికైనను సరే నేను మీతోఁగూడనే రావలయును.

అ— మీరు రాకుండుట మేలు. ఐనను మీయిష్టమున కడ్డములేదు. ముందుగా భోజనముచేయుఁడు.

సైనికులందఱు భోజనము చేసినపిమ్మట ప్రహార్సింగ్ భేరీవాయించెను. అఫ్జుల్ఖాను ప్రహార్సింగుతోఁ జేరి, సేనను రెండుతెగలుచేసి, కుమారుల స్వాధీనమున నొకతెగను వదలి తానొక తెగకుముందు నిలిచిరి. దస్తగిరి యఫ్జుల్ఖానుతోడ బయలువెడలెను. ప్రహార్సింగ్ ముందుగాఁ బోయెను.

ద— అఫ్జుల్ఖాన్, చీఁకటి దట్టముగానున్నది.ఈగాఢాంధకారములో దివిటీల వేయింపకుండిన మనకుఁ బ్రయాణము చేయుట మిక్కిలి కష్టముగానుండును ముందుగా దివిటీల వేయింపుము.

అ— కూడదు. మన ప్రయాణము రహస్యముగా నుండవలెను. ఇతరులకుఁ దెలిసిన కార్యము చెడును.

ద— ఇపుడు మనము పోవలసినయూ రెద్ది?

అ— తుల్జాపురి.

ద—తుల్జాపురికా? అచట విగ్రహములు, దొంగలు, విశేషముగా నుండునటుల వినియున్నాను. అచట ముసలిద య్యమొకటి తిరుగుచుండునఁట. హిందువు లాదయ్యమును గొలచెదరఁట. వారినందఱను జంపవలెను. అన్యమతస్థులను జంపవలసినదే మనకు ధర్మము

అ—ఠష్! ఊరకుండుము. దేవళమునకును జనమున కును, కీడుచేయనని నేను ప్రహార్సింగుకు వాగ్దానము చేసియు న్నాను. కాఁబట్టి నేను నామాటప్రకారమే జరుపుదును.

ద—నీయిష్టప్రకారము చేయుము. నీకు వెనుకనే నేను కత్తి నెత్తెదను. సేనను రెండుతెగలుగాఁ జేయవలసిన కారణ మేమి?

అ—ఒకతెగ పట్టణమును చుట్టుకొని, యెవ్వరినిబయటఁ బోవనీయక చూచుకొని, బయట వచ్చువారిని బట్టుకొనవల యును. వేఱొకతెగ పట్ణములోఁ బ్రవేశించి మహారాష్ట్రి ముఖ్యులను బట్టుకొనవలెను. పట్ణములోపలఁ దేవాలయమున నందఱు గుమిగూడి యుందురఁట వారందఱు నిరాయుధులై, యఘోరస్వరూపమగు వారి విగ్రహమును సేవించుచుందు రఁట. ప్రహార్సింగ్ మహారాష్ట్రి ముఖ్యులనెల్ల నేర్పఱచి పట్టు కొనును. మనమేమియుఁ జేయ నక్కఱలేదు.

ద— ఇదిమంచి యుపాయముగానే యున్నది.

ఇటులవారు మాటలాడుచుఁ గొంతదూరము పోయిన తరువాత మార్గము పల్లములతోను డొంకలతోను నిండి యుండినందున వా రొకరితో నొకరు గూడి మాటలాడక జాగ్రత్తతో స్వారి చేయుచుఁబోయి, తుల్జాపురిచెంతకుఁ జేరిరి.

ముందు నిశ్చయించికొనిన ప్రకారము నొకతెగ రసూలధ్వజత క్రింద బట్టణమును జుట్టుకొనెను. ప్రహర్సింగ్ మొదలగు వారితోఁజేరిన తెగతో నఫ్జుల్ఖానుపట్టణములోఁ బ్రవేశించెను.

ఆ యమావాస్య నాఁటిరాత్రి తుల్జాపురిలోని జనులందఱును వెలుపలనుండి యచటికి వచ్చినవారును భవానీదేవ్యాలయము చుట్టుకొనియే యుండిరి కొందఱు దేవ్యాలయము ముంగిటను, కొందఱు గర్భగృహంబునను, కొందఱు వాహన మండపములోను, కొందఱు ద్వారము చెంతను నిండియుండిరి. రాత్రిప్రొద్దు పోనుపోను బయటిజనమును బురిజనమును నొకటిగా దేవాలయము చెంతఁ జేరుచుండుటచేత నచట జనసమ్మర్ద మెక్కుడాయెను. త్రొక్కుడు మిక్కుటమగు వేళకుఁ, బార్వతమ్మ తానిక నట నిలువఁబడగదని యెంచి, యింటికి రమ్మని కూఁతురైన వనజాక్షిని బిలిచెను. వనజాక్షి తనకేమియు భయములేదనియు, తండ్రితోడ నింటికి వచ్చెదననియు అమ్మవారి యుత్సవము ముగియకయే తాను రానట్లును, దల్లికిఁ జెప్పినందునఁ, బార్వతమ్మ యామెను తండ్రితోఁగూడ రమ్మనిచెప్పి, గంగాబాయిని బిలుచుకొని యింటికిఁ బోయెను. వీరు దేవ్యాలయమున నుండుసంగతి గని బాలామణి మిగుల సంతోషము నొందెను.

దేవ్యాలయమున గర్భగృహమునందు నమ్మవారికిఁ బూజలు జరుగుచుండెను. అనేక బ్రాహ్మణులు వేదపారాయణముఁ జేయుచుండిరి. వనజాక్షి యమ్మవారిసన్నిధిని స్త్రీల నడుమ నిలుచుకొని, యమ్మవారి దర్శనము చేయుచుండెను. కామేశ్వరశర్మ దేవ్యాలయములో నొకమూలనిలిచి బాలామ

ణితో మాటలాడుచు, వనజాక్షి నెత్తుకొనిపోవు సదుపాయము లను రహస్యముగాఁ జెప్పుచుండెను. అప్పటికి సుమారు పండ్రెండుగడియల రాత్రి గడచెను. అప్పుడు గుడికి వెలుపల గొప్పఘోష లేచెను. కామేశ్వరశర్మ బాలామణితో నాఘోషకుఁగారణమును బయటికిఁబోయి తెలిసికొనిరమ్మని చెప్పెను. బాలామణి ద్వారముదగ్గఱకుఁ బోయి, స్త్రీల యార్తనాదములును, పురుషుల భీకరధ్వనులును, గుఱ్ఱముల త్రొక్కుడుల చప్పుడులును విని, యచటనున్నవారి నడుగఁగా నది తురుష్కుల దండువలనఁ గలిగిన కలవరమని వారు చెప్పిరి. బాలామణి యతివేగముగా మరలి కామేశ్వరశర్మ యున్నచోటికి వచ్చి, యచటనే తాను వచ్చువఱకును గదలకుండుమని చెప్పి, వనజాక్షిని వెదకుకొనిపోయెను. బయటిఘోష వినినంతనే దేవాలయములోని వారందఱును భయభ్రాంతులై ద్వారముచెంతకుఁ బరుగిడి వచ్చుచుండిరి. వనజాక్షియు మఱికొందఱు స్త్రీలును వచ్చుచుండుటఁ గని బాలామణి వారికెదురేగి, వనజాక్షి నొర్రాలనిలిచెను.

వన—బాలామణీ ! మానాయన యెక్కడ ? (అని మిగుల భయముతోను గలవరముతోను నడిగెను)

బాలా—మీ నాయన యిదిగో నిలిచియున్నాఁడు. నాతోఁగూడ రమ్ము. నేను నిన్నతనికడకుఁ బిలుచుకొని పోయెదను.

బాలామణి యిటులఁబలికి, వనజాక్షి చేతిని పట్టుకొని, కామేశ్వరశర్మ యుండుచోటికిఁ బిలుచుకొనిపోయెను. కామేశ్వరశర్మ యొకధావళిని దటాలున నామెముఖముపై వేసి పక్షి

ద్వారమున కాపు పెత్తికొనిపోయి యచట నిలిచియున్న తన సేవకుల స్వాధీనమున నుంచెను. వనజాక్షి కూఁతలు, ధావళి యద్దమువలనను, ప్రక్కనున్న జనఘోషలవలనను జనుల మనస్సు నాకర్షింపకుండెను. అందువలనను, వారికప్పుడు తురుష్కఘోరకృత్యములవలనఁ గలిగిన కలవరమువలనను, వా రెవ్వరును వనజాక్షివద్దకు రాకయుండిరి.

అప్జుల్ఖానును దస్తగిరిసాహేబును అశ్వారోహకులైన యుద్ధభటులతోడ నాపట్టణపు ద్వారమున నిలిచిరి. కొందఱు భటులు పట్టములోఁ బ్రవేశించి బజారువీధినిఁ బోయి దేవాలయ ద్వారమును జేరిరి. వెలుపలనున్న పురజనులలోఁ గొందఱు ముందుగా దేవాలయముకడకేగి, దేవాలయపువాకిటి తలుపులను మూసికొనుఁడని లోపలివారికిఁ జెప్పిరి. అంతట వారు దేవాలయపుఁ దలుపులుమూసికొనిరి ప్రహార్సింగ్ను కొందఱు యుద్ధభటులును, దేవాలయమును జేరువేళకుఁ దలుపులు మూయఁబడినవి.

ప్ర—తలుపులఁ దెఱువుఁడు. మేము నవాబుగారి యుద్యోగస్థులము. తెఱవకుండిన మీప్రాణములకు హానికలుగును.

లోపలిజనులు—మీరుదొంగలు! మిమ్ము లోపలికి రానీయము. ఆవలికేగుఁడు. పోకుండిన మీపైనఁ దుపాకులఁ గాల్చెదము.

ప్ర—గుండా! గొడ్డలినెత్తుము. తలుపులఁ బగులఁ గొట్టుము.

ప్రహార్సిం గిటులఁ బల్కఁగా గుండఁడు గొడ్డలినెత్తి తలుపులను జీల్చుటకుఁ బ్రారంభించెను. అప్పుడు లోపలనున్న

వారిలో నొకఁడు దేవాలయపు ద్వారముపైనున్న బారపట్టె మీఁదనెక్కి, యా సందులోనుండి తుపాకిని గుండనిపైనఁ గాల్చెను. గుండఁడు గిఱగిఱఁదిరిగి నోట రక్తముఁగ్రక్కుచుఁ గ్రిందఁబడి చచ్చెను. బయటనున్న యుద్ధభటులు దానినిఁజూచి బారపట్టెమీఁదికి గుఱిచేసి తుపాకులఁ గాల్చిరి. ప్రహార్సింగ్ మొదలగువారు తలుపులను బగులఁగొట్టిరి. పురజనులనేకులు తుపాకులను చేతఁబూని యుద్ధభటులపైనఁగాల్చిరి; యుద్ధభటులనేకులు చచ్చిరి. తుపాకిప్రేటుల శబ్దములు అప్జుల్ఖానునకు వినఁబడెను. అప్జుల్ఖాఁ అతివేగమున దేవాలయమును చెంతకు వచ్చి తుపాకులఁ గాల్చుటకును, యుద్ధముచేయుటకును, తన సేన కుత్తరువిచ్చెను. దస్తగిరిసాహేబును "బిస్మిల్లా" బిస్మిల్లా (యుద్ధమున కుత్తరువు) అనియఱచుచుఁ దురుష్కులను యుద్ధమునకుఁ బ్రోత్సాహ పఱచెను.

అప్పుడు, "దీన్, దీన్" అనుశబ్దములతో నిరపరాధ జనుల బాధించు యుద్ధభటులును, భయభ్రాంతులైగాయములు తగిలిన దేహములతోఁ వీథులలోఁ బరుగులిడు మగవాండ్రును, అసహాయలై యార్తలై మొఱలిడుచువిలపించెడునబలలును, బెదఱి పాఱి మూలలలో దాగికొనెడి బాలురును, తురుష్కులచేతఁ జిక్కి మొఱపెట్టుచుండు యావనస్త్రీలును ఇండ్లలోదూఱి దొరకినసొమ్మును గొల్లఁగొనుచు, ముసలివాండ్రను బట్టి పరిహాసము చేయుచు, బాధించుచు నుండు తురుష్కులును నాపట్టణంబునఁ గానవైరి. అప్పుడు మహా దేవశాస్త్రుల నొక తురుష్కభటుఁడు జుట్టుఁబట్టుకొని యీడ్వఁగా నతఁడు వానిచేతికత్తి నొడిసిపట్టుకొని యాకత్తితో

వానికాళ్ళను నడికి క్రిందఁ బడవేసెను. అప్పుడు ప్రక్కనున్న వేఱొక తురుష్కయుద్ధభటుఁడు మహాదేవ శాస్త్రిలపైకి రాఁగా నతఁడు సందులో మూఱ పరుగెత్తిపోయెను. దస్తగిరి సాహేబు కొందఱు యుద్ధభటులతో దేవాలయపు గర్భగృహముఁ బ్రవేశించి భవానీవిగ్రహముపై నున్న సొమ్ముల నన్నింటిని దోచుకొని, యవాచ్యములగు ఘోరకృత్యముల నొనర్చెను దేవళమంతటను పీనుఁగుపెంటలు పడియుండెను.

పార్వతమ్మయు గంగాభాయియు నింటిలోపలనే యుండిరి. ఈ కలకలము విని వారు పాఱిపోయి తప్పించుకొనుటకు యోజించుచుండఁగా వారికి మిగుల నాప్తుఁడుగా నుండిన జానునాయఁ డనువాఁడు వారుండు చోటికివచ్చి, "ఇంటిలో నుండుట భద్రము కాదు; రండు, రండు, నామనుష్యు లింటిని గాచెదరు" అని వారిని బిలిచెను.

వారంతట వానితోఁగూడనే వెడలిపోయిరి. జానునాయఁడు వారిని సమీపమున నున్న యొక పర్వతగుహలోనికిఁ బిలుచుకొనిపోయి యచట వారిని దాఁచెను. వారు తమవద్ద నున్న నగలను మూటకట్టి వానిచేతికిచ్చి కాపాడుమని చెప్పిరి. ఉదయమున వచ్చి వారిని జూచునటులఁ జెప్పి తన కంబళిని వారికిఁ గప్పుకొనుటకిచ్చి జానునాయఁడు వెడలిపోయెను.

కామేశ్వరశర్మ సేవకు లిరువురు వనజాక్షిని గాలు సేతు లాడనీయక పట్టుకొనిరి. వెంటనే యిరువురు నామె నెత్తుకొనిపోయి యొక పల్లకిలోఁ బెట్టిరి. బోయీలు పల్లకి నెత్తుకొని కదలి పోవుచుండిరి. గాఢాంధకారమై యుండుటచేత బోయీలొక దివ్వటిని వెలిగించి పట్టుకొని పోవుచుండిరి. కామే

శ్వరశర్మ నిరాయుధుఁడై గుఱ్ఱముపై నెక్కి పల్లకి ముందుగాఁ బోవుచుండెను. బాలామణి యొక గుఱ్ఱముపై నెక్కి యతనికి వెనుకఁ బోవుచుండెను. ఆసమయంబున గోపీనాథసింగును రసూల్ఖాను దివిటీ వెలుతురునుజూచి, యెవరో తప్పించుకొని పోవుచున్నారను సందియముతోఁ బల్లకి చెంతకు వచ్చిరి. కొందఱు యుద్ధభటులును వారి వెనుకనే యచటికి వచ్చిచేరిరి. రసూల్ఖాన్ ముందుగా వచ్చి కామేశ్వరశర్మను బట్టుకొని; "ఎవడవు నీవు? నీవా చోటువదలి కదలినను, ఎదురించినను దక్షణమే చంపుదును. ఎచటికేగెదవు? శీఘ్రముగాఁ దెల్పుము" అని బిగ్గరగా నడిగెను.

గోపీనాథ్ సింగ్—ఓహో! కామేశ్వరశర్మగారూ! మహారాజా! మీకు నన్నుఁ దెలియదా ?

రసూ—ఈయన, కామేశ్వరశర్మయా! మంచికాలమే! ఎవరు పల్లకిలో నుండునది.

కామే—నాభార్య ; నన్నేటులనైనఁ జేయుండు ; నా భార్యను వదలుఁడు.

గోపీ—మూఁడు దినములకుముందు నీకు భార్య లే కుండెనే, నీకింతలో నెపుడు వివాహమాయెను ?

వనజాక్షి—(ఆమాటలువిని) అయ్యో ! తలుపు తెఱువుఁడు. నన్ను విడిపింపుఁడు. దిక్కులేని దానను. దయయుంపుఁడు.

రసూల్—(క్రిందికిదిగి, పల్లకిని దెఱచి) భయపడకుము. మేము స్త్రీలతో యుద్ధముచేయుటకు రాలేదు. నీవతని భార్యవేనా? కానున్నఁ బల్లకినుండి దిగుము.

వనజాక్షి—(పల్లకినుండి దిగి) నేనాతని భార్యను కాను. నన్నాతఁడు. బలాత్కారముగా నెత్తించుకొని వచ్చెను. నన్న తని బారినుండి రక్షింపుఁడు. దయయుంచి నన్ను మాతండ్రి వద్ద నప్పగింపుఁడు. మీరే రక్షకులు

రసూల్—భయపడకుము. నిన్ను నేను గాపాడెదను. (భటులనుజూచి) ఆబ్రాహ్మణుని గుఱ్ఱమునకుఁగట్టి, యాగుఱ్ఱ మును మీగుఱ్ఱమునకుఁ బట్టికట్టుఁడు.

ప్రహార్సింగ్ సేవకుఁడగుకుప్పఁ డంతటఁగా మేశ్వరయ్య నటులనే బందించి, బాలామణినిగూడ నటులనే కట్టించెను.

---

## పదమూడవ ప్రకరణము.

రసూల్ఖానునకు హిందువులయెడ ద్వేషముగాని, దురభి ప్రాయముగాని లేదు. దస్తగిరి సాహేబు మసీదులోఁ జేయు బోధనలయందు నితనికి నమ్మకములేదు. మల్హార్ రావుతోఁ జిన్నప్పటినుండి యితని కెడతెగని సహవాస ముండుటచేతను, మహారాష్ట్రులు కొంద ఱితనిక్రింద నమ్మకముగాఁ బనిచేయు చుండుటచేతను, బాల్యమునఁ జక్కఁగా విద్యలనేర్చి, హిందూ శాస్త్రములను కూడఁ జూచియున్నందునను హిందువులయం దితనికి మంచి యభిప్రాయముండెను. మల్హార్ రావు సత్ప్రవ ర్తన వలన నఫ్జుల్ఖానునకు హిందువులయందుఁ గొంత మంచి యభిప్రాయ ముండెనుగాని రసూలు కుండునంతటి కనికర మతనికి లేదు. దస్తగిరి సాహేబుపై నరసూలునకీవిషయమునఁ గొంత ద్వేషముగలదు. అఫ్జల్ఖానునకు మాత్రము దస్తగిరి సాహేబునందు గురుత్వము కలదు. దస్తగిరి సాహేబు మూల

కముగా హిందువులకు నిష్కారణముగాఁ బరిభవము గలుగు చుండునను సందియముతో రసూలుశీఘ్రముగా దేవాలయము లోనికిఁ బోయెను. రసూలాఖా దేవాలయము చేరువేళకు అప్జుల్లా నెదురుపడెను. వానిప్రక్కనే దస్తగిరి సాహెబును, ప్రహార్సింగును గనఁబడిరి. అప్పటి కుదయమునకు రెండుగడి యల ప్రొద్దుండెను. అప్జుల్లాను కుమారునితో నిట్లనియె.

అప్జుల్లాఖా—రసూల్, అల్లాదయవలన నీపురియందలి యన్యమతస్థుల ననేకులను నరకమున కంపితిని. కామేశ్వరశర్మ మాత్రము దొరకక పోయెను అదియే కొదవ.

రసూల్—నేను వానినిఁబట్టి బంధించియున్నాను. అత నితోఁగూడ నిద్దఱు స్త్రీలును కొందఱు సేవకులును దొరకిరి,

అ—శహబాస్!అల్లాకు వందనము

ప్ర—నిజముగా నతఁడు దొరకెనా? దొరకిన వాఁ డతఁడే యని నీకెటులఁ దెలియును?

గో—నే నతనిఁ జూచితిని. నిజముగా నతఁడే.

అ—గోపినాథసింగ్ ! నీవు పోయి వానినిఁ దెమ్ము.

గో—ఇదిగో పోయెదను. (అని తిరిగిపోయెను.)

ద—రసూల్ఖా! అల్లాదయవలన మన మీ హిందు వులఁజంపి కసి దీర్చుకొంటిమి. విగ్రహములనుకూడఁ ద్రోసివేసి తిమి. పూజచేయు నర్చకులనుగూడ ఖండించితిమి. ఇంతకంటె మనకుఁ గావలసినకార్య మేమియున్నది ?

రసూల్—హా! దైవమా! (నిట్టూర్పువిడిచితండ్రినిగని) నాయనా! నిరపరాధులగు నర్చకులతో యుద్ధముచేయుటకా మన మిచ్చటికి వచ్చినది? సాధుహింస చేయఁదగునా?

అ——అటులనే జరిగినది. యీజయము మనకుఁ గలిగి నందుకు అల్లాకు వేయి రూపాయలు ప్రార్థనఁ జేసితిని.

ద——మనపాలనలో నుండు ప్రజల, భూతములఁ గొలువ నీయక చేయవలసినది మనకు ముఖ్యధర్మము. శీఘ్రకాలములో నీదేవాల్యయము విడియఁగొట్టి యచట నొకమసీదు కట్టింపవలెను. సత్యమతావలంబులగు మనవారి కందఱకు నాచోట గోమాంస భక్షణతో విందుచేయవలెను.

రసూల్——బలాత్కారముచేత మతాభిప్రాయములు మాఱునా? హిందువులు మనవంటి మనుష్యులు కారా? వారు మన మసీదుల నిడియఁగొట్టిన మనకు మన సెట్లుండును? నీవు భూతదయ లేనివాఁడవు; నీముఖముచూచుటే దోషము.

ప్ర—— మనము లోపలికిఁబోయి చూచివత్తము రమ్ము.

అఫ్జు——రసూల్! కార్యము మించినతరువాతఁజూచుట వలన నేమి ప్రయోజనము?

ర——నేను చూచియే తీరవలెను. (అని పోయెను.)

దస్త——ఇంతమాత్రమునకే యితఁడు పరితాపపడుట యెంతయు నాశ్చర్యముగా నున్నది. ఫిరోజిషాగారు లక్షల కొలది హిందూజనమును జంపియుండలేదా? తురుష్కుఁడుగా నుండి యన్యమతస్థుల మరణమునకు దుఃఖింపవచ్చునా? ఖొరాను జదువలేదా? లేక యందలి యభిప్రాయము నెఱుఁగ కుండునా?

రసూల్ఖా నంతటఁ బ్రహర్సింగ్‌ను వెంటఁబెట్టుకొని తుల్ఖాపురి యంతయుఁ జుట్టి యెదురుపడినవారినందఱను "మహాదేవశాస్త్రులెచటనున్నాఁడు" అనియడుగుచుండెను. వారిలో ననేకులు తమకుఁ దెలియదని చెప్పిరి. కొందఱుమాత్రమతఁడు

రాత్రి చంపఁబడెనని చెప్పిరి. రసూలతనియింటికిఁబోయి చుట్టు ప్రక్కల నున్న వారిని శాస్త్రుల భార్యలను గుఱించియడుగఁగా వారిసంగతి జానునాయునికే తెలియునని చెప్పిరి. రసూల్ఖాను జానునాయఁడుండు చోటికిఁబోయి యడుగఁగా నతఁడు శాస్త్రులయిల్లు రాత్రి యుద్ధభటులచేఁ గొల్లఁ గొట్టఁబడినదనియు శాస్త్రుల భార్యలు చంపఁబడిరనియు, వారి నగలమూట మాత్ర ముదయమున వారింటిలో నొకమూల దొరకెననియుఁ దెలిపెను. రసూ లామాటలువిని, మిక్కిలి దుఃఖముతో మరల నప్జుల్ఖా నుండుస్థలమునకు వచ్చెను. ఆవేళకు మహారాష్ట్ర ముఖ్యు లనేకు లచట వచ్చియుండిరి. అప్జుల్ రాత్రి జరిగిన ఘోరకృత్యములకు రసూల్ఖాన్ వ్యసనాక్రాంతుఁడై యుండుటనుజూచి తాను కొంత పశ్చాత్తాపమూని వారి కేయొగ్గును జేయక పంపెను.

అ—రసూల్, చూచితివా; వారినందఱను మన్నించి పంపితిని. రాత్రి వారు ముందుగాఁ దుపాకులు కాల్చినందున నిట్టియాపద గలిగెను.

ర—రాత్రి నేనిచట నుండిన నిట్టి ఘోరకృత్యములు జరుగవు.

ద స్త.—అల్లాకుఁ దృప్తియగునటులరాత్రి నేను సమస్త కార్యముల జరిపించితి. ఆహిందూవిగ్రహములమీఁద నుమిసితిని. విగ్రహములవెనుక దాగికొనియుండిన ముసలిబ్రాహ్మణులను ఖండించి యారక్తము నావిగ్రహములపైఁ జల్లించితిని. ఆసందడిలో గోవులుమాత్రము దొరకకపోయినవి. దొరకియుండిన వానినిఖండించి యారక్తము నావిగ్రహములపైఁ జల్లించి మాంసమును దురుష్కులకాహారముగా నిచ్చియుం

దును. ఖొరానులో నిరువదిరెండవ యధ్యాయములో నేమి చెప్పియున్నది? ఇటువంటిపనులు చేయుటయేకదా యల్లాకు సంతోషముఁ గలిగించును. ఇటువంటిపనులు చేయుటవలననే కదా మనకు స్వర్గసౌఖ్యము గలుగును.

ఇంతకంటెఁ బుణ్యకార్యము లేవియున్నవి. అన్యమతస్థులఁ జంపుటయే యుత్తమ కార్యముగదా?

ర—నిజమే. యోజన మీకుఁ గుదిరినటుల మనుష్యజన్మ మెత్తినవారల కితరులకుఁ గుదురుట కష్టము. భూతదయ కొంచెమైనను లేని మీవంటి పుణ్యాత్ముల కివి యుత్తమ కార్యములుగానే తోఁచును. దేవుఁడు సర్వసముఁడనియు, నెల్లప్రాణులకును దండ్రివంటివాఁడనియు మా నమ్మకము. దేవుఁడు తురుష్కులకు మాత్రమే తండ్రివంటి వాఁడనియుఁ దక్కినవారికి శత్రువనియుఁ గొరానులో నెచటను జెప్పియుండలేదు, అన్యమతస్థుల నందఱను జంపవలెనని తురుష్కులెంచునపుడు తురుష్కుల నందఱిని జంపవలెనని యన్యమతస్థులకుఁ దోఁపదా! అన్యమతస్థులందఱును దురుష్కులఁ జంపఁబూనిన భూమియందొకతురుష్కుఁ డుండునా? అన్యమతస్థులు నిన్నుఁ జంపఁబూనునపుడు నీమన స్సెటులుండును? వారి కట్టిమనస్సులేదా? ఇఁక నిట్టిమాటలు నాయెదుట నాడకుము. ఖొరానును నీవు సరిగా గ్రహింపలేదని తోఁచుచున్నది. భూతదయ యెల్లరకు ముఖ్యధర్మము.

---

## పదునాల్గవ ప్రకరణము.

దస్తగిరి సాహెబుతో రసూల్ఖాను మాటలాడుచుండు సమయమున గోపీనాథసింగ్ కామేశ్వరశర్మను బాలామణిని

దీసికొనివచ్చెను. ఒకతలగుడ్డను కామేశ్వరశర్మ మెడకుఁజుట్టి కుప్పఁ డీడ్చుకొనివచ్చి యఫ్‌జుల్ఖాను ముందు నిలిపెను.

గో—సాహేబుగారూ! ఇతఁడే కామేశ్వరశర్మ.

అ—రసూల్! వాఁడేదియైనఁ జెప్పుకొనవలసియుండినఁ జెప్పుకొనవచ్చునని వానికి వానిభాషలోఁ దెలుపుము. వానిమనవి వినకయే వానిని జంపరాదు.

రసూల్,—అటులనే వానినడిగెను,

కామేశ్వ—నేను మాటలాడునటుల నుద్దేశింపలేదు. భూతదయ పశ్చాత్తాపముల నెఱుఁగనివారిచేత నేను జిక్కితిని. నిరపరాధులగు బ్రాహ్మణుల నందఱనుజంపినట్టి మీరు నన్న వశ్యము చంపుదురని నాకుః దెలిసియే యున్నది. ఇటువంటి యుద్యోగములో నుండువారి కిట్టియాపద గలుగుట తప్పదు

దస్తగిరి (రసూలుతో)—వీఁడెట్టికార్యము లొనర్చుచుండెను?

రసూలాప్రశ్నను గామేశ్వరశర్మకుఁ దెలిపెను.

కా—నీమతస్థులకు నీవు గురువైనటుల మామతస్థులకు మేము గురువులుగా నుంటిమి.

దస్తగిరి—(అఫ్‌జుల్ఖానును జూచి) వీనినిగూడఁ జంపవలసినదే. కొరానులో నలువదియేడవ యధ్యాయములో నేమి వ్రాసియున్నది. "అన్యమతస్థులను జూచినంతట శిరచ్ఛేదము చేయవలసినది" అని యుండలేదా ?

కు—శాస్త్రులవారూ ! మీరు బ్రాహ్మణులరు. కనుక మీతలను నేను నఱుకను. అపనిఁ దురుష్కులే చేయుదురు. నన్నుఁజూచి బెదరనేల.

రసూ—ఆతనియుద్యోగధర్మమును క్రమముగానతఁడు

నెఱవేర్చుచుండెను అతనిఁ జంపుట సరికాదు. మీరు చెప్పినట్లు కొరానులోనుండదు. (తండ్రితో మీరితని మాటల వినరాదు).

అ—మన మతనివద్ద ననేకవిషయము లెఱుఁగవలసి యున్నది. మనవద్దనుండు సేవకులు మనపనులను జేయవలసినది న్యాయమేగదా. అటులనే యతఁడును యజమానుని పనుల నెఱవేర్చుచుండెను. వానికి సంకెళులు వేయుఁడు. బీజపూరునకుఁ బోయినతరువాత నవాబుగారే వాని విషయమును తీర్మానింపవలెను. వానితో నెవరును మాటలాడఁ గూడదు. వానియన్నము వాఁడే వంట చేసికొనవచ్చును.

బాలా—అమ్మా! దయయుంచి నన్ను విడిపింపుడు.

అ—నీవు పోవచ్చును. మాకు స్త్రీలతో నేమియుఁ బనిలేదు

బాలామణి పొంతటఁ గదలిపోయెను రసూలును వారిని విడిచి మజిలి వనజాక్షీ యుండుచోటికిఁబోయి, యామె తలిదండ్రులు చనిపోయిరని యామెకుఁ జెప్పెను. వనజాక్షీ మూర్ఛిల్లి కొంతసేపునకు సేదఁదేఱెను, రసూల్ఖానచటఁగొంత తడవుండి యామెనోదార్చి యామె నామెపినతల్లియింటికిఁబిలుచుకొనిపోయి వదలునటుల వాగ్దానముచేసి మరలఁ దనతండ్రి వద్దకు వచ్చెను. అప్పు డుదయమై నాలుగు గడియల ప్రొద్దాయెను. ఆవేళకు షోలాపూరి కేగుటకు సిద్ధపడునటుల యుద్ధభటుల కుత్తరువైనందున వారందఱును వంటపనులలో నుండిరి. అప్జుల్ఖానునకుమాత్ర మావేళకేభోజనమాయెను. రసూల్ఖాను త్వరితముగా భోజనముచేసి, "వనజాక్షీని బల్లకితోనే షోలాపురికిఁదీసికొని పోవలసినదని మాక్రింది యుద్యోగస్థులకుఁ దెలుపుము" అని యొక సేవకుని కుత్తరువు చేసెను ఆసేవకునిచేతనే

తన చెల్లెలైన "గయానా" పేరికి షోలాపూరికి జాబువ్రాసి, యందులో వనజాక్షినిమర్యాదతోఁగాపాడవలయునని గయానాకుఁదెలిపెను. అఫ్‌జుల్ఖా నేకాంతముగానుండు సమయమును గనిపెట్టి, రసూల్ఖా నతనికడకేగి తాను వనజాక్షిని విడిపించుట మొదలగు సంగతుల నతనికిఁ దెలిపెను. అప్పుడు ప్రహర్షింగచటికివచ్చి యఫ్‌జుల్ఖాన్‌వద్ద సెలవుదీసికొని, మరలివచ్చుచు రసూల్ఖానును బిలిచి "నాసేవకుఁడగు కుప్పడు నీవద్దఁగొలువు గొలువ వలయునని యాసపడుచున్నాడు. వాఁడు మిగుల నమ్మకముగా యజమానుని కొఱకుఁ గష్టపడును. వానికిఁ గావలసినది యన్నవస్త్రములు మాత్రమే. అనిచెప్పి యతని నందుకు సమ్మతింపఁజేసి, కుప్పని నాతని స్వాధీనమున వదలి, దనసేనతోఁగూడ స్వగ్రామమున కేగెను.

రసూల్ఖా నుత్తరువు చేసినప్రకారము వనజాక్షి పల్లకీ మీఁద నెత్తించుకొనిపోఁబడెను. తురుష్క యుద్ధభటుల గుంపులు తుల్ఖాపురివదలి షోలాపూరు మార్గమునుబట్టి పోవుచుండిరి అశ్వారోహకులు ముందుగాను, బదాతులు వెనుకను, బోవుచుండిరి. హతశేషులై యచ్చటచ్చట దాగుకొనియున్న పురజనులు, తురుష్క యుద్ధభటులు కదలుటఁగాంచి, యొకరొకరుగా మరలివచ్చి యిండ్లకుఁజేరిరి. రసూల్ఖాను సేనగదలిన తరువాత, గొంతతడవు తుల్జాపురిలోనుండి తన నూతన సేవకుఁడగు కుప్పని జానునాయని వద్దకుఁ బంపి, యతనివద్ద నున్నటుల నతఁడుచెప్పియుండిన పార్వతమ్మనగలమూటను దెప్పించుకొని, మహాదేవశాస్త్రిల సమాచారమును మరలఁ గలయ విచారించి,షోలాపూరి మార్గమునుబట్టి పోయెను.

రసూల్ఖాను గ్రింది యుద్యోగస్థులు కొందఱు వనజాక్షి

పల్లకితోడనే చనుచుండి, మధ్యాహ్నమున దారిలో నొక పల్లెలోఁ బల్లకిని నిలిపి, యొక బ్రాహ్మణునింట నామెకు భోజనముఁబెట్టించి మరలఁ బ్రయాణమై సాయంతనమున షోలాపూరునకామెనుఁజేర్చిరి. షోలాపూరులోపల గయానమొదలగువారు దిగియుండిన యింటివాకిట పల్లకి దింపఁబడెను. గయానామొదలగువారు వనజాక్షిని నింటిలోపలికిఁ బిలుచుకొనిపోయి మిక్కిలి యాదరముతో మాటలాడుచుండిరి. రాత్రి నాలుగుగడియల ప్రొద్దెక్కినంతనే రసూల్ఖాను షోలాపూరు చేరి తనచెల్లెలును మాఱుతల్లియును దిగియుండిన యింటికిఁ బోయి వనజాక్షినిఁజూచి,తాను దెచ్చినగలమూటను వనజాక్షి చేతికిచ్చి, యందులోని నగలు పార్వతమ్మ నగలని యామెకుఁ దెలిపెను వనజాక్షి యామూటనువిప్పినగలను జూచి, కన్నీరు గార్చుచు నిశ్చేష్టితురాలై యుండెను రసూల్ఖానంతట దన చెల్లెలి నామెకుఁ దోడుగానిలిపి, భోజనము చేయుటకుఁ బోయెను. రసూల్ఖాను భోజనము చేయుచుండునప్పు డొకభటుఁ డతనివద్ద కేతెంచి, యఫ్జుల్ఖానతనినిఁ బిలుచుచున్నాడని చెప్పెను. రసూల్ఖాను, భోజనానంతరమున దండ్రికడకేగెను. అప్పు డఫ్జుల్ఖానును దస్తగిరిసాహేబును వనజాక్షిని బీజపూరుకంపవలసినదనియు, బాలిసయునన్యమతస్థురాలునగుసుందరాంగి నవాబుగారి భోగస్త్రీలతోనే చేర్పఁబడ వలెననియు నొక్కివక్కాణించిరి. రసూల్ఖానున కామెయందను రాగముగల్గి యుండినందున, వారిమాటల కియ్యకొనక యామె తనచేతఁ బట్టుకొనబడి నట్టిదయినందునఁ దనయధీనయనియు, నామెను పినతల్లియింటఁ జేర్చునటుల వాగ్దానమునుఁ జేసియుండునటులను

వారికిఁ బ్రత్యుత్తరమిచ్చెను. అఫ్జుల్ఖాను తుట్టతుద కతని మాట కంగీకరించెను.

మఱునాఁడుదయమున నఫ్జుల్ ఖాన్ కామేశ్వరశర్మను తనయెదుటికి రప్పించి, యతని యజమానుఁడైన శివాజి యుద్దేశములను దెలుపుమని యడిగెను. అందులకుఁ గామేశ్వరయ్య శివాజికి నవాబుతో యుద్ధము చేయవలెననిగాని, నవాబు యొక్క రాజ్యములు పట్టవలెననిగాని, యుద్దేశము లేదనియు నాకాలమున శివాజీ యధీనమున నున్న ప్రదేశమున కాతని హక్కును, నధికారమును నవా బంగీకరించిన, నతఁడంత టితోఁ దృప్తిబొందుననియు, నఫ్జుల్ఖా వచ్చినసంగతి నెఱిగినతోడనే శివాజీ సమాధానమునకు వచ్చుననియుఁ జెప్పెను. మల్హార్ రావు వానిమాటలను తర్జుమా చేసి యఫ్జుల్ఖానునకుఁ బారసీక భాషలోఁ దెలిపెను. వనజాక్షిఁ దెచ్చినవిషయమును గురించి యఫ్జుల్ఖాను కామేశ్వరశర్మ నడిగెను. మహాదేవ శాస్త్రుల రెండవ భార్యకును, వనజాక్షికిని మాటిమాటికినిఁ గలహములు సంభవించుచున్నందున, వనజాక్షి నామె పినతల్లి యూరగు వాయులూరికిఁ దీసికొనిపోయి విడువుమని మహాదేవ శాస్త్రులు దన్నుఁ బ్రార్థించినందునఁ దా నామెను దెచ్చి నటులఁ గామేశ్వరశర్మ ప్రత్యుత్తరమిచ్చెను. అఫ్జుల్ఖా వాని మాటల నమ్మినందున, వానిని బీజపూరునకుఁ బంపవలసినదని దస్తగిరిసాహేబెంత చెప్పినను వినక, వానిసంకెళ్లను విడిపించి వానిని సేనతోఁగూడనే పిలుచుకొని పోవుటకు నిశ్చయించెను. నాఁటి మధ్యాహ్నముననే యఫ్జుల్ఖా, సేనతోడను, కుటుంబము తోడను శివాజి నివాసమగు ప్రతాపగిరికోటకుఁ బోవుటకు వెడలెను.

---

# పదునైదవ ప్రకరణము.

బాలామణి యఫ్జుల్ఖాను వద్దనుండి సెలవు దీసికొని
పోయినవెంటనే భవానీదేవ్యాలయమునకుఁ బ్రక్కనున్న తన
యింటికిఁ బోయెను. అచట నామెవస్తువులన్నియుఁ దురుష్క
యుద్ధభటులచేఁ గొల్లగొనఁబడియుండుటఁ జూచి, విలపించుచుఁ
బ్రక్కనఁ బూడ్చియుండిన ద్రవ్యమును ద్రవ్వి యెత్తుకొని, తా
నింక నచటనుండుట భద్రముగాదని యెంచి, శీఘ్రముగా బజా
రువీధికిఁ బోయి చేరెను. అచట జానునాయుఁ డామెను నెదురు
పడగా నతనినిఁ బార్వతమ్మ మొదలగువారి క్షేమమును
గుఱించి యడిగెను. వారందఱును చనిపోయిరని యతఁడు
ప్రత్యుత్తరమిచ్చెను. బాలామణి కామేశ్వరశర్మయం దనేక
దినములుగా బద్ధానురాగయై యుండి, యతనితో సహవా
సము చేయుచుండుటవలనఁ, దన యనురాగమున కాటంకముఁ
గలుగఁజేయుచుండిన వనజాక్షిని దురుష్కు లెత్తికొనిపోయి
యుండుటచేతనుఁ గామేశ్వరశర్మను మరలఁ జూచుట యుక్త
మనియెంచి, తానును షోలాపూరుకు వెడలిపోయెను. షోలా
పూరు నామె చేరువేళకుఁ గామేశ్వరశర్మయుఁ దురుష్క
సైన్యమును నాయూరు విడిచి పోయియుండెనుగాని, కామేశ్వ
రశర్మ విడిపింపఁబడి క్షేమముగా వారితోఁగూడ నున్న సంగతి
మాత్ర మామెకుఁ దెలిసెను. అందువలన బాలామణి తురు
ష్కసైన్యము పోయినదారిఁ బట్టి కొంత దూరము పోయిన
తరువాతఁ గామేశ్వరశర్మను గాంచెను. కామేశ్వరశర్మ
తనను బాలామణి వనజాక్షిని స్వాధీనపఱచు ప్రయత్న
ములలో సహాయపడునను నుద్దేశముతో నామెను మిగుల
నాదరముతోనే చూచుచుండెను. వనజాక్షి మిగుల భక్తి

యుక్తయగు స్త్రీయైనందునఁ, దురుష్కమతము నవలంబింప దనియు, నందువలనఁ దురుష్కుల బాధనుండి తప్పించుకొని పోవుటకు సిద్ధముగా నుండుననియుఁ, దా నామెను దీసికొని పోవుట కెడముండుననియుఁ గామేశ్వరశర్మ నమ్మియుండెను.

పార్వతమ్మయు గంగాబాయియు, నమావాస్య నాటి రాత్రి మూడుజాముల ప్రొద్దయినపిమ్మట, తమయింటి పెరటి త్రోవనేపోయి, జానునాయుఁడును నతని కుమారుఁడునుగూడ రాఁగాఁ దుల్జాపురికి సమీపముననున్న యొక కొండప్రక్కఁ జేరిరి అతఁడు తనకుమారుని వారికిఁ దోడుగావదలి మరలి తుల్జాపురికి వచ్చెను అతఁడును వారి నుదయమున నిచటినుండి పిలుచుకొనిపోయి, నాలుగుమైళ్ల దూరముననున్న సింధుపుర మను గ్రామమున వారి బంధువులయింట వదలి మరలివచ్చెను. మహాదేవశాస్త్రి రాత్రి తుల్జాపురిలోని కలవరము నుండి తప్పించుకొనిపోయి, యూరివెలుపల నొక మ్రాని మీఁద నెక్కి రాత్రియంతయు నచటనుండి, యుదయమునఁ దురుష్కసేన కదలుటనుజూచి మరల నింటికివచ్చి తనభార్యల పోకనుగుఱించి తనయింటి చుట్టుప్రక్కల నున్నవారిని విచారించి, తెలిసికొనలేక వగచుచుండెను. రెండుజాముల ప్రొద్దెక్కినతరువాత జానునాయఁడతనియింటికివచ్చి, యతనిభార్యలు సింధుపూరులో నుండుసంగతియుఁ దాను వారినిఁ గాపాడిన వివరమును దెలిపెను.

మహాదేవశాస్త్రులు అంతట మిగుల సంతసమునొంది, భోజనాది కృత్యంబులఁ దీర్చికొని, యొక మనుష్యుని సింధుపూరునకంపి, తనభార్యలనురప్పించుకొనెను. తనకూఁతుఁవిషయమును దెలిసికొనుటకై విశేష ప్రయత్నములు చేసెను

గాని కొన్నిదినములవఱకు నామెసంగతు లేవియు నతనికిఁ దెలిసికొనుటకు సాధ్యము కాకుండెను.

అఫ్‌జుల్‌ఖానుయుద్ధయాత్ర మిక్కిలి సుఖకరమైనదిగా నుండెను. దినమునకుఁ బదిమైళ్ళదూరమునకు మించి సేన నడచుటలేదు. ఒక్కొక్కగ్రామమున సామగ్రి పుష్కలముగా దొరకుచుండెను. ఎత్తుడంగడులు కొన్ని కావలసిన సామగ్రులతోడనే, పోవుచుండెను. కొద్దిదినములకు మునుపే కొంత వర్షము కురుసియుండినందున దారిలోఁ బశువులకుఁ బచ్చికయు, నీరును సమృద్ధిగా దొరకుచుండెను.

వనజాక్షి పినతల్లియూరు ప్రతాపగిరికి సమీపమున నున్నందున నామెయు సేనవెంబడిని బల్లకిమీఁద నెత్తుకొనిపోఁబడుచుండెను. వనజాక్షికి రసూల్‌ఖానుమీఁదను, రసూల్‌ఖానునకు వనజాక్షిమీఁదను నానాటికిఁ బ్రేమవృద్ధియగుచుండెను. రసూల్‌ఖాను చెల్లెలైన గయానాకు మహారాష్ట్రభాష తెలిసియున్నందునను, వనజాక్షి, హిందువుల వాడుకల గయానాకుఁ దెలుపుటతోను, దురుష్కులవాడుకలామెవద్ద వినుటతోడను, బ్రొద్దుపుచ్చుచుండెను. వనజాక్షియెడల వారందఱును విశేష గౌరవము నాదరణయుఁ గనబఱచుచుండిరి. బ్రాహ్మణుఁడొకఁడు నీళ్లు తెచ్చుటకును వంటపనులలో సహాయపడుటకును, నియమింపఁ బడెను. అఫ్‌జుల్‌ఖానుగూడ నామెచే వండఁబడిన వంటకములనుఁ దెప్పించి, భుజించి, వంటనేర్పును మెచ్చుకొనుచుండెను. వనజాక్షికిఁ గావలసిన పుస్తకముల వారు తెప్పించి యిచ్చిరి ఆమె భగవద్గీత మొదలగు పుస్తకముల నిత్యమును జదువుచుండెను. దస్తగిరి సాహేబు మొదలగువారు తురుష్కమతోత్కృష్టత నామెకు బోధించుటకు వచ్చి యామెతో

వాదముచేసి, తుట్టతుద కామెకు సమాధానము చెప్పలేక, యామెచెప్పు మాటలకే యంగీకరించి పోవుచుండిరి ఆమె చెప్పు నట్టిపనులఁ జేయుటకు భటులనేకు లామెవద్దనే కాచుకొని యుండిరి. ఢిల్లీ చక్రవర్తులను రసపుత్ర స్త్రీలు పెండ్లి చేసికొని నటుల రసూల్ఖానును వనజాక్షిఁ బెండ్లి చేసికొనిన బాగు గానుండునని గయానాపల్కినపుడు వనజాక్షి మాఱుమాట లాడక యూరకుండెను.

పదునాఱవ ప్రకరణము.

అఫ్జల్ఖా నొకనాటిసాయంకాలమునఁ దనకుటుంబము వారితోను గొంతపరివారముతోను ముందుగా వెడలి, సమీప గ్రామమున రాత్రియు మఱునాఁడును బసచేయుట కుద్దేశించి పోవుచుండెను. కామేశ్వరశర్మయు వారితోడనే పోవు చుండెను. సైన్యమంతయు మఱునాఁ డటఁ జేరి మూఁడవనాఁటి యుదయమున మరలఁ బ్రయాణ మొనర్చునటుల నేర్పాటుఁ జేసికొని యుండిరి. అపుడు కృష్ణపక్ష మైనందున రాత్రి ముంజామున వెన్నెలలేకుండెను కామేశ్వరశర్మ యాసందర్భ ములను గనిపెట్టి వనజాక్షి పల్లకిని మోసికొనిపోయెడి బోయీ లకు ధనమిచ్చెదనని యాసచెప్పి, వారిని దన కైవసము చేసి కొని, వనజాక్షి పల్లకిని మిగత పల్లకీలకు వెనుకఁ జనునటులఁ జేసి రాత్రికొన్నిగంటలయిన తరువాత దారిప్రక్కనున్న యొకపల్లెలోపలికి వనజాక్షిని బల్లకితోఁగూడఁ దెప్పించెను. బాలామణియుఁ గామేశ్వరశర్మయు, ముందుగానిటులఁ జేయ వలయునని యోజించియుండిరి. బాలామణి యాపల్లెలోనికి ముందుగాఁ బోయి, యచట నొక యింటినద్దెకు మాటలాడి

స్వాధీనపఱచుకొని దానిలోపల నెవరును లేకుండఁ జేసిపెట్టి యుండెను. కామేశ్వరశర్మ పల్లకితోకూడ నాపల్లెలోనికిఁ బోవువేళకు బాలామణి యెదురుపడి, తాను మాట్లాడిన యింటివాకిటికి వారినిఁ బల్లకితోడఁ జేర్చెను. ఆవాకిటికిఁ జేర్పఁబడిన వెంటనే పల్లకీ తెఱువఁబడెను బాలామణి ముందుగా నింటలోని కేగెను. ఒక స్త్రీయింటివాకిటినుండి వన జాతీని లోపలికిఁ దీసికొనిపోయి వదలి, పెరఁటిత్రోవనే పోయెను. కామేశ్వరశర్మయు వెంటనే లోపలికిఁ బ్రవేశించెను. బాలామణి వారు లోపలికిఁ బ్రవేశింపఁగనే వాకిటితలుపును పెరటితలుపును మూసెను. దీపమొకటి యాయింటి కూట ములో నంతకు మునుపటినుండి వెలుగుచుండెను. వనజాతీ కాయింటిలోఁ బ్రవేశించుపఱకు నేమాత్రమును సందియము దోఁచలేదు. కామేశ్వరయ్యను జూచినంతట నామెకు భయ మును గలవరమును గలిగెను.

కా—వనజాతీ, ఇఁక నెటులఁ దప్పించుకొనగలవు? నవాబుగారి సేనాధిపతి స్వాధీనములో నున్నపుడు నీవు శివలిం గముమీఁదఁ బొలుకవలె నుంటివి. దైవాధీనముగా నేఁడు నీవునాచేఁ జిక్కితివి. ఇప్పుడు మన యిరువురనడుమ వచ్చు వారు లేరు. మీతండ్రియు, మీతల్లియుఁనా చెల్లెలును బరదేశ మున నున్నారు. రసూల్ఖానును దూరములో నున్నాఁడు.

బాలామణి—(వనజాతీ యెదుటికివచ్చి) వనజాతీ నీవంటి బ్రాహ్మణస్త్రీకిఁ దురుష్కుని సాంగత్యముకంటె బ్రాహ్మ ణుని సహవాసము మేలు కాబట్టి యతని కడ్డుపల్కకుము.

కామే—బాలామణీ! శీఘ్రముగా కాలువ నెత్తుము.

ఆమె యరచుట కారంభించెను.

వనజాక్షి గట్టిగా విలపించుచు హా, దైవమా, పరమేశ్వరీ, దుర్గాంబా, అనాధరక్షకీ, అమ్మా అనెను.

కామేశ్వరశర్మయు బాలామణియు వనజాక్షిని బట్టి క్రిందఁద్రోచి, చేతులఁ జేర్చికట్టి ఒక చిన్నగుడ్డను ఆమె నోటి కడ్డముగాఁబెట్టిరి. అప్పుడు వనజాక్షి కూఁతలు వీధికి వినఁబడినందున నొక పెద్దమనుష్యుఁ డాయుధపాణు లగు భటులతో నావీధిని పోవుచుండి, కూఁతలవిని, తటాలునభటులతో నాయింటిలోపలికిఁబ్రవేశించి, కామేశ్వరయ్య చేతులను వెనుకనుండి పట్టుకొనెను. మనుష్యులు లోపలికి వచ్చుట జాడదెలిసి బాలామణి యంతలో దీపమునార్చి పెరటివైపు పరుగెత్తెను. ఆయుధపాణులగు భటు లిరువురు కామేశ్వరశర్మను జుట్టుపట్టి యీడ్చుకొనిపోయి స్తంభమునకుఁ గట్టి వనజాక్షి చేతికట్లనువిప్పి నోటిగుడ్డను దీసిరి. అపుడు వాకిటినుండి యొక భటుఁడు దివ్విటీతో లోపలికిఁ బ్రవేశించెను ఆపెద్దమనుష్యుడు, వెలుతురులోఁ గామేశ్వరశర్మ ముఖమును బాగుగాఁ జూచి, యతనిని విడిపింపుఁడని భటులకుఁ జెప్పెను వనజాక్షి యామాటవిని సాష్టాంగముగా నా పెద్దమనుష్యునకు నమస్కారముచేసి విలపించుచుఁ దన సమాచారమంతయుఁ దెలిపి, కాపాడుమని ప్రార్థించెను.

ఆ పెద్దమనుష్యుడు కామేశ్వరశర్మనుజూచి "ఓరిపాపీ, నీచా, అధమాధమా, చండాలా, ద్రోహి, నీకిట్టినడత తగదని యెన్నిమారు లెందరు చెప్పియుండిరి. ఇప్పటికిని నీకు బుద్ధి రాకపోయెనా? బ్రాహ్మణస్త్రీని, నీ చెల్లెలిని వివాహము చేసికొనిన బ్రాహ్మణుని కూతురి నిటుల బలాత్కారముగా చేయఁబూనితివిగా! ఛీ, నీముఖము చూచుటయే పాపము.

కా—లేదు. ఆమెను తురుష్కుల స్వాధీనమునుండి విడిపించితిని. ఆమె నామె పినతల్లి యింటికిఁ బిలుచుకొనిపోవు టకు నేను ప్రయత్నము చేయగా నామె యందు కడ్డము చెప్పి కూఁతలు పెట్టెను. ఇంతయే జరిగినది.

వ—అబద్ధపు మాటలు. నన్ను వారి బారినుండి తప్పించి మీయింటికిఁ దీసికొనిపోతిరేని నేను నాసంగతి నంత యు వివరముగాఁ జెప్పెదను. మా పినతల్లి యింటికిఁ బోవుటకు నా కాక్షేపణ లేదు.

పెద్ద—అమ్మా, భయపడకుము. నీవు నాతోఁగూడ నాయింటికి రమ్ము. నేను నా మనుష్యులను నీకుఁ దోడిచ్చి, నీ పినతల్లి యూరగు వాయులూరి కంపెదను. మీతండ్రిని నే నెఱుఁగుదును. రమ్ము, పల్లకి వాకిటనే యున్నది. (కామేశ్వరయ్యను జూచి) నీ నడతనుగుఱించి శివాజీమహా రాజునకుఁ జెప్పెదను. అతఁ డిపుడు మునుపటివలె లేఁడు; దుర్మార్గులగువారిని దండించుచున్నాఁడు. ఆమె జోలికి వచ్చిన నీకాపద వెంటనే గలుగును. జాగ్రతగా నుండుము. ఇటులపల్కి వనజాక్షినిఁ బిలుచుకొనిపోయి, పల్లకిమీఁదఁ బెట్టి, పల్లకిని దనయింటికిఁ దీసికొనిపోయెను. ఈ పెద్దమను ష్యునిపేరు నాగరాజరావు ఇతఁడు శివాజీచేత రాయబారపు మాటలాడుటకు నఫ్జుల్ఖాన్ వద్దకుఁ బంపఁబడి, యాపల్లెకుఁ బ్రక్కపల్లెలో విడిసియుండెను. నాగరాజరావు గృహమున సుమారు ముప్పదియాఱు సంవత్సరముల వయస్సుగల యొక విధవయు సుమారు ముప్పది సంవత్సరముల వయస్సుగలముత్తై దువయునుండిరి. నాగరాజరా వింటికి వచ్చినతోడనే వనజాక్షి

నటపదలి బైటికిఁబోయెను. అప్పు డావితంతువు ముత్తైదువను జూచి యిట్లనియె.

వి—వెంకుబాయీ, ఇదియెవతె; మనయింటికిఁ గ్రొత్తగా వచ్చియున్నది.

వెం—వదినా, ఈమె తుల్జాపురి మహాదేవశాస్త్రుల కూఁతురఁట. వితంతువఁట ఆయన నాతో నీసంగతిఁ జెప్పి యాదరముతో నామెను జూడవలసినదని యుత్తరవు చేసెను.

వి—బహులక్షణము, విధవముండ యేమి? ఈశృంగార మేమి? ఈతలవెండ్రుక లేమి. దీనినిఁ జూడఁగా భోగముదాని వలెనున్నది ఇటువంటిదానిని మన యిండ్లలోఁ జేర్చుటే తప్పు.

వ—అమ్మా, నేనొక దిక్కులేని యనాథను. నామనుష్యులందఱును జనిపోయిరి. నామీఁదఁ గృపయుంచి నన్నాదరింపుఁడు. నాకు దైవమేతోడు. వేఱుదిక్కు లేక నేను మీశరణుఁ జొచ్చితిని. రక్షింపుఁడు.

వి—నీపేరేమి?

వ—నాపేరు వనజాక్షి.

వి—నీ వింతదూరము ఒంటరిగా నేలవచ్చితివి ? వివరముగాఁ దెల్పుము.

వనజాక్షి తన వృత్తాంతమంతయు నామూలాగ్రముగా నామెకుఁ దెలిపెను. నాగరాజరావును వారు మాటలాడుచుండఁగా నచటికి మఱల వచ్చి యావృత్తాంతమంతయు విని మిగులఁ బశ్చాత్తాపమొందెను. అతని భార్యయగు వెంకుబాయిగూడ వ్యసనముం గనఁబఱచెను. అతని చెల్లెలగు నావిధవమాత్ర మామెయం దసూయతనే చూపెను.

విధ—అన్నా, ఆమె మన యింటిలోనుండెడి పక్షమున

నామె నావలెనే తల బోడిచేసికొని, రుద్రాక్ష తావళము వేసికొని విభూతి పూసికొని, కృష్ణా, రామ, గోవింద యని చెప్పుకొనుచు నింటిపనులఁ జేయుచుండవలెను ఆచార నిష్ఠలతో మెలఁగవలెను. అటుల లేని పక్షమున నామెను మన యింటఁ జేర్చుట తప్పు. ఇందుల కామె సమ్మతింపకున్న నామెను మరలఁ దురుష్కుల వద్దకే పంపుము; లేకున్నఁ గామే శ్వరశర్మ కొప్పగించుము

వ—అంతకంటెఁ జావు మేలు.

వి—ఇట్టి యనాచారపు బ్రతుకుకంటెఁ జావుమేలు. నీవలన బ్రాహ్మణజాతికంతయుఁ జెడ్డపేరు వచ్చును.

నాగ—నోరుమూయుము. ఇట్టి బిరుసుమాట లికనాడకుము. ఆమె నా కుమార్తెయే యని నేను భావించి యున్నాను. ఆమె కన్నపానాదులఁ జక్కగా విచారింపుఁడు.

వనజాక్షి వారింటనే యుండెను. వెంకుబాయిమాత్రము మిగుల నాదరణతో నామెను జూచుకొనుచుండెను అచట వనజాక్షి యగుపడకుండుటకు గయానా మొదలగు వారు వ్యసనపడుచుండిరి. మఱునాఁడుదయమున నాగరాజరావ్ అఫ్జుల్ఖానుసభకేగి జరిగిన వృత్తాంతమంతయుఁ దెలిపెను అఫ్జుల్ఖాను మొదలగువారు వనజాక్షిని మరల దమవద్దకుఁ బంపవలయునని యడుగుట ధర్మము కాదని యూరకుండిరి.

## పదునేడవ ప్రకరణము.

పడమటి కనుమలు మహారాష్ట్రిల కపుడునికిపట్టుగా నుండెను. షాహాజీ కుమారుఁడగు శివాజీమహారాజు మహారాష్ట్రిలకెల్ల నపుడు నాయకుఁడుగా నుండెను. అతని తల్లి

పేరు జీజీభాయి. ఇతఁడు సుమారు పదునాలేండ్ల ప్రాయము వాఁడుగా నుండునపుడు తనకు సమవయస్కులగు బాలురను గూర్చుకొని యనేక సాహసకృత్యంబు లొనర్చుచుండెను. సుమారిరువదియేండ్ల ప్రాయమువాఁడైనప్పుడు చుట్టుప్రక్కలఁ బల్లెలలో నున్న తనయీడు బాలురనుఁ జేర్చుకొని చుట్టుప్రక్కల పల్లెలవారి వద్దఁ గొంత ధనమును వసూలుచేసి వెచ్చమున కుంచుకొనుచుఁ జుట్టుప్రక్కల పల్లెలవారికి దొంగలవలన భయము లేక వారి సొత్తులను గాపాడుచుండెను. ఇతనికి భవానీదేవి యప్పుడప్పుడు కలలో నగపడుచుండెననియుఁ జెప్పుచుందురు. ఇరువది సంవత్సరముల వయస్సులోనే యితఁడు మావలీలు, హెత్కాలీలను రెండు తెగలను మహారాష్ట్రుల తన స్వాధీనమున నుంచుకొని సుమారు రెండువేల జనమును జేర్చికొని తురుష్కుల స్వాధీనమందున్న టోర్ని యాయను కోటను పట్టుకొనెను. పిమ్మట కొంచెము కొంచెముగాఁ జుట్టుప్రక్కలనున్న దేశమును తురుష్కుల పాలననుండి తొలగించి, తన స్వాధీనమున నుంచుకొనెను. ఇతఁడు తనపైఁ దురుష్క ప్రభువులచేఁ బంపబడిన సేనలనన్నిఁటిని బలుసారు లోడించెను. తురుష్కుల పాలనలో హిందువులకు బాధ మిక్కుటముగా నుండినందునను, వీరుండు స్థలము తురుష్కుల ముఖ్యపట్టణమునకు దూరముగాఁ గనుమలనడుమ నుండుటచేతను, శివాజీ పరివారము నానాఁటికి వృద్ధియాయెను. ఇతనికి ముప్పది సంవత్సరముల వయసగువేళకు (ఈకథాకాలమందు) నితని క్రింద రమారమి యాఱువేలయుద్ధభటులుండిరిచుట్టుప్రక్కలదేశములలోనుండు మహారాష్ట్రులను జేర్చుకొని. తురుష్క ప్రభుత్వమునుండి దక్షిణహిందూదేశమును విడిపింపవలయుననియే యితనికి ముఖ్యాభి

ప్రాయము. అందువలననే యితఁడు తన స్నేహితుఁడగు తన్నాజీని తుల్జాపురికిఁ బంపియుండెను. తన్నాజీ తుల్జాపురిలోఁ చేసిన కార్యములను మునుపు చెప్పియుంటిమి గదా.

1658-వ సంవత్సరమున నవరాత్రి దినములలో, మహారాష్ట్ర సైన్య మెంత సంఖ్య యేర్పడునది తెలిసికొని తురుష్క ప్రభువులపై యుద్ధయాత్ర నొనర్చుట కేర్పాటులు చేయవలెనని శివాజీ యుద్దేశపడినందున, తన్నాజీ తుల్జాపురికి పంపఁబడెను తురుష్కపాలకులు తమ రాజ్యములో హిందూ దేవాలయముల విడియఁగొట్టుచు, హిందువుల సొత్తులను కొల్లఁగొట్టించుచు, హిందువుల దేవాలయములలో ననేక ఘోరకృత్యము లొనర్చుచు, హిందువుల ననేక విధములుగా హింసించుచు నున్నందున, బహు హిందువులు శివాజీకి యుద్ధయాత్రలో సహాయపడుటకు సిద్ధముగా నుండిరి.

హిందువుల నందఱ నొకటిగాఁ జేర్చి, తురుష్క ప్రభువుల కొండొరులకు విరోధముఁ గల్పించి, తగు సమయముఁ గని పెట్టి తురుష్క ప్రభుత్వమును బో. గొట్టవలెనని శివాజీ యోజించియుండెను. ఔరంగజేబు చక్రవర్తి బీజపూరు నవాబుపైకి సేనపంపుటయు, బీజపూరులో మంత్రికిని నవాబునకును భేదము గలుగుటయు, 1657-వ సంవత్సరమునఁ దటస్థించినందున, దురుష్క ప్రభుత్వమును దక్షిణహిందూస్థానమున లేకుండఁ జేయుట కది మంచి సమయమని యోచించి, మహారాష్ట్రుల నొకటిగాఁ జేర్చి, తురుష్కులపై దాడి వెడలుటకు శివాజీ సిద్ధపడి యుండెను.

బీజపూరుమంత్రి చనిపోవుటయుఁ, దనకుత్రులు నవాబు కెలుకపడుటయు, అఫ్జుల్ఖాఁ తనపై దాడివెడలుటయు,

శివాజీకిఁ జారులమూలముగాఁ దెలిసెను. తుల్జాపురిలో జరిగిన ఘోరకృత్యములు శివాజీ కదివఱకుఁ దెలియలేదు. తన్నాజీ యదివఱకును మరలిరాలేదు అఫ్జుల్ఖాన్ శీఘ్రముగాఁ దన చెంతకు వచ్చునని మాత్రము శివాజీకిఁ దెలిసియుండెను. అందువలన దానికిఁ దగు జాగ్రత పడవలెనని సమీపప్రదేశంబుల నున్న మహారాష్ట్రుల నందఱిని ప్రతాపగిరి కొకనిర్దిష్ట దినమున రావలయునని యుత్తరువుచేసి మనుష్యులను బంపెను.

ఆనిర్దిష్టదినంబునఁ బిలిపింపఁబడిన మహారాష్ట్రులందఱును ప్రతాపగిరి కోటకు గుంపులుగుంపులుగా వచ్చుచుండిరి. ప్రతాపగిరి కోటకొండకుఁ బైప్రదేశంబునను ప్రతాపగిరియను పల్లెయొకటి కొండకుఁ గ్రిందను నుండెను. పల్లెనుండి కోటకు దారియొకటి యేర్పడియుండెను. ఆ దారికిరుకెలంకుల గొప్ప వృక్షములు పుష్పశోభితములై యుండెను ఈ మార్గమున నుదయము మొదలు మహారాష్ట్రులు నడుచుచునే యుండిరి. ఈమహారాష్ట్రులు దృఢశరీరము గలిగినవారును, ఎఱ్ఱని దేహచ్ఛాయ గలవారును, గొంచెము పొట్టివారును నై యుండిరి. ఒక్కొక్కమనుష్యనకును కుడిభుజముమీఁదఁ దుపాకియును నెడమభుజముమీఁదఁ నొరలోనుంపఁబడినపొడవైనకత్తియును, నడుమున కిరుప్రక్కలఁగట్టఁబడిన చిన్న బాకులును,వీపునఁ గట్టఁబడిన డాలును నుండెను. బయట యుద్ధయాత్ర వెడలుటకు మునుపిట్టి సభలను జేర్చుట శివాజీకివాడుక; గనుక దామిఁకఁ దురుష్కులపై యుద్ధయాత్ర వెడలవలసి యుండుననియు, మహమ్మదీయుల సొత్తులను గొల్లగొట్టుటవలన విశేష ధనలాభము గలుగుననియు నిశ్చయించికొని, యుద్ధమునకుఁ గట్టాయితులై వారు వచ్చిరి.

శివాజీ యుదయమునుండి తన సభామంటపములో నున్నతమైన యొక సింహాసనముపైఁ గూరుచుండి యుండెను. ఈసభామంటపము పొడవైన స్తంభములమీఁద పూరికప్పు గలిగినది. సింహాసనముక్రింద శివాజీకి విశ్వాసపాత్రులుగా నుండు మహారాష్ట్రులు చుట్టుకొని కూరుచుండియుండిరి నాఁటి సభకు వచ్చిన మహారాష్ట్ర ముఖ్యులందఱును శివాజీ చెంతకువచ్చి నమస్కారము లొనర్చి పోవుచుండిరి. తనకు నమస్కార మొనర్చిన వానియొక్క యోగక్షేమములను శివాజీ విచారించుచుండెను ప్రతిమనుజునితోడ నాదరణముతోఁ జల్లగా మాటలాడుచుండెను. గాని యతని ముఖముమాత్రము విన్నఁబోయి యుండెను.

శివాజీ పొట్టిమనుష్యుఁడు. ఇతని ముఖమున గాంభీర్యమగుపడకయే యుండును అతఁడు కొంచెము నల్లనైన వర్ణము గలవాఁడు. పొడవైన ముక్కును, పెద్దకన్నులును, చిన్న గడ్డమును సన్ననై కొనలలో వంకరగాఁ దిరిగియుండిన మీసములును నతనికినుండెను. అతఁడు దృఢమైనశరీరముగలవాఁడు. అతఁడు, తన రాజకీయ వ్యవహారము లన్నిటిని దనతల్లికిఁ జెప్పి, యామె యోజనప్రకారము చేయుచుండుట వాడుక. కనుక నతఁడు నాఁటి మధ్యాహ్నమున సభకూడుటకు ముందుఁ దన తల్లి జీజీభాయియుండిన గదికేగెను. శివాజీ, యాగదివాకిట తలుపుప్రక్కనఁ గూరుచుండియుండిన తనతల్లి పాదములపైఁ బడి, సాష్టాంగ దండప్రణామ మాచరింపఁగా నామె వానిని లేపి, ప్రక్కనఁ గూరుచుండ నియోగించి, తన్నాజీవచ్చిచేరెనా యని యడిగెను.

శి___అమ్మా! తన్నాజీ యిదివరకును రాలేదు. అందు

వలననే నామనసు మిగులఁ గలవరములో నున్నది. నీ వమ్మ వారి సన్నిధికిఁ బోయియుంటివా? కర్తవ్యములగు పనులను గుఱించి యమ్మవారు నీకేమైనఁ దెలిపియుండెనా ?

జీ__ఆమెమన సెటులఁ దెలియును? మనమామె చేతియాయుధములము. అధైర్యపడకుము; కష్టము వచ్చినపుడు ధైర్యము వదలఁగూడదు. 'ధైర్యంసర్వార్థసాధకం' అనియును 'సాహసాద్భజతే లక్ష్మీః' యనియును బెద్దలు చెప్పుట వినియుండలేదా?

శి__బీజపూరు సంస్థానమంత్రి చావువలన నాయాసలన్నియు నడియాసలైనటులదోఁచుచున్నది. నామిత్రులన్నియు బహిరంగమైనవి.

జీ__మంత్రి యుండుటవలన నీ కేమియు లాభముండి యుండదు. తిన్నయింటికిఁ జెఱుపుచేసినవాఁడు నమ్మఁదగినవాఁడా? (నిదానించి) నేనమ్మవారిఁగుడికి నేఁటిరాత్రి పోయి, యేకాంతముగా నామెను బ్రార్థించి, యామెను ప్రత్యక్షము చేసికొని మాట్లాడెదను. నీవొకరితోను యోచన చేయక నీకు నీవే యోచించి కర్తవ్యమును నిర్ధారణ చేయుము 'ఆత్మబుద్ధి స్సుఖంచైవ' అనుమాటను నమ్మి పనిచేయుము. తంత్రము వలననే ప్రబలశత్రువుల జయింపవలెను.

శి__వారు నన్ను నమ్మిన నేను వారిని స్వాధీనపఱచుకొనవచ్చును. జయమును బొందవచ్చును. నావలన సాధ్యమయిన ప్రయత్నముల నేఁజేసెదను; నేను సెలవు దీసికొనెదను. నాకు దీవెనలిచ్చి నన్నుఁబంపుము.

జీ__నీకు మాహేశ్వరి జయమొసఁగు గాక.

శి__ "అమ్మాపోయెద" నని సభామంటపమునకు మరలిపోయెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

శివాజీ, సభామంటపమునకుఁ బోయినవెంటనే యా కొండమీఁదనుండుదుర్గాదేవ్యాలయములో దేవికిఁ బూజార్చనాభిషేకములు జరపించవలసినదని బ్రాహ్మణుల కుత్తరవుఁబంపెను. సభకు వచ్చినవారందఱును మఱునాఁడుఁగూడ నచటనే నిలవవలసినదనియు, మఱుచటి దినముననే రాజకీయ వ్యవహారములను గుఱించిన యోజనలు జరగవలసినదనియు శివాజీ వచ్చినవారి కందఱకును దెలిపి, వారికందఱికి భోజనమునకేర్పాటులు చేయించెను.

నాఁటిరాత్రి సుమారు జాముప్రొద్దెక్కిన తరువాత శివాఁజీ తన స్నేహితులతోడ మాటలాడుచు సభామంటపమునఁ దన స్థానమున నుండఁగా తన్నాజీయొక గుఱ్ఱముమీఁద స్వారిచేయుచువచ్చి మంటపమునకు ముందట గుఱ్ఱముపైనుండి దిగి, గుఱ్ఱము నొక సేవకునకు వదలి, మంటపము లోనికిఁ బ్రవేశించెను. శివాజీ యతనిఁ గాంచినతోడనే, యెదురేగి కౌఁగిలించికొని, తోడితెచ్చి తన సింహాసనమునకుఁ బ్రక్కన నొకబల్లపైఁ గూరుచుండ నియోగించి, బయటి విశేషములను దెలుపుమని వేడెను.

తన్నాజీ___నేను నీకుఁ దెలుపఁగల సంగతి విచారకరమైనదిగా నేయున్నది. అఫ్జుల్ఖాన్ తురుష్క సైన్యముతో దండెత్తి, తుల్జాపురినిముట్టడించి, యనేక బ్రాహ్మణుల వధించి, దేవ్యాలయములోఁ బ్రవేశించి, దేవీ విగ్రహమును క్రిందఁద్రోసి, గోరక్తమును మూలస్థానమునఁ జల్లి, యచటి నగలను కొల్లగొని, హిందూజనమును బలుతెఱఁగుల బాధించెనఁట. సుమా

రిరువదివేల సేనతో నఫ్జుల్ఖా నిపుడు ప్రతాపగిరిపై యుద్ధ యాత్ర వెడలి వచ్చుచున్నాడు. కర్తవ్యమును యోజించి జాగ్రతపడుము.

శివాజీ—శివాజీ బ్రతికియుండగానే యింతటి కార్యములు జరిగెనుగదా ఇంతటి ఘోరకృత్యము లొనర్చిన తురుష్కులను జంపకుండిన మన జన్మమే వ్యర్థము; మన బ్రతుకే పరిహాసాస్పదము. సమరమున వారిచేఁ జచ్చినను వారిని జంపినను కీర్తికలుగును. (నిదానించి రహస్యముగా) మన స్వాధీనమున నిపుడు సుమా రయిదువేల సేనయున్నది; ఈసేన వారి నెదిరించి జయించుటకుఁ జాలదు. కపటోపాయము వలన వారి నిటకు రప్పించి, వారలు పరాకున నుండునటులఁ జేసి, తటాలునఁ బైఁబడి వారిని ధ్వంసము చేయుటకైన నీ సేన చాలును.

తణ్ణా—అటులనే యొనర్చవలెను. మనము ముందుగా నాగరాజరావును ననుచరులను గొందఱను నఫ్జుల్ఖానువద్దకు రాయబార మంపవలెను

శి—నాగరాజరావ్! నీవనుచరులతోఁ గూడ నఫ్జుల్ఖా సభకేగి, నేను వారికిలోఁబడుటకు సిద్ధముగా నున్నాననియు, నాయెడఁ గృపనూని కొన్ని యేర్పాటులు మాత్రము వారు చేయవలసినదనియు, ఆయేర్పాటులను నేను సమక్షములో నతనితో నేకాంతముగాఁ దెలుపుదుననియుఁ జెప్పుము. శీఘ్రముగా వెడలుము.

శివాజీ యటుల నుత్తరువు చేసిన తోడనే నాగరాజరావు నఫ్జుల్ఖాను దగ్గఱకువచ్చి, యా సంగతుల నన్నిటిని దెలిపెను. అంతట నఫ్జుల్ఖా తానొక మనుష్యుని శివాజీ

పద్దకుఁ బంపెను. ఆమనుష్యునిపేరు శేషగిరిరావు. ఇతఁడు మిగులనొడ్డును బొడువును గలిగిన యొజ్జసిచాయగల బ్రాహ్మణుఁడు. ఇతనికి విశాల నేత్రములును, గంభీరాకారమును, సూక్ష్మబుద్ధియుగలదు ఇతడు ప్రతాపగిరికివచ్చి చేరినతోడనే శివాజీయుత్తరువుమీఁదఁ గొందఱు బ్రాహ్మణు లితని కెదురేగిస్వాగతం బొసంగిరి. కొందఱు బోయీలు పల్లకి నొకదాని నెత్తుకొని పోయి, యతనిని దానిలోఁ గూర్చుండఁబెట్టి ప్రభువు వద్దకు రమ్మని వేఁడిరి. కొందఱు మహారాష్ట్ర ముఖ్యులు మేళతాళములతో నెదురేగి యతనికిఁ బూలదండలు వేసి మరియాదచేసి యతనినిబల్లకిమీఁదనే యుంచి శివాజీయుండు సభామంటపమునకుఁ బిలుచుకొని వచ్చిరి ఈ రాయబారము తెచ్చినబ్రాహ్మణుఁడు దన పరివారముతోఁ గూడ సభామండపము చేరినతోడనే శివాజి యతనికి గంధపుష్పతాంబూలాదు లొసఁగి మిగుల మరియాదచేసెను. అంతట శివాజీక్రింది యుద్యోగస్థుఁ డొకఁడు లేచి, బీజపూరు నవాబున కెదురుగా యుద్ధము చేయుటకు శివాజీకి బలముగాని, యిష్టముగాని లేదనియు, నవాబుగారు కోరినయెడలఁ దనసొత్తంతయు నిచ్చుటకు శివాజీ సిద్ధముగా నుండునట్లును, దనయొక్క కష్టములను గురించి మాత్రము తానప్జుల్ఖానుతోఁ గొన్నిమాట లేకాంతముగాఁ జెప్పవలసియున్నదనియు శివాజీ దెలిపినట్లు పల్కెను. ఆ రాయబారము తెచ్చిన బ్రాహ్మణుఁ డీసంగతి నప్జుల్ఖానునకుఁ దెలుపునటులఁ జెప్పెను. ఆబ్రాహ్మణుని కేకాంతముగానుండుట కొక యిల్లును నతని యనుచరుల కొకయిల్లును బస కుదిరింపవలయు నని శివాజీ తనక్రింది యుద్యోగస్థులకు త్తరవు చేసెను. అటులనే వారలకు బస లేర్పఱుపఁబడిన పిమ్మట వారాబసలకుఁ

గొనిపోఁబడిరి. రాయబారము తెచ్చిన శేషగిరిరావునకు శివాజీ యింట పురోహితునింట బసయేర్పఱుపఁబడెను. శివాజీ నాఁటి రాత్రి జాముప్రొద్దెక్కిన తరువాత, ముఖమంతయు విభూతి పూసుకొని, నోటిని గడ్డమును దౌడలను గొంత మూసికొను నటుల నొక చేతిగుడ్డనుముఖమునకుఁ జుట్టుకొని, కొంద అను చరులతో బయలు వెడలి శేషగిరిరావు బసకుఁబోయి చేరెను. అప్పుడచట బయటనున్న పురోహితునిఁగని, శివాజి ప్రభువు వద్దనుండి యొకమనుష్యుఁడు శేషగిరిరావుతో మాటలాడుటకై వచ్చియున్నటుల నతనికి దెలుపుమని శివాజీచెప్పెను. ఆపురోహితుఁడు లోపలికిఁబోయి, యాసంగతి శేషగిరిరావునకుఁ దెలిపి యామనుష్యుని లోపలికి రానిచ్చుట కుత్తరు వతనివలనఁబొంది, శివాజీ కాయుత్తరవును దెలిపెను శివాజీ తన యనుచరులను బయటవదలి, తానుమాత్ర మొంటరిగా లోనికేగెను ప్రచ్ఛన్న వేషముతో నున్న శివాజీ నతఁడు తెలిసికొనకుండెను

శివాజీ—అయ్యా! నమస్కారము.

శే—ఏమి సమాచారము? నీ వెవఁడవు?

శివాజీ—నేను శివాజీ క్రిందియుద్యోగస్థులలో నొకఁడను. రాజకీయ రహస్యములనుగుఱించి శివాజీమహారాజుగారు మీతోఁ గొన్ని సంగతులను జెప్పుమని నాకుత్తరువు చేసినందున నేనిచటికి వచ్చితిని. అతని యుత్తరువునకు నిదర్శనముగా నతనియుంగరమును దెచ్చియున్నాను ఇదిగోచూడుము హిందువులలో శ్రేష్ఠులైన బ్రాహ్మణులకుఁ గూడఁ దురుష్కులసేవ వలన జీవింపవలసిన కాలమువచ్చినది మిక్కిలి శోచనీయము. తుల్జాపురమును బాడుచేసి, దేవాలయముల నీఘోరకృత్యము లొనర్చి బ్రాహ్మణహింస చేయుచుండు తురుష్కులఁ గొలుచు

చుండుటకంటె హీనవృత్తి యేది? నీవంటిబ్రాహ్మణులకు వారు దేవాలయములలో గోహత్యాదిపాపకర్మంబు లొనర్చుచుండు నపుడు ప్రక్కనుండి చూచుట యెంతకష్టముగా నుండును? అట్టి చాండాలురఁ గొల్చుట మీకుఁదగునా?

శే—దానికేమి చేయవచ్చును? నాకు హిందూప్రభువులయాశ్రయము దొరకినతక్షణమే తురుష్కులసేవ వదలుకొందును. కొలువులేకున్న మాబోటిబీదలు జీవించుట కష్టము.

శివాజీ—నీకట్టి యభిప్రాయముండిన నేను నిన్ను శివాజీవద్దకుఁ బిలుచుకొనిపోయి యుద్యోగ మిప్పించెదను. నాయం దతనికిఁ బూర్ణవిశ్వాసము గలదు.

శే—నీయభిప్రాయప్రకార మతఁడు నడచుకొనునని నమ్ముట యెట్లు? నీమాటమాత్రమున నే నచటికిఁ బోఁదగదు.

శివాజీ—(ముఖమునకుఁ గప్పుకొనియున్న చేతిగుడ్డను దీసివైచి) నేనెవ్వరైనది నీకుఁ దెలియునా?

శేష—మహారాజాగారా యీవేషమున వచ్చినది? ఏమాశ్చర్యము; నేనిదివఱకును జేసియుండినదుష్కార్యములకు నన్ను క్షమింపవలెను. నేనును మిగులఁ బశ్చాత్తాపతప్తుఁడనై యున్నాను హిందూమతోద్ధారణకు నెట్టిపనులనైనఁ జేసెదను. నావలనఁ గాదగిన పనులున్నఁ దెలుపుఁడు.

శి—తురుష్కసేనలో నష్టమాంశముకూడ మనకు సేన లేనందున నెదిరించియుద్ధముచేయుటవలనఁ బ్రయోజనముండదు.

శే—నేను వారి సీకనుమలనడుమవచ్చి యేమరుపాటున నిలుచునటులఁ జేసిన, పర్వతముల పైప్రదేశముల మీసేనల నిల్పి, యకస్మాత్తుగాఁ దురుష్కులపై బడునటులఁ జేసి జయముఁ గొనరాదా?

శి—మీరంతటి సాయమొనర్చిన జయముగలుగును. మీరిటులొనర్చిన గొప్పజాగీరులు, గొప్పయుద్యోగము, గౌరవము, విశేషధనమును నొసంగెదను.

శివాజీ యిటులాడినతోడనే, శేషగిరిరావు కలమును గాకితమునుదీసికొనిఅఫ్జుల్ఖానుకొకయుత్తరమునువ్రాసి, శివాజీ యనుచరుఁడగు కృష్ణాజీ యనువాని చేతికియ్యగా నతఁడిట్లుచదివెను. "నేను, శివాజీరాజును, అతని కోటను, బరివారజనమును జూచితిని. మిక్కిలియల్పముగా నుండుటవలన మన మేమాత్రమును భయపడవలసినదిలేదు. మీబలమునకును వారిబలమునకును హస్తిమశకాంతరమున్నది. ఐనను వారికి మఱింత వెఱపు గొల్పుటకును, మనకార్యములను సామోపాయముననే చక్కపఱచుకొనుటకును మీరు సేనాసమేతులై యిచటికివచ్చుట యుక్తమనితోఁచుచున్నది. రాజు మీకుఁబాదాక్రాంతుఁడై మిమ్ము శరణు వేఁడుటకు సిద్ధముగా నున్నాఁడు. కుశాగ్రబుద్ధులగు మీవంటిప్రభువులకింతకంటె నెక్కువవ్రాయుటయనావశ్యము. పిమ్మటశివాజీ కార్యదర్శిచేతి కాయుత్తరమునిచ్చి, యఫ్జుల్ఖాను కడకంపెను వారముదినములలో నాకార్యదర్శి యాయుత్తరము నఫ్జుల్ఖానుకుఁజేర్చెను. శేషగిరిరావు మిక్కిలి నమ్మకమును బొందినవాఁడయినందున నాయుత్తరములోని సంగతులను నమ్మి, శివాజీకోటకుఁ బ్రయాణసన్నాహము వెంటనే చేయించెను. తురుష్కగురువగు దస్తగిరిసాహేబునకుహత్యలు ఘోరకృత్యములు లేకపోవుటయనిష్టముగా నుండినను, రసూల్ఖాను మొదలగువారికి సంధియే యిష్టమైన కార్యము. మహారాష్ట్రులచేఁ బంపఁబడిన కార్యదర్శి తురుష్కసేనతోఁగూడనే పయనమాయెను.

అఫ్జుల్ఖాన్ సేనాసమేతుఁడై వెడలి ప్రతాపగిరికోటకు పోవుచుండుట, వివాహమహోత్సాహమునకు బంధువర్గముతోఁగూడ వరుఁడుపోవునటుల నుండెను. దారిలో వారేవిధమైన కష్టములును బొందక ప్రతాపగిరికి సమీపమున నున్న జౌలీ యను నొకపల్లెను జేరిరి. అచట శివాజీయొక్క కార్యదర్శితో నఫ్జుల్ఖాన్ కార్యాలోచన మొనర్చి, ప్రతాపగిరికి సుమారరమైలుదూరమున నొకసమీపప్రదేశమున నఫ్జుల్ఖాన్ శివాజీని సంధించునట్లును, ఇరువురును నొక్కొక్కయనుచరునిమాత్రము వెంటబెట్టుకొని సేనావిరహితులై మరునాఁడు దమ సంధి స్థలమునకు చేరునట్లును, నచట సంధివిషయమైన యేర్పాటులను సమక్షమమున శివాజీ యొప్పుకొనునటులను నిశ్చయ పఱచుకొనెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము

తురుష్కసేన జౌలీగ్రామమున నుండునపుడు ప్రతాపగిరి కోటయందు శివాజీ ముఖ్యులు గుమిగూడి, మఱుచటి దినమునఁ జేయవలసిన కార్యములకై యోచనచేయుచుండిరి. నాఁటిరాత్రి సుమారు పదిఘంటలకు శివాజీప్రభువు తన్నాజీ నెట్టాజీయనుమహారాష్ట్రముఖ్యులతోఁ గార్యాలోచన మొనర్చుచుండి యిట్లనియె

శివాజీ—తన్నాజీ, సమస్తమును సిద్ధముచేసితివా?

తన్నాజీ—అయ్యా, సర్వముసిద్ధము. అర్ధరాత్రమునకుఁ గామేశ్వరశర్మ మహారాష్ట్రయోధులతోఁ గూడి జౌలీగ్రామమునకుఁ జుట్టుప్రక్కలనుండు నరణ్యములో విడిసి యుద్ధసన్నద్ధుఁడైయుండును. ఇచటనుండి 4 ఫిరంగుల శబ్దము వినఁబడిన

వెంటనే తురుష్కసైన్యముపైఁ దుపాకులను గాల్చెదరు. నెట్టాజీ 5000 మందిమహారాష్ట్రవీరులను, మావలీ తెగవారిని సామనకోటకు దక్షిణ భాగమున నిల్పియున్నాఁడు. వారుతురుష్కులకు వెనుకనుండి తుపాకులను గాల్తురు. శత్రువులు పాఱిపోయి తప్పించుకొనుటకు సాధ్యపడనట్లు త్రోవలన్నియు నడ్డగించితిమి. 4000 మంది హేటకులీతెగ, మహారాష్ట్రులును సిద్ధముగానున్నారు. తురుష్కులు నిశ్శేషముగా హతమొందుటకు నావంతయు సందేహముండదు వారిటులఁ జిక్కుకొనుట యే యాశ్చర్యము.

శివాజీ — దేవీ ప్రసాదము. శాంకరీదేవి యీతురుష్కుల దౌర్జన్యమునకు సహింపక వారి నిటులఁ జిక్కించెను. మనకుఁ దప్పక జయముగలుగునని మాతల్లికి దేవిప్రత్యక్షమై తెలిపెను. మాతల్లి నా కీసంగతి నిన్నటిదినమునఁ దెలిపెను. నేను మాతల్లితో మాటాడి నిద్రింపవలెను. రేపటియుదయమున నీవు నాతోఁగూడ సంధించుస్థలమునకు రావలెను. ఇంక మీరును నిద్రింపుడు.

ఇటుల తన్నాజీకి సెలవిచ్చి తనతల్లివద్దకుఁ బోయి కొంత తడవుమాట్లాడుచుండి శివాజీ నిద్రించెను. మఱునాఁటియుదయమున శివాజీనిద్ర లేచి, కాలోచితకృత్యంబులఁదీర్చి, స్నానం బొనర్చి, దేవ్యాలయమునకేగి, దేవీ దర్శనంబొనర్చి, ధూపదీప నైవేద్యాదు లర్పించి, తల్లివద్దకువచ్చి, సాష్టాంగ ప్రణామం బొనర్చి, ఆమె యాశీర్వాదంబులఁగొని, భోజనం బొనర్చి, కవచాదులధరించి, యొకబాకును కవచములో మీఁజేతికడ దాఁచిపెట్టుకొనిఁ కుడిచేతఁ బులిగోరుఁ బోలు నాయుధమును రహస్యముగాఁ బూని వెడలెను.

ముందుదినమునఁ జేసికొనఁబడిన యేర్పాటు ప్రకారము సంధింపు స్థలమునకుఁ బోవుటకు నఫ్జుల్లాఖానును దస్తగిరి సాహేబును సూర్యోదయమైన రెండుగడియల ప్రొద్దునకు భోజనాది కృత్యంబులఁ దీర్చుకొని, యుడుపుల ధరించికొని పల్లకీలనెక్కి వెడలిరి. మహారాష్ట్రబ్రాహ్మణుఁ డొకఁడు ముందు దారి చూపుచుఁ బోవుచుండఁగా ఖానుగారు బల్లకిమీఁదఁబోయి, కొంతతడవునకు సంధింపు స్థలమును జేరి, యాబ్రాహ్మణునితో నిట్లనియె.

అ—ఇదివఱకు శివాజీ యిచటికి రాని కారణమేమి? అతనికొఱకు మేము కనిపెట్టుకొని యుండవలెనా?

బ్రా—అదిగో, (తూర్పుప్రక్కఁజూపి) ఆవచ్చు నిద్దఱిలోఁ బొట్టివాఁడే శివాజీ మహారాజ్.

అ—చేతు లేల పైకెత్తి కదలించుచున్నాఁడు.

బ్రా—ప్రక్కనుండు జనుల నావలకుఁ బొమ్మనుచున్నాఁడు. గొప్పప్రభువుగా నుండి మఱియొక ప్రభువుతో రాజ్యాంగవిషయముల మాటలాడుసందర్భమున సామాన్యుల జేరనిచ్చునా?

ఇటుల వారు మాటలాడుచుండఁగా శివాజీతణ్ణాజీలు సమీపించిరి. అఫ్జుల్లాఖాను త్తరువుమీఁద నాబ్రాహ్మణుఁడును బోయలును దూరమున కరిగిరి. శివాజీ సమీపించినతోడనే యఫ్జుల్లాన్ నెదురుగాఁబోయి నగుమొగముతో నతనికి సలామొనర్చి, మీవంటిగొప్పప్రభువుతో సఖ్యమొనఁగూడినందుకు చాల సంతసించుచున్నానని చెప్పెను. శివాజీయు సలాము నతనికిఁజేసి, యతనిని సంధింపు స్థలమున నేర్పఱచియున్న గుడారములోనికిఁ దీసికొనివెళ్లి ప్రక్కనఁ గూర్చుండెను. తణ్ణాజీదస్త

గిరి సాహేబులును నా గుడారమునకు వచ్చిచేరిరి. వారు గుడారమువచ్చి చేరిన రెండు నిమిషములకు శివాజి, దాచి యుంచుకొన్న తన యాయుధములతో నఫ్జుల్ఖాను శిరమును తటాలునఁ దెగవ్రేసెను. దస్తగిరిసాహేబును ఏమరుపాటున నున్నందున తణ్నాజీచే నటులనే జంపఁబడెను. అఫ్జుల్ఖానును జంపినవెంటనే శివాజీ యొకయీలవేసి సమీపమున డాగి యున్న సేవకులనుపిల్చి యుద్ధారంభమునకు సంజ్ఞగా తప్పెట లను గొట్టి ఫిరంగులను గాల్చునటు లుత్తరువుచేసెను. వెంటనే వారటుల నొనర్చిరి.

అచ్చటచ్చట ప్రాకులమాటునను బొదల మఱుఁగు నను, డాగియున్న మహారాష్ట్రు లేమరుపాటుననున్న తురుష్క సైన్యముపై ఫిరంగులను తుపాకులను గాల్చుటకుఁ బ్రారంభించిరి. ఆశ్వికభటులును బదాతులును దురుష్కభటు లేమరు పాటున నుండుటను చూచి హఠాత్తుగ వారిపైఁబడి కత్తులతో నఱకుచు బాకులతోఁ బొడచుచు విధ్వంసము చేయుచుండిరి. హుక్కా త్రాగుచుండువారును, బ్రాతఃకాలభోజన మొనర్చు చుండువారును, షికారి తిరుగువారును, స్నేహితులతో జూద ములాడువారును నై తురుష్కభటు లుండిరి. ఆ సమయమున హఠాత్తునఁ దుపాకులధ్వనులును ఫిరంగులశబ్దములును వినవ చ్చుటయు, గుంపులుగ శత్రువులు పైఁబడుటయుఁ గలుగుటవ లనఁ దురుష్కు లెల్లరుఁ బలాయితు లైరి. వేనవేలు తురుష్కులు హతులైరి. తురుష్కుల గుఱ్ఱములును, ఫిరంగులును, సామగ్రు లును మహారాష్ట్రుల స్వాధీనమాయెను. తప్పించుకొని పాఱి పోవ యత్నించిన తురుష్కులలో ననేకులు మహారాష్ట్రులచే బట్టువడిరి.

రసూల్ఖానును, నతని చెల్లెలగు గయానాయును, గతిప యపరివారముతోఁ దప్పించుకొని పాఱిపోయిరి. యుద్ధప్రారంభముననే తమకుఁ గలిగిన ముప్పును రసూల్ఖాన్ తెలిసికొనెను. మల్హారరావు రసూలునకు ముఖ్యానుచరుఁడును, బ్రాణస్నేహితుఁడును, బ్రతాపగిరి ప్రాంతములలోఁ జిన్నప్పుడు తిరిగిన వాఁడు నైనందున, రసూల్ఖాన్ మొదలగువారిని నలువది మంది నొక రహస్యమార్గమునఁ దీసికొనిపోయి శత్రుసంచార ప్రదేశమునకు వెలుపలఁ జేర్చెను. యుద్ధసంకులములో నున్న మహారాష్ట్రులు వీరిపోకను గమనింపఁజాలకుండిరి. మఱునాఁటి యుదయమునకుఁ బ్రతాపగిరి కిరువదిమైళ్ల దూరమునఁ దురుష్కుల స్వాధీనమునందుండు ప్రదేశమును రసూలు మొదలగు వారు చేరిరి.

---

## ఇరువదవ ప్రకరణము.

రసూల్ఖా నిపుడు చేరిన గ్రామమునకు కరూరని పేరు. అందుఁ దురుష్కులు వేలకొలఁది కాపురము చేయుచుండిరి. తురుష్క ప్రభువులే యీగ్రామమును బీజపూరు నవాబునకు లోఁబడి పాలించుచుండిరి. రసూలు మొదలగువారు కరూరు చేరిన మఱుదినమున, వనజాక్షి యెచటనుండునదియు, నేస్థితిలో నుండునదియుఁ దెలిసికొనిరండని చెప్పి రసూలు చారులను బంపెను. ఇట్లుపంపిన కొన్నిదినములకుఁ బిమ్మట రసూలుకడ కొక చారుఁడు వచ్చి యిట్లనియె.

చా—అయ్యా, మీ యుత్తరువు ప్రకారము మేము పోయి విచారించుటలో, వనజాక్షి రేపు మధ్యాహ్నమున వాయులూరు గ్రామములో సహగమన మొనర్చియగ్నిప్రవేశము

చేసి యాత్మహత్య గావించుకొనఁ బోవునటుల విని, వాయు లూరకుఁ బోయితిమి. అచట వనజాక్షిని బ్రత్యక్షముగాఁ జూచితిమి. అగ్ని ప్రవేశము చేయుట నిశ్చితమైన విషయమే. ఆయూర ననేకుల విచారించి నిజము తెలిసికొంటిమి.

రసూ—ఆమె కట్టి కష్టమేల కలిగెను. అగ్ని ప్రవేశము చేయవలసినట్టి సందర్భము లెట్లు తటస్థించెను.

చారు—కామేశ్వరశర్మ పలుమాఱు లామెను బలాత్కారము జేయఁ బ్రయత్నించుట మీ రెఱిఁగినవిషయమే యయియుండును. మీ సేనతో నామె వచ్చుచుండినప్పుడు కామేశ్వరశర్మ కుట్రవలన వనజాక్షి యెక్కియున్న పల్లకి యామె యెఱుకలేకయే రాత్రిపూట ముంజామున నొక చిన్న పల్లెలోనికిఁ దీసికొనిపోఁబడెను. పల్లకిమోయు బోయీలు కామేశ్వరశర్మవద్ద లంచము తీసికొని యీకార్య మొనర్చిరి. వనజాక్షి కొనిపోఁబడిన పల్లె కకస్మాత్తుగా, నాగరాజరా వను శివాజీ క్రిందియుద్యోగస్థుఁ డొకఁడు వచ్చి, యామెకుఁ గామేశ్వరశర్మచే మానభంగము గలుగనీయక కాపాడి, యామెను దన రక్షణలో నుంచుకొనెను.

ర—అటులుండఁగా నీఘోరకృత్యమునకు నామెపూను కొననేల?

చా—నాగరాజరా వామెను గుమార్తెవలెఁజూచుకొనుచుఁ గాపాడుచుండెనుగాని, ఆయన యింటిలోనున్న వితంతువగు నామె చెల్లెలును, బురోహితులు మొదలగు శుష్కవైదికులును, వనజాక్షి యౌవనవంతురాలయి, తురుష్కుల స్వాధీనమునఁ గొన్నిదినము లున్నందున నాగరాజరా వామె నింటఁ జేర్చఁగూడదని నొక్కి వక్కాణించిరి. అంతట నాగరాజరా

వామెను వెడలఁగొట్టెను. తనకు దిక్కు లేమిచే మిక్కిలి భయ పడి ప్రాణత్యాగ మొనర్చి మానరక్షణ మొనర్చుకొనవలెనని సహగమనము చేయుటకు నిశ్చయించెను. అదియుగాక శుష్క వైదికులగు బ్రాహ్మణు లామెను సజాతీయులలోఁ జేరనీయక బాధ పెట్టుచుండుటవలన నామె యీపనికి సాహసించెను. రేపు తప్పక యీ కార్యము జఱుగును.

ర—ఇక్కడి కాపల్లె యెంత దూరమున నున్నది? కామేశ్వరశర్మ మొదలగు వారచటికి సమీపమున నున్నారు గదా?

చా—ఇక్కడి కాపల్లె సుమారు పదునాలుగుమైళ్ళ దూరమున నున్నది. కామేశ్వరశర్మ మొదలగువారచటికి రా నేఱరు. కామేశ్వరశర్మ వనజాక్షీవిషయమున నొనర్చిన యపకారములును దౌర్జన్యములును జారుల మూలమున శివాజీకిఁదెలిసెను. శివాజీ ధర్మనిరతుఁడును బరస్త్రీవిముఖుఁడును, దైవభక్తి గలవాఁడును నగు ప్రభువైనందున, నిఁక నట్టి దుష్కార్యముల నొనర్చినఁ గఠినశిక్ష విధించెదనని కామేశ్వరశర్మకుఁ దెలిపెను. కాఁబట్టి కామేశ్వరశర్మ వాయులూరునకువచ్చుటకష్టసాధ్యము వచ్చినను రహస్యముగాఁ బరివారహీనుఁడై వచ్చును. సహగమన ప్రదేశమునఁ గార్యదర్శకు లగువారు శుష్కవైదికులగు బ్రాహ్మణులు. సోమయాజులు, దీక్షితులు, ఘనపాఠులు, సాంగాధ్యాపకులు, శ్రౌతులు, ఉపాధ్యాయులు మొదలగు బిరుదులుగల విప్రులే యీ వితంతువుల కనుకూల శత్రువులు.

రఘు—(మల్హారరావు వంకం జూచి) మల్హారరావూ! హిందూసంఘమున వితంతువులపై వైదికులకు ద్వేషము గలదా? వారికి భూతదయ తక్కువా!

మ—శాస్త్రార్థ మెఱిగి పండితులై స్వతంత్రముగా జీవనముఁ జేయఁగలవారి కెన్నఁడును భూతదయ తక్కువగా నుండదు. అర్థమేమాత్రమును నెఱుగక, వేదములు వల్లె వేయుటతోడనే మేముకృతార్థులమని మిట్టిపడువారును, వైదిక కార్యములయందు వచ్చు దక్షిణల కాశపడి సోమరిపోతులై పాపభీతిలేక తిరుగు పురోహితులు మొదలగువారికి భూతదయ శూన్యము. వీరు మూఢపిశాచగ్రస్తులై పూర్వాచారపరాయణులై, వితంతువులకుఁ బునర్వివాహము చేయఁగూడదనియు, వారికి ముండనాదికార్యములు జఱుపవలయుననియుఁ బోధించుచుందురు. ఈజన్మమున శుష్కవైదికులై వితంతువుల బాధించుచుఁ బూర్వాచార పరాయణులగువారు పైజన్మమునవితంతువులగుదురనియు, మఱుజన్మమున వారు మరల శుష్కవైదికు లగుదురనియుఁ గొందఱు చదువుకొనిన హిందువుల నమ్మకము. మీామతగురువులగు దస్తగిరి సాహేబుగారికి భూతదయ యేమాత్రమున్నది? అతఁడు, తుల్జాపురిలో నొనర్చిన ఘోరకృత్యముల ఫలమేకదా యిపు డనుభవించెను. తురుష్కులు, తుల్జాపురిలో నొనర్చిన దౌర్జన్యమునకుఁ బ్రతిఫలముగాఁ బ్రతాపగిరిలో గుంపులు గుంపులుగా మడయుట సంభవించినది. ఎట్టికాలమునను దుష్కార్యములకు దైవశిక్షతప్పదు. ఏమతము వారికిని భూతదయ ముఖ్యగుణము.

ర—నీవు చెప్పినదంతయు వాస్తవమే. మనము సాధ్యమైనంత సాయ మొనర్చి, యౌవనజాక్షి నాత్మహత్య చేసికొనకుండఁ జేసి, కామేశ్వరశర్మ మొదలగువారి వలన నిఁక నుపద్రవము లేకుండునటులఁ గాపాడుట కర్తవ్యముగదా? అది మనకు ముఖ్యమైన ధర్మము. ఇతరుల యాపదలను

జోఁగొట్టి యుపకారముచేయుటయే మానవజన్మ మెత్తినందులకు ముఖ్యప్రయోజనము.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

తుల్జాపురిలోఁ దురుష్క దండయాత్ర యయిన మఱునాఁడు సాయంకాలమునకు మహాదేవశాస్త్రులును, పార్వతమ్మయు, గంగాభాయియు, తమ స్వగృహమునకు వచ్చి చేరిరి. వనజాక్షీమాత్రము గృహమున లేనందున, మహాదేవశాస్త్రులు చింతాక్రాంతుఁడై, యామెను వెదకుట కనేకులను బంపెనుగాని, విఫలప్రయత్నుఁడయ్యెను. దండయాత్ర ముగిసిన కొన్ని దినములకు బాటసారియగు బ్రాహ్మణుఁ డొకఁడు శాస్త్రులుండు నింటికి వచ్చియుండి, వాయులూరను గ్రామమున వనజాక్షియను బ్రాహ్మణవితంతు వింక నాలుగుదినములలో సహగమనము చేయఁబోవు చున్నదనియు, దానిని జూచుటకు వేనవేల బ్రాహ్మణులు పోయెదరనియుఁ దెలిపెను. సహగమనము చేయఁబోవు స్త్రీ తన కూఁతురుగానే యుండవచ్చునను సందియము గలవాఁడై మహాదేవశాస్త్రులు తక్షణమే భార్యలను వెంటఁబెట్టుకొని పల్లకిపై నెక్కి వాయులూరికి పోయెను.

తుల్జాపురివదలిన మూఁడుదినములకు వీరు వాయులూరు గ్రామమును జేరిరి. వాయులూరు కృష్ణానదీ తీరముననుండు గొప్ప యగ్రహారము. అందు దేవాలయము లనేకములున్నవి. ప్రతి సంవత్సరమును బ్రహ్మోత్సవములు జరుగుచుండుట వలన నీ గ్రామమునకు ననేకులు దూరమున నుండియు నుత్సవకాలమున వచ్చుటగలదు. మహాదేవశాస్త్రులును బలుమా

ఱీయుత్సవకాలములలో నిచటికి వచ్చుచుండినందున నాగ్రామ నివాసియుఁ దనకు మిత్త్రుఁడును ధర్మశాస్త్ర వేత్తయునగు సదా శివ శాస్త్రులయింట బసచేయ నిశ్చయించి, వారూరిలోనుండు సంగతిని విచారించి తెలిసికొని వారి యింటికిఁ బోయిరి. వారు పోవుదారిలోనే, యాసహగమనవిషయమై విచారింపఁగా, సహ గమనముచేయఁబోవు స్త్రీ సదాశివశాస్త్రులయింటనే యుండు నట్లు తెలిసెను.

మహాదేవశాస్త్రులు మొదలగువారు సదాశివ శాస్త్రులుండు గృహమునకు వచ్చినతోడనే సదాశివశాస్త్రి లెదురుగఁబోయి, తనయింటికిఁ బిలుచుకొనివచ్చి వీధి తిన్నెపైన గూర్చుండఁబెట్టి యిట్లనియె.

సదా—తాము వచ్చుట నాకు మిక్కిలి సంతోష కరమైనదిగాని నేఁ డిచట ఏతంతు వొకతె సహగమనమునకై విడిసియున్నది. ఆమె రాజకీయోద్యోగస్థులచే నిటకుఁ బంపఁ బడినది. నేఁటి మధ్యాహ్న మాసహగమనము ముగియును. కనుక మీరు దయయుంచి, మన ప్రక్కయింటనుండు దీక్షితులవారి గృహమున నేఁడు బసచేయుఁడు; రేపు మనయింటికి రావచ్చును. (తన శిష్యు నొకనిఁజూచి) ఈ స్త్రీలను బ్రక్కయింటికిఁ దీసికొనిపోయి, దీక్షితులతో వీరు నాకాప్తులని చెప్పి, యచ్చట విడియించుము. వారి మాటలను నచటికిఁ జేర్పుము. వారికి భోజన సామగ్రుల నిమ్ము. (అని మహాదేవశాస్త్రులను జూచి) అయ్యా, మీతోఁ గొన్ని సంగతులు రహస్యముగా మాటలాడవలయును. లోనికిరండు,(అని లోపలికిఁబిలుచుకొని పోయి యొకగదిలోఁ గూర్చుండఁబెట్టి తలుపు మూసికొని) మీకు వనజాక్షీ యను కుమార్తెగలదా?

మ—కలదు. ఆమెను వెతకుకొనియే నేనిపుడు వచ్చితిని. ఏమి ఆమె విషయమైనసంగతి? తురుష్కులు తుల్జాపురిని ముట్టడించిన దినము మొదలు నేటివఱకు నా కామె యగుపడ లేదు. మీకుఁ దెలిసినసంగతుల శీఘ్రముగాఁ దెల్పుఁడు. ఆమె యెచట నున్నది?

సదా—(కన్నీరుగార్చుచు) ఆమెయే యిచటనుండునది. ఆమెయే సహగమనము చేయఁబోవు స్త్రీ. హా, దైవమా! ఇటువంటి సద్బ్రాహ్మణునికా యింతదుఃఖము గలిగించితివి.

మ—ఆ. ఆమెయేనా, నాపట్టికా యీకష్టము! ఆమెకీ గతియా వచ్చెను?

సదా—మీరందఱు చనిపోయినట్లు జనులెల్ల నిచటఁ జెప్పుకొను చుండుటయుఁ, గామేశ్వరశర్మ మూలముగ మానభంగము గలుగునను భీతియు నామె కిటుల నిశ్చయించుటకుఁ గారణములు. సహగమనముతోఁ జేరిన వైదికకార్యములన్నియు ముగిసెను. ఇంకేమి చేయవచ్చును? ఇఁక నామె విషయమై మీరు చింతించుట గతజలసేతుబంధనము. మీరు మార్గాయాసమున డస్సియున్నారు. శీఘ్రముగ స్నానం బొనర్చి ఫలాహారము చేయుఁడు.

మ—నే నామెను జూడవలయు నను భ్రమతో నున్నాను. పదినిమిషము లామెతో మాట్లాడుటకు నేర్పాటు చేయుఁడు

సదాశివశాస్త్రి లాప్రార్థన కంగీకరించి యతనిని వనజాక్షి యుండుచోటునకుఁ బిలుచుకొనిపోయెను. వనజాక్షి యుండుస్థల మొక పెద్దపిశాలమైనగది. అందు బ్రాహ్మణస్త్రీలనేకులు గంధపుష్పాక్షతలఁ బళ్ళెరములనిడుకొనినిలిచియుండిరి.

మంత్రములు పఠించుచు వైదిక బ్రాహ్మణులు కొందఱచ్చట
నుండిరి. ఆగదివాకిట తోరణములు కట్టఁబడియుండెను నడుమ
నూతన వస్త్రభూషణాదులచే నలంకరింపఁబడినదై వనజాక్షి
యొక్క పీఁటమీఁదఁ గూర్చుండియుండెను. ఆమె యాకారము
నూతన వధువును బోలియుండెను. కాని యామె చిత్తవృత్తి
నేరముచేయకయే యురి తీయఁబడుటకుఁ గొనిపోఁబడు నిర్భా
గ్యునిమనస్సును బోలియుండెను. అట్టిసమయమున మహాదేవ
శాస్త్రి లాగదిలోనికిఁబోయి, "అమ్మా, వనజాక్షీ, వనజాక్షీ"
యనుచు నేడువఁగా నామె తటాలున లేచి తండ్రివద్దకుఁబోవుట
కుద్యుక్తురాలాయెను. అంతలో నచటనున్న వైదికబ్రాహ్మణు
లందఱు నొకటిగాఁ జేరి, యామె నడ్డగించి, యాస్థానమును
వదలి పోఁగూడదని చెప్పి, మహాదేవశాస్త్రిలను వెంటనే
వెలుపలికంపిరి. కిరాతులచే బలికిఁ బట్టుకొని పోఁబడుచున్న
మేకపిల్లను బోలియున్న తనకూఁతు నవస్థను దుఃఖించుచుఁ
జేయునది లేక మహాదేవశాస్త్రిలు వాకిటికివచ్చి దీనుఁడై యొక
తిన్నెపైనఁ గూర్చుండి యుండెను.

సుమారు పదిగడియల ప్రొద్దెక్కినపిమ్మట పల్లకి
యొకటి, వాద్యములతోడను, నాగస్వరములతోడను నా
యింటి వాకిటికిం దేఁబడెను. వెంటనే పురోహిత బ్రాహ్మ
ణులు కొందఱు వనజాక్షిని బట్టుకొనివచ్చి, యాపల్లకిలోఁ
గూర్చుండబెట్టిరి. జాజిపువ్వులతో నిండిన యొక గంప నామె
ముందటఁ బెట్టి, "నీకు నమస్కారము లొనర్చు బ్రాహ్మణ
ముత్తైదువల పైనఁ జల్లుము" అని చెప్పిరి. నమస్కారములు
చేయునైదువలపైఁ బుష్పములుచల్లినతోడనే వాద్యఘోషము
లతోడఁ బల్లకి కదలెను. వైదిక బ్రాహ్మణులు నుదుటను, వక్ష

మునను, హస్తములను, విభూతిపూసికొని కంఠము రుద్రాక్ష పేరులను బూని వేదమంత్రంబులఁ బఠింపుచు, పల్లకివెంటఁ జనుచుండిరి. వీధిలోనుండువారందఱును "జయకాళీ,జయజయ తుల్జామతా" యని కేకలు వేయుచుండిరి. మహాదేవశాస్త్రులు దుఃఖమగ్నమానసుఁడై పల్లకివెంటనే పోయెను.

కొంతవడికి పల్లకి శ్మశాన భూమిచేరెను. చితియందు గంధపుఁ గట్టెలును బిడుకలును పేర్పఁబడియుండెను. దానివద్దఁ బల్లకిఁ నిలుపఁబడెను. ముఖ్యపురోహితుఁడు వనజాక్షిని వెంటఁ బెట్టుకొని, చితిప్రక్క నిలిచి కొన్ని మంత్రములు పఠించి, చితిక మూఁడు ప్రదక్షిణము లొనర్చి, నీవందు దర్భతోఁజేయఁ బడి పరుండఁబెట్టఁబడియున్న పురుషవిగ్రహముప్రక్కన శయనింప వలయునని వనజాక్షి కాజ్ఞాపించెను అంతట వనజాక్షి దుఃఖార్ణవమగ్నమానసురాలై, కన్నీరుగార్చుచు నిమిషము నిలిచి, మూర్ఛనొంది కొంతవడికిఁ దెప్పిఱిల్లి లేచి చితికిప్రదక్షిణ మొనర్చెను. మహాదేవశాస్త్రులు దూరమున నిలిచి ముఖముపైన గుడ్డ కప్పుకొని యేడ్చుచుండెను.

కామేశ్వరశర్మ, వనజాక్షి సహగమన సమాచారమును, గొందఱు వైదికబ్రాహ్మణులవలన విని, తత్క్షణమే ప్రయాణమై సహగమనమునకు నిర్ణయింపఁబడిన దినము ఉదయమయిన జాము ప్రొద్దుకు వాయులూరికి వచ్చెను. వనజాక్షి యెడల నితఁడు చేసిన దుండగములనువిని, ఇఁక నామె విషయమున దౌర్జన్యము చేసినచోఁ గఠినశిక్ష నతనికి విధించునట్లు శివాజీ యితనికిఁ జెప్పియుండెను. కాఁబట్టి యితఁడు పరివారహీనుఁడై వాయులూరికి వచ్చెను. వనజాక్షిపై మోహమప్పటికిని దగ్గనందునఁ గడపటిదినమునఁ జూచి రావలెనను నభిలాష

తోను, సామోపాయమున నొకవేళఁ దనకుఁ స్వాధీనపడునను నాశతోను నతఁడు వచ్చెను.

సాధ్యమైనంత యత్నము చేసి, యింతకుముందు తనచే రక్షింపఁబడినదగు వనజాక్షిని, గాపాడుట పురుషధర్మమని యెంచి, రసూల్ఖాను నూరుగురు యుద్ధభటులను వెంటఁబెట్టు కొని, తుపాకులు మొదలగు నాయుధములతో నాఁటి యుద యము ప్రయాణమై, యా శ్మశానభూమికి సమీపమున నున్న చిన్న యడవికి జాముప్రొద్దునకు వచ్చిచేరెను. అతఁడు కొందఱు యుద్ధభటులను బ్రాహ్మణవేషములతో శ్మశాన భూమికిఁ బోయి బ్రాహ్మణులతోఁ గలసియుండి, యచటికి వనజాక్షి వచ్చిన వెంటనే యొకనిని దారుదాగియుండుచోటి కంపునటు లాజ్ఞాపించెను. ఆ భటు లటులనే యొనర్చినందున ఆయుధపాణులై యుద్ధమునకు సిద్ధముగనుండు నతఁడు, భటుల తో శ్మశాన భూమికిఁ దటాలున వచ్చెను. అప్పుడు వనజాక్షి మూర్ఛదేరి చితికిఁ బ్రదక్షిణ మొనర్చుచుండెను. యుద్ధభటు లకస్మాత్తుగఁ బైఁ బడినపు డచట నున్నవారు, చితిలోని కట్టెల నెత్తికొని యెదిరింపఁ బూనిరి గాని, తురుష్కుల తుపా కులవ్రేటులును కత్తుల పోటులును దగిలినంతటఁ బలాయను లైరి. ఆ సమయములో రసూల్ఖాన్ వనజాక్షి నకస్మాత్తుగా నెత్తుకొని తన యశ్వముపైఁ బెట్టి తాను నా యశ్వముపై నెక్కెను. ప్రక్కనున్న కామేశ్వరశర్మ వనజాక్షిని విడిపింప నెంచి యొరలోనున్న కత్తినిమాపికొనిరసూల్ఖానుపై కుఱికెను గాని, సమీపమునున్న తురుష్కయోధు లిద్దఱు కామేశ్వ రశర్మ పైఁబడి యతని శిరస్సును నఱికి మృతి నొందించిరి. రసూలును వనజాక్షిని గుఱ్ఱముపైఁ బెట్టుకొని సపరివారుఁడై

తత్క్షణమే కదలిపోయెను. నాఁటి సాయంత్రమునకుఁ, దాను ముందు విడిసియున్న గ్రామమును, రసూల్ఖాను చేరి, యట నొక బ్రాహ్మణుని బిలిపించి వనజాక్షికి నన్నపానాదు లిచ్చు నటు లేర్పాటొనర్చెను. అనంతర మతఁడు మూఁడుదినము లాయూరిలోనుండి, నాల్గవదినము వనజాక్షిని బిలుచుకొని బీజపూరుకుఁబోయి, యట నామె కొక ప్రత్యేకగృహంబును గుదిర్చి, భోజనాదుల కొక బ్రాహ్మణు నేర్పఱచెను.

వనజాక్షి మొదలగువారు బీజపూరు చేరిన కొన్నిదినములకు, రసూలు చెల్లెలగు గయానాకును వనజాక్షికిని గాఢ మైత్రి గలిగెను. అందువలన గయానా నవయౌవనదశయం దున్న వనజాక్షి సుందరరూపమును జూచి, యనాథయై యుండు నామెయొక్క దుస్థితికి దుఃఖమునుబొంది, యామెను వితంతు కష్టమునుండి తొలగింపవలయునని నిశ్చయించెను. జారత్వాది దుర్గుణము లామెకు లేకుండుటయు, స్వజాతి బంధువులతో నామె చేరుటకు సాధ్యము లేకుండుటయు, జక్కగా విచారించి తెలిసికొని, యవివాహితుఁడై యున్న తనయన్న రసూల్ఖానునకు నీమెకును వివాహము జరిపింప వలయునని యెంచి, తన తలంపును రసూల్ఖానునకును వనజాక్షికిని దెలిపెను రసూల్ఖా నంగీకరించెను. కాని, హిందూ మతమందుఁ బూర్ణమైన నమ్మకము గలిగినందువలన వనజాక్షి తన మతాచారములను వదలి పెండ్లి చేసికొనుట కిష్టము లేకుండెను. భోజనమునందును, మతాభిప్రాయములందును సంబంధము లేక, వీరికి వివాహాదులుజరుగు నటుల గయానా యేర్పాటుచేయుటకై యొకనాఁడు వనజాక్షి యుండు గృహమునకు రసూలును బిలుచుకొని వచ్చి మువ్వురునుమాత్ర మచటనుండుసమయమున వనజాక్షితో నిట్లనియె.

గయానా—అమ్మా, నీకుఁగల శత్రు భయమంతయుఁ దీఱెను. ఇఁక నెవరును నీకుఁగీడు చేయుటకు సాధ్యముండదు, మాయన్న యెడలఁ బ్రాణ ముండువఱకును నెట్టి భయమును లేక నిమ్మళముతో నుండవచ్చును. నీకుఁగలిగి నన్ని యాపదలు వేఱొక స్త్రీ కిదివఱకుఁ గలిగినట్టుల విని యుండ లేదు. దిక్కు లేని యబలవయ్యు ఇన్ని యాపదలకుఁ దప్పించుకొని నెమ్మది గాంచుట చిత్రము. నీయదృష్టమే యదృష్టము. అంతటికష్టములు గలిగియు, మాన గౌరవములను గాపాడుకొనిన నీ చరిత్రయే శుద్ధచరిత్రము. నీకెన యగు బుద్ధిమంతురాలిని నేఁ జూడ లేదు.

వన—ఆహా, బలవంతులచే నాకుఁ గలిగిన యిక్కట్టులును నా మానప్రాణములకు నేటివఱకు భంగము గలుగకుండుటయు తలచుకొన నచ్చెరువు గలుగుచున్నది!

ర—ఏకాలమునను సుఖపడుటకొఱకై పరులను హింసించువారికి దైవమువలన శిక్ష తప్పక గలుగును. దైవభక్తియు భూతదయయు గల వారికెట్టి యాపదలు ముట్టినను సర్వశక్తుఁడగు పరమేశ్వరుఁడు వారి యాపదలఁ బాపి వారికి సుఖసంతోషములఁ గూర్చును. తుల్జాపురిలో జీవహింసకు ముఖ్యకారకులగు నఫ్జుల్ఖాను దస్తగిరిసాహేబులు హింసింపఁ బడుటయు, నిన్ను బలాత్కారముచే స్వాధీన పఱచుకొనుటకు దుష్కార్యము లొనర్చిన కామేశ్వరశర్మ మరణమును దుష్టులకుఁ గలుగు దైవశిక్షకుఁ దార్కాణములు. నిరంతరదైవభక్తిగల శివాజీ మహారాజు తనకంటె నెన్నియో రెట్లు బలవంతులగు శత్రువుల జయించుటయు, నబలవును నేకాకియునగు నీవు ప్రబల శత్రువులవలన, గలిగిన విపత్పరంపరల

నుండి తప్పించుకొని నిమ్మళము గనుటయు దైవ సహాయము వలననే గదా.

వ—సత్ప్రవర్తనగలవారి కిట్టియాపదలు గలుగనీయ కయే దైవము కాపాడరాదా ? దైవము దుష్టుల కింతశక్తి యేల నిచ్చెను

ర—ఆపదలు గలుగుటచేతనే వీరికి శాశ్వతమైన కీర్తి గలుగుచున్నది. ఆపదలు లేకున్న సాధువుల గుణము లంత ప్రకాశింపవు. ఆపదలు, ఓర్పును, దైవభక్తిని, భూతదయను, లోకజ్ఞానమును వృద్ధి చేయుచున్నవి. దుష్టులు లేకున్న శిష్టులయుత్కృష్టత స్పష్టముగాదు. దుర్యోధనుఁడు లేకున్నఁబాండవు లంతకీర్తిని గందురా? హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని శైశవముననే జంపియుండిన ప్రహ్లాదుని జనులు స్మరింపవలసిన యావశ్యకత యుండునా? అతని చరిత్రవలన లోకులకుఁదెలియదగిన నీతి యుండునా ?

వ—నిజమే; జనులకు లోకజ్ఞానముగూడ నిడుమలు పడుటచేఁ గలుగుచున్నది. నా స్వజాతివారివలన నాకెగ్గుఁగలుగుటయు మీచేతఁ గాపాడఁబడుటయు మతజాతిభేదములు లేక యొక్కొక తెగయందును సుగుణవంతులును గ్రూరాత్ములున్నారని తెలుపుచున్నవి. నన్ను విపత్సముద్రములో మునుగనీక కాపాడి దరిచేర్చిన మీకుఁ గృతజ్ఞురాలనై యున్నదానను. మీకు నేఁజేయఁగల ప్రత్యుపకారము లేమియే నాకుఁగల విచారము.

గ—నీవు చేయఁగల ప్రత్యుపకారము లేక యేమి? నీ వతని వివాహము చేసికొనుటయే ప్రత్యుపకారము దీనికి నీవు సమ్మతింపవలయునని బుద్ధిశాలివగునీకు నేను జెప్పనక్కఱలేదు.

వ—నా ప్రాణమును దేహమును నీతని స్వాధీనమై కనుక నేను దీని కే మాత్రము నడ్డుచెప్పజాలను.

రసూ లదివఱకు రెండుమాఱులు మానప్రాణభంగములు గలుగనీయక తన్నుఁ గాపాడినందునను, తా నిదివఱ తనజాతివారివలన వదలఁబడి, వ్రతాదులు జరిపించి పుణ్యము బొందుటకు సాధ్యము లేకుండుటవలనను గృతజ్ఞురాలయి రసూలును వివాహము చేసికొనుట కంగీకరించెను. పిమ్మటఁ గొన్ని దినములలో రసూల్ఖాను వనజాక్షుల వివాహము మిక్కిలి వేడ్కగా జరిగెను. వీరి స్నేహము యావజ్జీవ పర్యంతము చెడ యుండెను; రసూల్ఖా నామెవలన నిద్ధఱుకుమారులఁ గాంచి వేఱువివాహము చేసికొనకయే తన జీవయాత్ర గడపెను.

ప్రహారసింగు, తన వాడుకప్రకారము దోపిడి చేయుచుండినందున, బీజపూరు నవాబు 10000 సైన్యము నిట్టాగ్రామమును ముట్టడించుట కంపెను. అపుడా సైనికులకు జరిగిన యుద్ధములో ప్రహారసింగు మొదలగువారు హతులైరి. ఇట్టా గ్రామమును బీజపూరు నవాబుగా రాక్రమించుకొనిరి.

సమాప్తము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1930.